# వీక్షణం

ఆర్థిక, సామాజిక పత్రిక

జులై 2005 48 రూ. 10

- ఆంధ్రప్రదేశ్‌లో విద్యారంగం - సమీక్ష
- రైతాంగ దుస్థితి - క్రిస్టియన్ ఎయిడ్ నివేదిక
- భాజపాలో అంతర్గత ఘర్షణలు
- మానవ సంబంధాల 'మార్కెటింగ్'
- సంపాదకుడిపై నిర్బంధం



# డా.బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

హైదరాబాద్ - 500 033

## నేరుగా ప్రవేశ ప్రకటన

**బి.ఎ./బి.కాం./బి.ఎస్.సి. ప్రథమ సంవత్సర యు.జి. డిగ్రీ కోర్సులు**
**(2005-06)**

దిగువ తెలిపిన పరీక్షలు ఉత్తీర్ణులైన అభ్యర్థులనుండి విశ్వవిద్యాలయం దరఖాస్తులను కోరుచున్నది.

1.) ఇంటర్మీడియట్ లేదా తత్సమాన పరీక్ష (కనీస వయో పరిమితి లేకుండా) 2.) 2001 నుండి 2004 మధ్య అర్హత పరీక్ష ఉత్తీర్ణులైన అభ్యర్థులు

**దరఖాస్తు ఫారం ఎలా పొందాలి?:**

**1) స్వయంగా :** ది రిజిస్ట్రార్, డా.బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం పేర చెల్లించబడిన ఏదేని జాతీయ బ్యాంకు నుండి తీసిన డిమాండ్ డ్రాఫ్ట్ రూపంలో రూ.50/- చెల్లించి **ఉ.11.00 గం.లనుండి సా. 4.30 గం.ల** మధ్య విశ్వవిద్యాలయ హెడ్ క్వార్టర్స్, రోడ్ నెం. 46, జూబ్లిహిల్స్, హైదరాబాద్ నుండి పొందవచ్చును.
సోమవారాలు మరియు రెండవ శనివారం స్థానంలో వెంటనే వచ్చు మంగళవారం మినహా అన్ని పనిదినములలో ఉ. 11 గం.ల నుండి సా. 5 గం.ల మధ్య ఈ ప్రకటనలో జాబితా చేయబడిన బిఆర్ఎఒయు అధ్యయన కేంద్రాల నుండి కూడా స్వయంగా దరఖాస్తును పొందవచ్చును.

**2) పోస్ట్ ద్వారా :** పోస్ట్‌ద్వారా దరఖాస్తు ఫారం పొందగోరే అభ్యర్థుల విషయంలో, "ది రిజిస్ట్రార్, బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం" పేర ఏదేని జాతీయ బ్యాంకునుండి రూ.70/- లకు తీసిన డిమాండ్ డ్రాఫ్టుతో పాటు పిన్‌కోడ్‌తో పూర్తిచేసి చిరునామా తెలుపుతూ లిఖిత పూర్వక అభ్యర్థనను "ది డైరెక్టర్, స్టూడెంట్ సర్వీసెస్, డా.బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, రోడ్‌నెం.46, జూబ్లిహిల్స్, హైదరాబాద్ - 500033" కు పంపవలెను.

**అభ్యర్థులు ప్రవేశం కోరుతున్నటువంటి అధ్యయన కేంద్రం వద్ద స్వయంగా లేదా పోస్టు ద్వారా పూర్తిచేసిన దరఖాస్తు ఫారాలు దాఖలు చేయుటకు మరియు అమ్మకానికి ఆఖరు తేది: 02-08-2005. రూ. 100/- జరిమానాతో ఆఖరు తేది: 15-09-2005**

సం/- రిజిస్ట్రార్

**ఆదిలాబాద్:** ప్రభుత్వ డిగ్రీ కళాశాల(పురుషులు), ఆదిలాబాద్, ఎస్.కె.ఇ. డిగ్రీ కళాశాల, సిర్పూర్ కాగజ్‌నగర్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నిర్మల్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, బెల్లంపల్లి , ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మంచిర్యాల, జి.ఆర్.పి ప్రభుత్వ డిగ్రీ కళాశాల, భైంసా, ప్రభుత్వ కళాశాల, ఆసిఫాబాద్, **అనంతపూర్:** ప్రభుత్వ డిగ్రీ కళాశాల(పురుషులు), అనంతపూర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఉరవకొండ, అనంతపూర్, ఎస్.డి.జి.ఎస్. కాలేజ్, హిందూపూర్, ఎస్.కె.పి. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గుంతకల్, కె.హెచ్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ధర్మవరం, అనంతపూర్, కె.ఎస్.ఎన్. ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, అనంతపూర్, ఎస్.టి.ఎస్.ఎన్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కదిరి, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కళ్యాణదుర్గం, సర్. సి.వి.రామన్ డిగ్రీ కళాశాల, తాడిపత్రి, **కడప:** ప్రభుత్వ డిగ్రీ కళాశాల (పురుషులు), కడప, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పోరుమామిళ్ళ, ప్రభుత్వ జూనియర్ కళాశాల, జమ్మలమడుగు, ఎస్‌కెఆర్ అండ్ ఎస్‌కెఆర్ ప్రభుత్వ మహిళా కళాశాల, కడప, ఎస్.సి.ఎన్.ఆర్. ప్రభుత్వ కళాశాల, ప్రొద్దుటూరు, లయోలా డిగ్రీ కళాశాల, (వైఎస్ఆర్ఆర్), పులివెందుల, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రాయచోటి, ఎస్.ఆర్.ఎన్.బి డిగ్రీ కళాశాల, బద్వేల్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రాజంపేట, **చిత్తూరు:** ఎస్.వి. ఆర్ట్స్ కళాశాల, తిరుపతి, శ్రీరామా డిగ్రీ కళాశాల, తిరుపతి, ఎస్.పి.డబ్ల్యు. డిగ్రీ కళాశాల, తిరుపతి, ప్రభుత్వ బాలికల జూనియర్ కళాశాల, పుత్తూరు, సి.ఎన్.ఆర్. ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, పీలేరు, ఎస్.వి.ఎ ప్రభుత్వ డిగ్రీ కళాశాల (పురుషులు), శ్రీ కాళహస్తి, పి.వి.కె.ఎన్. ప్రభుత్వ కళాశాల, చిత్తూరు, ఎమ్.ఎఫ్.సి ప్రభుత్వ జూనియర్ కళాశాల, కుప్పం, ప్రభుత్వ జూనియర్ కళాశాల, సత్యవీడు, బీసెంట్ థియోసాఫికల్ కళాశాల, మదనపల్లి, **తూర్పుగోదావరి:** ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రాజమండ్రి, ఆర్.ఆర్.బి.హెచ్.ఆర్. ప్రభుత్వ జూనియర్ కళాశాల, పీఠాపురం, ఐడియల్ కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్, విద్యుత్‌నగర్, కాకినాడ, సెంట్రల్ ప్రిజన్, రాజమండ్రి, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రాజోలు, వి.కె.వి.ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కొత్తపేట, ఎస్.కె.బి.ఆర్. కళాశాల, అమలాపురం, హెచ్ఎఎస్ డిగ్రీ కళాశాల, అడ్డతీగల, **గుంటూరు:** జె.కె.సి కాలేజ్, గుంటూరు, ఎస్.కె.ఆర్.బి.ఆర్. కళాశాల, నర్సరావుపేట, వి.ఎస్.ఆర్ అండ్ ఎన్.వి.ఆర్ కళాశాల, తెనాలి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, గురజాల, ప్రభుత్వ జూనియర్ కళాశాల, వినుకొండ, **కరీంనగర్:** ఎస్.ఆర్.ఆర్.ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కరీంనగర్, ప్రభుత్వ మహిళా కళాశాల, కరీంనగర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మెట్‌పల్లి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మహదేవ్‌పూర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల (బాలురు), మంథని, ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల, పెద్దపల్లి, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, హుజూరాబాద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, గోదావరి ఖని, ఎస్.కె.ఎన్.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జగిత్యాల, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, అగ్రహారం, కరీంనగర్, ప్రభుత్వ కళాశాల, హుస్నాబాద్, స్రవంతి జూనియర్ కళాశాల, జమ్మికుంట, **ఖమ్మం:** ఎస్.ఆర్. అండ్ బి.జి.ఎన్.ఆర్. ప్రభుత్వ కళాశాల, ఖమ్మం, ప్రభుత్వ జూనియర్ కళాశాల, భద్రాచలం, ఎస్.ఆర్. ప్రభుత్వ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, కొత్తగూడెం, ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, ఖమ్మం, నవభారత్ డిగ్రీ కళాశాల, సత్తుపల్లి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మధిర, నేషనల్ డిగ్రీ కళాశాల, పాల్వంచ, ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఎల్లందు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, చెర్ల, **కృష్ణా:** పి.బి. సిద్ధార్థ కళాశాల, విజయవాడ, రుత్విక్స్ డిగ్రీ కళాశాల, విజయవాడ, ఎ.జె. కళాశాల, మచిలీపట్నం, కె.ఇ.ఎస్. మహిళా పాలిటెక్నిక్, విజయవాడ, కె.వి.ఆర్ కళాశాల, నందిగామ, ధర్మాఅప్పారావు కళాశాల, నూజివీడు, ఎ.ఎన్.ఆర్.పి.ఎల్ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, గుడివాడ, **కర్నూలు:** సిల్వర్ జూబ్లీ ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కర్నూలు, కెవిఆర్ ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, కర్నూలు, పి.ఎస్.సి. అండ్ కె.వి.ఎస్. ప్రభుత్వ కళాశాల, నంద్యాల, ఆదోని, ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, ఆదోని, ప్రభుత్వ జూనియర్ కళాశాల, శ్రీశైలం, సిద్ధార్థ జూనియర్ కళాశాల, డోన్, **మహబూబ్‌నగర్:** ఎం.వి.ఎస్. ప్రభుత్వ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, మహబూబ్‌నగర్, ఎస్.వి.పి. డిగ్రీ కళాశాల, పాద్‌నగర్, ఎన్.టి.ఆర్ ప్రభుత్వ మహిళా కళాశాల, మహబూబ్‌నగర్, ఎం.ఎ.ఎల్.డి ప్రభుత్వ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, గద్వాల్, ప్రభుత్వ డిగ్రీ పురుషుల కళాశాల, వనపర్తి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, కల్వకుర్తి, సూర్యలక్ష్మి డిగ్రీ కళాశాల ఆర్ట్స్ & సైన్స్, నారాయణపేట్, ప్రభుత్వ జూనియర్ కళాశాల (బాలురు), అచ్చంపేట, డా.బి.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జడ్చర్ల, ప్రభుత్వ జూనియర్ కళాశాల, నాగర్‌కర్నూల్, **మెదక్:** ప్రభుత్వ డిగ్రీ కళాశాల, సిద్దిపేట, తారా ప్రభుత్వ కళాశాల, సంగారెడ్డి, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మెదక్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జహీరాబాద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, నర్సాపూర్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గజ్వేల్, ఎస్.ఎమ్. డిగ్రీ కళాశాల, జోగిపేట, **నల్గొండ:** నాగార్జున ప్రభుత్వ కళాశాల, నల్గొండ, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మిర్యాలగూడ, ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, నల్గొండ, ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఆలేరు, ఎస్.వి. కళాశాల, అమరవాది నగర్, సూర్యాపేట, ప్రభుత్వ జూనియర్ కళాశాల, నాగార్జున సాగర్, ఎమ్.కె.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, దేవరకొండ, ప్రభుత్వ జూనియర్ కళాశాల (బాలురు), భువనగిరి, కె.ఆర్.ఆర్. ప్రభుత్వ జూనియర్ కళాశాల, కోదాడ, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రామన్నపేట, రామకృష్ణ డిగ్రీ కళాశాల, హాలియా, **నెల్లూరు:** శ్రీ సర్వోదయ కళాశాల, నెల్లూరు, డి.కె. ప్రభుత్వ మహిళా కళాశాల, నెల్లూరు, జవహర్ భారతి కళాశాల, కావలి, వై.ఆర్.జూనియర్ కళాశాల, వింజమూరు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నాయుడుపేట, జి.ఎస్. ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, రామకృష్ణాపురం ఎస్.ఆర్.జె. డిగ్రీ కళాశాల, ఆత్మకూరు, **నిజామాబాద్:** గిరిరాజ్ ప్రభుత్వ కళాశాల, నిజామాబాద్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, బాన్సువాడ, గౌతమి డిగ్రీ కళాశాల, నిజామాబాద్, ప్రభుత్వ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, కామారెడ్డి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, బోధన్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మోర్తాడ్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఆర్మూర్, **ప్రకాశం:** సి.ఎస్.ఆర్ శర్మ కళాశాల, ఒంగోలు, వి.ఆర్.ఎస్ & వై.ఆర్.ఎన్. కళాశాల, చీరాల, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మార్టూరు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, కనిగిరి, శ్రీ వివేకానంద ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, గిద్దలూరు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, చీమకుర్తి, ఎస్.వి.కె.పి. కళాశాల, మార్కాపూర్, **శ్రీకాకుళం:** ప్రభుత్వ డిగ్రీ కళాశాల(పురుషులు), శ్రీకాకుళం, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, టెక్కలి, ప్రభుత్వ జూనియర్ కళాశాల (బాలురు), ఇచ్ఛాపురం, **విజయనగరం:** ఎం.ఆర్. కళాశాల, విజయనగరం, ఎస్.వి. డిగ్రీ కళాశాల, పార్వతీపురం, **విశాఖపట్నం:** డా.వి.ఎస్.కృష్ణ ప్రభుత్వ డిగ్రీ కళాశాల, విశాఖపట్నం, ఎస్.జి.ఎ. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఎలమంచిలి, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పాడేరు, **పశ్చిమగోదావరి:** సర్ సి.ఆర్.ఆర్ కళాశాల, ఏలూరు, డి.ఎన్.ఆర్. కళాశాల, భీమవరం, ప్రభుత్వ జూనియర్ కళాశాల, పోలవరం, ఎ.కె.ఆర్.జి. డిగ్రీ కళాశాల, నల్లజెర్ల, శ్రీమతి కొండెపాటి సరోజినీదేవి మహిళా కళాశాల, తణుకు, **వరంగల్:** యూనివర్సిటీ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, వరంగల్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, ములుగు, కాకతీయ ప్రభుత్వ డిగ్రీ కళాశాల, హన్మకొండ, ఎ.బి.వి. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జనగాం, సికెఎం ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, వరంగల్, ప్రభుత్వ జూనియర్ కళాశాల (బాలురు), మహబూబాబాద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, పరకాల, సెంట్రల్ ప్రిజన్, వరంగల్, సిద్ధార్థ జూనియర్ కళాశాల, భూపాలపల్లి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, కొడకండ్ల, ప్రభుత్వ జూనియర్ కళాశాల, చేర్యాల్, ప్రభుత్వ కళాశాల, తొర్రూర్, **జంటనగరాల కేంద్రాలు మరియు రంగారెడ్డి జిల్లా:** ప్రభుత్వ సిటీ కళాశాల, హైదరాబాద్, ప్రగతి మహా విద్యాలయ, హనుమాన్ టెక్డీ, న్యూ గవర్నమెంట్ జూనియర్ కళాశాల, వై.యం.సి.ఎ. సికింద్రాబాద్, సిల్వర్ జుబ్లీ కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ & సైన్స్, హబ్సిగూడ, హైదరాబాద్, ఎం.ఎ.ఎం. ప్రభుత్వ మోడల్ బాలికల జూనియర్ కళాశాల, నాంపల్లి, రైల్వే జూనియర్ కళాశాల, లాలాగూడ, సికింద్రాబాద్, ప్రభుత్వ డిగ్రీ మహిళా కళాశాల, బేగంపేట, ప్రభుత్వ డిగ్రీ కాలేజ్, ఖైరతాబాద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, కాచిగూడ, మహబూబ్ కాలేజ్, ఎస్‌డి రోడ్, సికింద్రాబాద్, ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల, నాంపల్లి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఆలియా, హైదరాబాద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, (పాత) మలక్‌పేట్, హైదరాబాద్, ఐడియల్ డిగ్రీ కాలేజ్ ఫర్ ఉమెన్, దిల్‌షుక్‌నగర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, బొల్లారం, సికింద్రాబాద్, వాణి జూనియర్ కాలేజ్ ఫర్ గర్ల్స్, మెహదీపట్నం, హైదరాబాద్, ఎస్.డి. సిగ్నోడియా కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ & కామర్స్, చార్‌కమాన్, హైదరాబాద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, బిహెచ్ఇఎల్, రామచంద్రాపురం, ప్రిన్సెస్ షాకర్ కాలేజ్ ఫర్ ఉమెన్, పురానా హవేలి, హైదరాబాద్, సెంట్ థామస్ సంహిత జూనియర్ కళాశాల, మలక్‌పేట, హైదరాబాద్, నోవా డిగ్రీ కళాశాల, అమీర్‌పేట్, శ్రీ వివేకానంద ప్రభుత్వ కళాశాల, విద్యానగర్, హైదరాబాద్, డి.వి.ఎమ్. డిగ్రీ కాలేజ్ ఆఫ్ కామర్స్ అండ్ సైన్స్, ఎల్‌బి నగర్, హైదరాబాద్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మల్కాజ్‌గిరి, హైదరాబాద్, ఎస్‌పి కాలేజ్, పద్మారావు నగర్, సికింద్రాబాద్, న్యూ గవర్నమెంట్ జూనియర్ కాలేజ్, కూకట్‌పల్లి, సెంట్రల్ ప్రిజన్, చర్లపల్లి, ఎస్.ఎ.పి. ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, వికారాబాద్, పల్లవి డిగ్రీ కళాశాల, పరిగి, ప్రభుత్వ జూనియర్ కళాశాల, తాండూర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, చేవెళ్ళ, ప్రభుత్వ కళాశాల, మేడ్చల్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, హయత్‌నగర్, ప్రతిభా జూనియర్ కళాశాల, ఇబ్రహీంపట్నం.

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి.సాంబశివరాజు

గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు:
వి. హనుమంతరావు
వర్కింగ్ ఎడిటర్:
ఎన్. వేణుగోపాల్

విడి ప్రతి: రు. 10
వార్షిక చందా: రు.150

వీక్షణం
ఆర్థిక, సామాజిక పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చి అండ్ కమ్యూనికేషన్

48 జులై, 2005

## సంపాదకీయం

# సమ్మెల రుతువు ఇది!

రాష్ట్రానికి రావడానికి వర్షరుతువు సంకోచిస్తోందిగాని సమ్మెల రుతువు మాత్రం యథావిధిగా వచ్చేసింది. వైద్య విద్యను, ప్రజారోగ్యాన్ని భ్రష్టు పట్టించగూడదని జూనియర్ డాక్టర్లు, రోడ్డు రవాణా సంస్థను ప్రైవేటీకరణకు బలిచేయగూడదని ఎపిఎస్ఆర్‌టిసి సిబ్బంది, నాలుగు సంవత్సరాల కింద అమలులోకి వచ్చి ఉండవలసిన వేతన ఒప్పందాన్ని ఇప్పటికైనా అమలు చేయాలని సింగరేణి గని కార్మికులు, ఉపాధ్యాయులు, సమయానికి పాఠ్యపుస్తకాలు ఎందుకు అందడం లేదని విద్యార్థులు, వ్యవసాయ రంగ సంక్షోభానికి వ్యతిరేకంగా రైతులు, పెట్రోలు, డీజిల్ ధరలు ఇంత అన్యాయంగా పెంచడమేమిటని అన్ని వర్గాల ప్రజలు - అసంతృప్తికి గురికాని, ఆందోళనకు దిగని ప్రజా సమూహం ఒక్కటి కూడ లేదంటే అతిశయోక్తి కాదు. మామూలుగా సమ్మెల పట్ల అసహనం ప్రదర్శించే మధ్యతరగతి కూడ సమ్మెల అనివార్యతను, సమ్మెలలోని న్యాయబద్ధతను గుర్తించే దిశగా, తామే స్వయంగా సమ్మెలకు దిగడమో, సమ్మెలను సమర్థించడమో చేసే వైపుగా సాగుతోంది.

నిజానికి తొమ్మిది సంవత్సరాలపాటు అన్ని ప్రజాందోళనలను అణగదొక్కిన చంద్రబాబు నాయుడు పాలనాకాలంలో దాదాపు ప్రతి ఆందోళనకు అప్పటి ప్రధాన ప్రతిపక్షం, ముఖ్యంగా ప్రతిపక్ష నాయకుడు డా. వై. ఎస్. రాజశేఖర రెడ్డి మద్దతు ప్రకటించారు. కొన్ని ఆందోళనల్లో స్వయంగా పాల్గొన్నారు. పాదయాత్ర సందర్భంగా అన్ని వర్గాల ప్రజల ఇక్కట్లను స్వయంగా తెలుసుకున్నారు. అధికారానికి రావడానికి ముందు, వచ్చాక కొద్ది రోజులు కూడా ప్రజా సమస్యల పట్ల తన సంఘీభావాన్ని ప్రకటించారు. గ్రామీణాభివృద్ధి, వ్యవసాయ రంగం, నీటి పారుదల, పేదరికం లాంటి తొమ్మిది సంవత్సరాలపాటు తెలుగు దేశపు పాలకులు మరిచిపోయిన మాటల్ని మళ్లీ గద్దెనెక్కించారు.

ఈ గంభీరోపన్యాసాలకే మురిసిపోయిన ప్రజలు ఏదో మార్పు జరిగిందని, జరగబోతోందని ఆశించారు. మార్పు అమలు చేయడానికి ప్రభుత్వానికి ఏడాదిపాటు అవకాశమిచ్చారు. ఆ ఏడాది ఎదురు చూపు చివరికి ఫలించలేదు సరికదా, కొత్త ప్రభుత్వం పాత ప్రభుత్వం దారిలోనే ప్రపంచ బ్యాంకు అడుగులకు మడుగులొత్తుతూ అన్ని ప్రజావర్గాల న్యాయమైన కోర్కెలకు అణచివేత ఒక్కటే జవాబుగా ప్రకటిస్తోంది. అందువల్లనే, మొన్న మొన్ననే ఏ జూనియర్ డాక్టర్ల సమ్మెకు తాను సంపూర్ణమైన మద్దతు తెలిపారో, ఏ రవాణా సంస్థ ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా తాను గొంతెత్తారో, ఏ రైతుల గిట్టుబాటు ధరల గురించి, ఆత్మహత్యల గురించి తాను ఆందోళనలు నడిపారో నిన్నటి ప్రతిపక్ష నాయకులు, ఇవాళ్టి ముఖ్యమంత్రి మరచిపోయినట్టున్నారు.

ఇటువంటి మతిమరపుల నుంచి మేల్కొల్ప గలిగేది ఉరుములు, మెరుపులతో ముంచుకు వచ్చే సమ్మెల రుతువులు మాత్రమే. అనివార్యమైనదీ, సహజమైనదీ, న్యాయమైనదీ ఈ సమ్మెల రుతువు.

* * *

పాత్రికేయుడిగానూ, రచయితగానూ, సామాజిక వ్యాఖ్యాత గానూ రెండు దశాబ్దాలకు పైబడిన నా అనుభవానికి కొనసాగింపుగా నేనొక రాజకీయ పార్టీ మీడియా ప్రతినిధిని కలవడానికి వెళ్లినందుకు అక్రమ నిర్బంధానికి గురయ్యాను. ఒక తప్పుడు కేసులో ఇరికించబడ్డాను. నా నిర్బంధ సమయంలో 'వీక్షణం' పట్ల తమ సంఘీభావాన్ని అసాధారణంగా ప్రకటించిన పాఠకులందరికీ ధన్యవాదాలు.

ఈ సంచికలోని విద్యారంగం - ఫోకస్ విభాగానికి
ప్రముఖ విద్యావేత్త చుక్కారామయ్య గారు గౌరవ సంపాదకత్వం వహించారు.
వారికి మా కృతజ్ఞతలు

**వీక్షణం**

ఆర్థిక, సామాజిక పత్రిక

సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్

స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫోన్ : 040 - 55843495

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

## ఉత్తరాలు:

పత్రిక బావుంటుంది. ఆర్థిక సామాజికాంశాలపై మంచి విశ్లేషణలు అందజేస్తుంది.

వర్కింగ్ ఎడిటర్‌ను విడుదల చేశారా? ఆయన ఇంకా అరెస్టు లోనే ఉన్నట్టు జుడిషియల్ నుండి పోలీసు కష్టడీకి తీసుకున్నట్టు కూడా చూశాం. ఒక సీనియర్ జర్నలిస్టుగా వేణుగోపాల్ అందరికి తెలిసినా మన పోలీసు వారికి తెలియక పోవటం విచారించదగ్గ విషయం.

ఆయన్ను త్వరలోనే విడుదల చేస్తారనీ ఆశిస్తాను అలాగే మిగిలిన వారినీ కూడా.

సజ్జా వెంకటేశ్వర్లు
వేటపాలెం.

మే/జూన్'05 సంచికలో వ్యవసాయ సంస్కరణల గురించి వెన్నెలకంటి రామారావుగారి వ్యాసం బుర్రచించుకున్న ఒక ముక్కా అర్థం కాలేదు. ఇలాంటి వ్యాసాలు ప్రచురించి పాఠకులను ఇబ్బంది పెట్టకండి. న్యూస్ ప్రింట్ కూడా వేస్టు.

వి. సూర్య నారాయణ
హైదరాబాద్

వర్కింగ్ ఎడిటర్ ఎన్. వేణుగోపాల్‌గారి అరెస్టును ప్రజా స్వామ్యవాదులంతా ముక్తకంఠంతో ఖండించాలి. ఇది పత్రికా స్వేచ్ఛపై, భావ ప్రకటనా స్వేచ్ఛపై దాడి. 25.6.2005 నాటికి దేశంలో ఎమర్జెన్సీ విధించి సరిగ్గా 30 ఏళ్ళు. ఈ అరెస్టూ, ఇలాగే రాష్ట్రం మొత్తంగా జరుగుతున్న పరిణామాలు ఎమర్జెన్సీ పరిస్థితులనే తలపిస్తున్నాయి.

- అశోక్
మహబూబ్‌నగర్

### వచ్చే సంచికలో...

ఫోకస్ - ఆంధ్రప్రదేశ్‌లో వైద్య, ఆరోగ్యసేవలు

సాగునీటి ప్రాజెక్టుల ప్రయోజనమెవరికి?
- ఇప్ప వీరారెడ్డి

సంస్కరణల ఫలితమే రైతుల ఆత్మహత్యలు
- డి.వి. రామకృష్ణారావు

సంక్షోభంలో తెలుగు చలనచిత్ర పరిశ్రమ
- గుడిపూడి శ్రీహరి

# అద్వానీ రాజీనామా
# భాజపాలో సైద్ధాంతిక, నాయకత్వ సంక్షోభం

- వకుళాభరణం రామకృష్ణ

అద్వానీ రాజీనామా వుదంతంపై ముమ్మరంగా చర్చలు జరుగుతున్న సందర్భంలో, నేనొక ఆటోరిక్షాలో వెడుతూ, ఆటోడ్రైవర్‌తో యధాలాపంగా ప్రస్తావించాను. అతడు పరిహాసంగా నావైపు చూసి'ఇదంతా మామూలే లెండి' అన్నాడు. ఆ మర్నాడే రాజీనామాను అద్వానీ వుపసంహరించుకొన్నాడు. సగటు మనిషి రాజకీయనాయకుల గూర్చి యెలాంటి అభిప్రాయాన్ని కలిగివున్నాడో యీ సంఘటన తెలియచేస్తుంది. ఇవ్వాళ మనదేశంలో రాజకీయ నాయకులు -కొద్దిమంది పదవీకాంక్షలేని, ప్రజాకార్యకర్తలను మినహాయిస్తే- గౌరవ ప్రపత్తులు అట్టడుగుకు దిగజారాయి. సాధారణ రాజకీయ పక్షాల కంటే భా.జ.పా.భిన్నమైందనీ, క్రమశిక్షణకు పేరెన్నికగన్నదని, కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడివుంటుందన్న ప్రజాభిప్రాయం దాని పట్ల వుండేది. కొద్ది కాలంగా, అధికారంలోవున్న గత ఆరుసంవత్సరాల్లో, భా.జ.పా. స్థాయి దిగజారిపోయింది. తెహెల్కా వుదంతం ఒక ఉదాహరణ మాత్రమే. అధికారం అవినీతికి దారితీస్తుందని, హద్దులు లేని అధికారం మరింత నీచస్థాయికి తీసుకువెళ్తుందన్న నానుడి భా.జ.పా. విషయంలో రుజువైంది.

ఇంతకీ భా.జ.పా.లో అద్వానీ పాకిస్తాన్‌లో చేసిన వ్యాఖ్యలపై పరివార్‌లో రేపిన కలవరం, దేశంలో జరిగిన చర్చలు, వున్నట్టుండి ఒక్కసారిగా జరిగినవనుకొంటే పొరబాటే! ఆరేండ్లు కేంద్ర ప్రభుత్వంలో ఆధిపత్యాన్ని సాగించిన భా.జ.పా. సంఘపరివార్‌ల మధ్య అంతరం పెరుగుతూ వచ్చింది. సంఘపరివార్, ముఖ్యంగా రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్‌కు భా.జ.పాపై గట్టి పట్టువుంది. ఎన్నికల్లో ఆర్.ఎస్.ఎస్. (వి.హెచ్.పి.) భజరంగ్‌దళ్ కూడ) వత్తాసు లేనిదే, ప్రభుత్వాలు ఏర్పర్చే అవకాశం భా.జ.పా.కు లేదు. గుజరాత్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌ఘఢ్ రాష్ట్రాల్లో ముఖ్యంగా, ఆదివాసీ ప్రాంతాల్లో, ఆర్.ఎస్.ఎస్. అనుబంధ సంస్థ వనవాసి కళ్యాణ్ బలంతోనే, అధికారంలోకి వచ్చింది. పరివార్‌కు, భా.జ.పా.కు, రెంటికీ క్రియాశీలక కేడర్లు ఒకరే. కాబట్టి పరివార్ లేంది భా.జ.పా. లేదు. దానికున్న స్వతంత్ర ఓటర్ల శాతం తక్కువే. గత ఆరేండ్ల పరిపాలనలో ఆర్.ఎస్.ఎస్. ఎజెండాను, సంకీర్ణ రాజకీయాలపేరుతో, పక్కన పెట్టింది. భా.జ.పా. రామమందిరాన్ని నిర్మించకపోవడమే కాదు, కాశ్మీర్ గూర్చిన రాజ్యాంగ అధికరణం, కామన్ సివిల్‌కోడ్, విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం (స్వదేశీ జాగరణమంచ్ విధానాలకు విరుద్ధంగా)లాంటివి పరివార్ సిద్ధాంతాల అభీష్టాలకు అనుగుణంగా జరగలేదు. ఎన్నికల్లో భా.జ.పా. ఓడిపోవడం జీర్ణించుకోలేకపోయింది. పరాజయాన్ని వూహించలేదు గూడ. గత సంవత్సరం జరిగిన ఎన్నికలు, దేశభవితవ్యాన్ని యెంతగానో ప్రభావితం చేశాయి. ఆర్.డి.ఎ.గా సంకీర్ణ కూటమే గెలిచివుంటే, దేశంలో మతతత్వ ఫాసిస్టుశక్తులు పెచ్చరిల్లిపోయి, క్రమంగా, ఫాసిస్టు రాజ్యం ఏర్పడేదానికి మార్గం సుగమం అయివుండేది. ఎన్నికల ఆశాభంగం తర్వాత, ఒక విధంగా, భా.జ.పా. పరివార్‌ల మధ్య విభేదాలు మరింతగా పొడసూపాయి. ఆర్.ఎస్.ఎస్. అధినేత సుదర్శన్ యిటీవల ఒక టెలివిజన్ ఛానల్‌లో వెలిబుచ్చిన అభిప్రాయం యీ విభేదాల పరాకాష్ఠను సూచించింది. అగ్రనాయకత్వంలోని యిద్దరూ వైదొలగి, యువనాయకత్వానికి అవకాశం యివ్వాలన్న సుదర్శన్ వ్యాఖ్య వీరిమధ్య పెరుగుతున్న సంక్షోభానికి చక్కని నిదర్శనం. వాజపేయి తనకేమీ పదవిలేదని, సుదర్శన్ సూచన గూర్చి ఆలోచించాల్సింది అద్వానీ మాత్రమేనన్నాడు. దీనిపై ఖండనలు కొన్ని జరిగినా, టెలివిజన్ ఛానల్ పదే పదే ఆ కార్యక్రమాన్ని తిరిగి ప్రసారం చేయడంతో, దొంగకు తేలుకుట్టిన చందంగా భా.జ.పా.తో సహా అందరూ కిమ్మనకుండా వుండిపోయారు.

పై నేపథ్యంలో అద్వానీ పాకిస్థాన్ పర్యటన సందర్భంగా చేసిన వ్యాఖ్యలను పరిశీలించాల్సివుంటుంది. అద్వానీ యాత్ర, ఎంతో విజయవంతమైంది. పాకిస్థాన్ అతిధిమర్యాదలు, అద్వానీనే అబ్బురపరిచివుంటాయి. ఒకవైపు ఎన్.డి.ఎ. ప్రారంభించిన శాంతి ప్రక్రియ, కేంద్రంలో నూతన ప్రభుత్వం తీసుకొన్న చొరవ, పాకిస్తాన్ చూపిన స్పందనలవల్ల, యిది యిక ఎవరూ ఆపలేరన్నంత దూరం వెళ్ళిపోయింది. దీనికి భా.జ.పా. సంతోషిస్తుందనే అనుకొందాం. ఎందుకంటే, ముషారఫ్ గతంలో యిక్కడకొచ్చినపుడు, ఆగ్రాలో కుదురుతుందనుకొన్న శాంతి సంధి, ఆఖరిక్షణంలో పరివార్ వైఖరివల్ల, దానికి ప్రాతినిధ్యం వహించిన అద్వానీ వల్లనే విఫలమైందని పాకిస్తాన్ బహిరంగంగానే నిందించింది. ఈ పరిస్థితుల్లో అద్వానీ, యిక పాకిస్తాన్‌లో శాంతి ప్రక్రియను ముందుకు తీసుకువెళ్ళడమే మంచిదన్న భావన, ప్రజాభిప్రాయానికి అనుగుణంగా వుంటుందనుకొని వుంటాడు. వాస్తవాన్ని గుర్తెరగడం అంటే యిదే! ఇక అద్వానీ ఆనాడు జిన్నాపై చేసిన వ్యాఖ్యలు, దాదాపు పర్యటన ముగించే ముందుగా చేసినవి. కానీ అంతకుముందు ఒకటి, రెండు సందర్భాల్లో, అద్వానీ చేసిన

వ్యాఖ్యలను మరువరాదు. కాశ్మీర్ సమస్యపై ఒక అంగీకారానికి రావడం మంచిదన్నాడు. అంటే కాశ్మీర్, ఇరుదేశాల మధ్య వివాదాస్పదమైందని అంగీకరించడం. కాగా, పాకిస్తాన్ ఏర్పాటు చరిత్ర నుండి తుడిచి వేయడానికి వీలులేని 'వాస్తవం'గా ప్రకటించాడు. దేశవిభజనలో పొరబాట్లు, తప్పిదాలు జరిగివుండచ్చునని అంటూనే, వాటిని సరిదిద్దుకోవచ్చునన్న సర్దుబాటు తత్వాన్ని ప్రదర్శించాడు. హురియత్ నాయకుల పర్యటన గూర్చి కూడ విమర్శనాత్మక వ్యాఖ్యలు చేయలేదు. వీటన్నింటిని మించి, బాబ్రీమసీదు విధ్వంసం తన జీవితంలో అత్యంత విచారకరమైన రోజుగా వక్కాణించాడు. ఇక ఆఖరిలో, 1947 ఆగస్టులో జిన్నా రాజ్యాంగసభలో చేసిన ఉపన్యాసం ఆధారంగా 'లౌకికవాది'గా పేర్కొన్నాడు.

ఈ వ్యాఖ్యలన్నింటిని వేరుచేసి చూడడం పొరబాటవుతుంది. జిన్నాను లౌకికవాది అనడంకంటే, బాబ్రీమసీదు విధ్వంసం గూర్చి గావించిన వ్యాఖ్యలు నిజానికి పరివార్‌ను మరింత గాయపర్చి వుండాలి. ఎందుకంటే, సోమనాథ్ నుండి అయోధ్య దాకా రథయాత్ర నిర్వహించాడు అద్వానీ. యాత్ర పొడుగునా సంఘపరివార్ అధికసంఖ్యలో అందులో పాల్గొన్నారు. తమ పూర్తి మద్దతునిచ్చి యాత్రను విజయవంతం చేశారు. బాబ్రీమసీదును కూలుస్తున్నపుడు, ఉమాభారతితో సహా, యితర నాయకులతో కలిసి ప్రత్యక్షసాక్షిగా అక్కడేవున్నాడు. దానికి ఎలాంటి విచారాన్ని, బాధను యిన్నేళ్ళు వెలిబుచ్చలేదు. (వాజ్‌పేయితన సహజ ధోరణిలో, అటూ, యిటూ, విధ్వంసాన్ని గూర్చి మాటలు మార్చి వున్నాడు). ఇప్పుడు, అంతా అయ్యాక, బహుళభారతీయ సంస్కృతికే తీరని మచ్చగా మిగిలిపోయిన ఆఘటన గూర్చిన పై చెప్పిన వ్యాఖ్య అర్థం ఏమిటి? దానివెనకాల వున్న అంతరార్థం యేమిటి? అద్వానీని ప్రేరేపించిన కారణాలు ఏమైవుంటాయి? ఆలోచనా రహితంగా యీ వ్యాఖ్యలు చేసి వుంటాడనుకోవడం పొరబాటవుతుంది. కాకుంటే, పరివార్‌లో యింతటి ప్రతిస్పందన, విమర్శ వస్తాయని భావించి వుండకపోవచ్చు. పర్యటనకు వెళ్ళకముందు ఆ దిశలో సహచరులతో చర్చించినట్టులేదు. వి.హెచ్.పి. జిన్నాతో కలిపి అద్వానీని దేశద్రోహి అనడం, గుజరాత్‌కు రానివ్వమని ప్రకటించడం, రాజీనామాకు సంతోషించి స్వీట్స్ పంచుకోడం అందర్నీ విస్మయపర్చింది. జిన్నాపై చేసిన వ్యాఖ్యలను చర్చకుపెడదామని అద్వానీ అన్నపుడు, ఆర్.ఎస్.ఎస్. చర్చించడానికి సిద్ధపడకపోగా, జరగాల్సిన చర్చ యేదో జరిగిపోయిందని ప్రకటించింది. అద్వానీ వ్యాఖ్యలను, వాజ్‌పేయి, సాహెబ్‌సింగ్ వర్మ మినహా భా.జ.పా.లో ఎవరూ సమర్థించకపోవడం గమనార్హం. ఏపరిస్థితుల్లోనూ, చేసిన వ్యాఖ్యలను, రాజీనామాను ఉపసంహరించుకోనని చెప్పిన అద్వానీ, జిన్నాను ఖండిస్తూ, లౌకికవాది కాదని, ద్విజాతి సిద్ధాంత కర్త అని, దేశ విభజనకు తోడ్పడ్డవాడుగా, అసందర్భంగా జరిగిన అసంఖ్యాక ప్రజల మరణానికి బాధ్యుడిగా చేసిన తీర్మానాన్ని ఆమోదించి, రాజీనామా నుండి తప్పుకున్నాడు. తిరిగి అధ్యక్షపదవి స్వీకరించాడు.

ఈ మొత్తం వ్యవహారాన్ని పరిశీలిస్తే రెండు విషయాలు స్పష్టమవుతున్నాయి. (జిన్నా లౌకికవాదా కాదా అనేది వేరే చర్చ. అద్వానీ అన్నట్టు దాన్ని చర్చకు పెడితే నిజం నిగ్గుతేలి వుండొచ్చు. కానీ అదివేరే కథ) ఒకటి, అద్వానీ ఆలోచనాస్రవంతిలో మార్పు వచ్చిందా? కాదనే మా ఉద్దేశ్యం. అలాంటిదేమైనా వుంటే, అది అకస్మాత్తుగా పాకిస్తాన్ గడ్డపైనే రాదు. ముందు అలాంటి సూచనలేమీ లేవు కాబట్టి ఇది వ్యూహాత్మకం. తక్షణ రాజకీయ ప్రయోజనాలనాశించి వ్యవహరించాడు. భా.జ.పా.కు మతతత్వపార్టీ ముద్ర శాశ్వతంగా వుండిపోయింది. పైగా పరివార్ వెలుపల వుండి దాని వ్యవహారాలు శాసించేటంతవరకూ, దానికి వెన్నుదన్నుగా నిలిచేవరకూ ఈ ముద్ర చెరిగిపోదు. భా.జ.పా. దాన్నుండి బయట పడాలి. విశాల భారత ప్రజానీకాన్ని, మతాతీతంగా తనవైపు తిప్పుకునే ప్రయత్నం చెయ్యాలి. అలా చేసే క్రమంలో పరివార్ గాఢ పరిష్వంగం నుండి బయటపడాలి. భా.జ.పా.కు పరివార్ గుదిబండగా తయారయి, సుదూర భవిష్యత్‌లో ప్రజల అభిమానాన్ని చూరగొనడం దుర్లభం. అందుకనే బాబ్రీమసీదు విధ్వంసంపై అద్వానీ చేసిన వ్యాఖ్యలు.

రెండు, పరివార్, ముఖ్యంగా ఆర్.ఎస్.ఎస్.పై వ్యాఖ్యలవల్ల తన సైద్ధాంతిక అస్తిత్వానికే ప్రమాదం వాటిల్లిందని భావించింది. ద్విజాతి సిద్ధాంతాన్ని వాడుకొని, దాని పునాదిపై ముస్లింలను కూడగట్టి, 'ప్రత్యక్షచర్య'కు పిలుపిచ్చి పాకిస్తాన్‌ను జిన్నా సాధించుకున్నాడు. అలాంటి జిన్నాను లౌకికవాది అనడం, పాకిస్థాన్‌ను 'చెరిగిపోని చారిత్రకసత్యం'గా అభివర్ణించడం, పరివార్ అఖండభారత నినాదానికి, ఆకాంక్షకు విరుద్ధం. ఇది వారిసైద్ధాంతిక మూలాలను పెకలించివేసే ప్రమాదాన్ని తీసుకొచ్చింది.

**హిందూత్వ'సిద్ధాంతానికి మూడు ముఖ్యాధ్యాయాలున్నాయి.**

1) ముస్లిం వ్యతిరేకత 2) ఇస్లాం వ్యతిరేకత 3) పాకిస్తాన్ వ్యతిరేకత. అద్వానీ చేపట్టిన వైఖరి యీ మూడింటికి భిన్నమైంది. నిజంగా అద్వానీ మారాడా? తెలీదు. మారితే మంచిదే! భా.జ.పా. సైద్ధాంతికదృక్కోణం మారి, ఒక లౌకికవాదపార్టీగా రూపొందే క్రమంలో నడుస్తూవుంటే, అది ఆహ్వానించదగ్గ పరిణామమే! ఇది దేశరాజకీయ భవిష్యతుకు శుభదాయకం. మతతత్వ రాజకీయాలను వదిలి, బలమైన ఒక ప్రతిపక్షపార్టీ లౌకికభావన దిశగా వెడితే, మతాన్ని, రాజకీయాల నుండి వేరు చేయవచ్చు. కానీ యీరకమైన వూహలకి ఆస్కారం లేదు. ఇక అద్వానీలో మార్పువస్తేనే యిది

*(మిగతాది 8వ పేజీలో)*

# అందరికీ విద్య అందేది ఎన్నడో!

- ఎన్. నారాయణ
ప్రధాన కార్యదర్శి
ఆం.ప్ర.ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

**'బడిబాట' పేరుతో బడియీడు పిల్లల్ని బడుల్లో చేరుస్తామంటూ కాంగ్రెస్ ప్రభుత్వం జూన్ రెండవ వారంలో హడావిడి చేసింది. ఈ కార్యక్రమాన్ని నిరంతరం కొనసాగిస్తామని, 2008 నాటికి శత శాతం అక్షరాస్యత సాధిస్తామని పాఠశాల విద్యామంత్రి ప్రకటించారు. వాగ్దానాలకు పట్టిపోనిది విద్యారంగమేనని ఐదున్నర దశాబ్దాల అనుభవం చెబుతోంది.**

అందరికీ విద్య పేరుతో తెలుగుదేశం ప్రభుత్వం అక్షర సంక్రాంతి, చదువుల పండుగ వంటి కార్యక్రమాలతో కాలం గడిపితే ఈ ప్రభుత్వం బాటలతో బయలు దేరింది. వారి పండుగలు, వీరి బాటలు ప్రచార ఆర్భాటానికే తప్ప ప్రాథమిక విద్యను పట్టి పీడిస్తున్న మౌలిక సమస్యలను పరిష్కరించలేకపోతున్నాయి.

## గారడీలతో గట్టెక్కలేరు

బడిఈడుగల (6–14 సం॥లు) బాలబాలికలు అందరూ బడిలోనే వుండాలి. పాఠశాల విద్య పూర్తయ్యే వరకూ బడిలోనే కొనసాగాలి. ఇది సాధ్యమైతేనే అందరికీ విద్య సాధించగలం. అయితే బడిలో చేరాల్సిన వారు ఎంతమంది, చేరినా చివరిదాకా కొనసాగుతున్న వారు ఎంతమంది అనేదే అసలు సమస్యగా వున్నది. బడిలో చేరాల్సిన వారు 4.23 లక్షలమంది మాత్రమే వున్నారని ముఖ్యమంత్రి బడిబాట ప్రారంభోత్సవంలో ప్రకటించారు. కార్యక్రమం విజయవంతం అయిందని, 10.43 లక్షల మంది బడిలో లేనివారిగా గుర్తించటం జరిగిందని, వారిలో 8.70 లక్షల మందిని మొదటి తరగతిలో నమోదు చేయటం జరిగిందని పాఠశాల విద్యామంత్రి జూన్ 13న ప్రెస్‌మీట్‌లో బడిబాట ఫలితాలను ప్రకటించారు. వారం రోజుల్లోనే ఏమి జరిగిందో చూశారా?

2001 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రంలో ఐదు నుంచి 14 సం॥ల లోపు 1.77 కోట్ల మంది పిల్లలు వున్నారు. పాఠశాల విద్యాశాఖ 2004-05 సం॥కి ప్రకటించిన విద్యాగణాంకాల ప్రకారం 1.55 కోట్లమంది వున్నారు. బడిలో వున్న పిల్లలు 1.34 కోట్ల మందిగా చూపించటం జరిగింది. దీనిని బట్టి బడిబాట పట్టని పిల్లలు 40 లక్షలు పైగానే వున్నట్లు అర్థం అవుతుంది. కాగా బడిమానేస్తున్న వారి వివరాలు చూస్తే పరిస్థితి మరింత ఆందోళనకరంగా వుంటుంది. 5వ తరగతి లోపు 31.95% మంది, 7వ తరగతి లోపు 53.17% మంది, 10వ తరగతి లోపు 63.69% మంది డ్రాపవుట్స్ అవుతున్నారు. అంటే నూటికి 36 మంది మాత్రమే పాఠశాల విద్య పూర్తి చేయగల్గుతున్నారన్న మాట! ప్రాథమిక విద్య (8 సంవత్సరాల చదువు)ని అందుకొంటున్న వారు సగం మంది కూడ లేరు. కాగా గిరిజనులు, దళితులు, బలహీనవర్గాలు, వారిలో మహిళల పరిస్థితిని పరిశీలిస్తే అందరికీ విద్య అందనంత దూరంలో వుంటుంది.

## దేశం వెనుకబాటుకి మూలం నిరక్షరాస్యతే!

బడిబాట నేపధ్యంలో సాక్షరతా సాధనలో దేశ పరిస్థితిని పరిశీలించుదాము. మానవాభివృద్ధి సూచికలలో ముఖ్యమైనది విద్య. ఏ దేశమైనా సర్వతోముఖాభివృద్ధి సాధించాలంటే ఆ దేశ ప్రజలు విద్యావంతులు కావాలి. అందుకు సార్వత్రిక అక్షరాస్యత అత్యంతావశ్యకం. ఉత్పత్తిలో, జీవన విధానంలో, ఆర్థికాభివృద్ధిలో అక్షరాస్యులకు, నిరక్షరాస్యులకు మధ్య చాలా తేడా వుంటుందని అనేక సర్వేలు తెలియజేశాయి. ప్రాథమిక విద్యా పరిజ్ఞానం గల రైతు ఉత్పాదక శక్తి, అక్షరం ముక్కరాని రైతుకంటే 8.5% ఎక్కువగా వుంటుందని, పారిశ్రామిక రంగంలోనూ ఈ తేడా కనిపిస్తుందనీ, మానవాభివృద్ధి నివేదికలు తెలియజేస్తున్నాయి. అభివృద్ధి చెందిన దేశాల్లోని ప్రజలందరూ విద్యావంతులనే విషయాన్ని గమనించాలి. విద్య ప్రాధాన్యతను విడమర్చి చెప్పాల్సిన అవసరం లేనేలేదు. ఈ విషయాన్ని మన దేశ పాలకులూ అంగీకరించారు. కానీ ఆచరణ మాత్రం అందుకు అనుగుణంగా లేదు.

## ప్రపంచ నిరక్షరాస్యుల్లో మూడోవంతు భారతీయులే!!

2001 సెన్సస్ ప్రకారం మన దేశ జనాభా (7 సంవత్సరాల లోపు పిల్లల్ని మినహాయించి)లో 35% మంది నిరక్షరాస్యులు. 2003 మానవాభివృద్ధి నివేదిక ప్రకారం 15 సంవత్సరాల వయస్సు పై బడిన వారిలో నూటికి 42 మంది నిరక్షరాస్యులుగా వున్నారు. ప్రపంచంలోని మొత్తం నిరక్షరాస్యుల్లో మూడవ వంతు మంది మన దేశంలోనే వున్నారు. 1990లో జోమ్‌టిన్‌లో జరిగిన ప్రపంచ

విద్యా సదస్సులో 2000 నాటికి అందరికీ విద్య అందించాలని తీర్మానించటం జరిగింది. 2000 సంవత్సరంలో డెల్లార్‌లో జరిగిన రెండవ సదస్సులో పరిస్థితిని సమీక్షించి ఆ గడువుని 2010 వరకు పెంచటం జరిగింది. కాగా ఈ లక్ష్య సాధనలో అన్ని దేశాల కంటే భారతదేశం బాధ్యతను ప్రత్యేకంగా గుర్తు చేయటం జరిగింది. అందుకు అంతర్జాతీయ సంస్థల సహకారాన్ని, విదేశాల సహాయాన్ని తీసుకోవాలని సలహాలు (ఆదేశాలు) యివ్వటం జరిగింది. అందుకే 1990ల నుండి ఓ.బి.బి., అపెప్ పేరుతో విదేశీ నిధులు, డిపెప్ పేరుతో ప్రపంచ బ్యాంకు నిధులు మన విద్యా రంగంలోకి ప్రవేశించినవి. ప్రజలకి చదువు చెప్పటానికి కూడ మన పాలకులు విదేశీ నిధులపైనే ఆధారపడుతున్నారు.

## హక్కు అనటానికే అర్థ శతాబ్దం పట్టింది

14 సంవత్సరాల వయస్సులోపు బాలలందరికీ నిర్బంధోచిత విద్యని అందించే కార్యక్రమం 1960 నాటికే పూర్తి కావాలని రాజ్యాంగం ఆదేశించింది. అది సాధ్యంకాకపోవటంతో ఆ గడువుని ప్రతి పది సంవత్సరాలకూ పెంచుకొంటూ పోవటం కేంద్రప్రభుత్వానికి అలవాటుగా మారింది. ఇప్పటికీ బడిఈడు గల జనాభాలో 12 కోట్ల మంది బడికి దూరంగానే వున్నారు. బడిలో చేరిన వారైనా 14 ఏళ్ల వయస్సు వచ్చేవరకు నికరంగా చదువుతున్నారా అంటే అదీ లేదు. సగం మంది పైగా మధ్యలోనే మానేస్తున్నారు. దీనితో అందరికీ విద్య అనేది అందని లక్ష్యంగానే మిగిలి పోతున్నది. దీనికి పరిష్కారం ఏమిటనే చర్చల సారాంశంలోనే 6-14 ఏళ్ల పిల్లలకు విద్యని ప్రాథమిక హక్కుగా చేస్తూ రాజ్యాంగానికి 86వ సవరణ చేయటం జరిగింది. అనేక ఆందోళన పోరాటాలు జరిగిన ఫలితంగా అర్థశతాబ్దం గడిచిన తర్వాత ప్రాథమిక విద్యని ప్రాథమిక హక్కుల్లో చేర్చటం జరిగింది. రాజ్యాంగ సవరణకి అనుగుణంగా మన రాష్ట్రంలో చట్టం చేయటానికి గత సంవత్సరమే అసెంబ్లీలో బిల్లు పెట్టటానికి ప్రభుత్వం ఒకడుగు వేసి వెంటనే వెనక్కి తీసుకొన్నది. చట్టం చేసి అమలు చేయలేకపోతే అభాసుపాలవుతామనే భయంతోనే ప్రభుత్వం వెనకడుగువేసింది.

## చట్టాలున్నా సంకల్పం కావాలి

నిన్నటి దాకా ఆదేశిక సూత్రాల్లో వున్న విద్య నేడు ప్రాథమిక హక్కుల్లో చేరటంతోనే అందరికీ విద్య అందుతుందనే గ్యారంటీ ఏముంది? అందుకు అవసరమైన చర్యలు తీసుకొంటేనే సాధ్యం అవుతుంది. అలాంటి చర్యల్లో రాజకీయ సంకల్పం, నిధుల కేటాయింపు ముఖ్యమైనవి. ఈ రెండూ కొరవడినందునే యింతకాలం అందరికీ విద్య అందనంతదూరంలోనే వుంటున్నది. విద్యా రంగాన్ని విఫణివస్తువుగా, ప్రైవేటీకరణకు అనువైన వనరుగా మలచిన సంస్కరణలకు సాగిలపడిన ప్రభుత్వాలు అందరికీ విద్యని అందించే సామాజిక కర్తవ్యాన్ని సాధించేది కల్ల. అక్షరాస్యతా సాధనను ప్రజా ఉద్యమంగా నడిపి అనతికాలంలోనే అద్భుతమైన ఫలితాలు సాధించిన అనుభవాలు అనేక దేశాల్లో వున్నాయి. మాజీ సోవియట్ సోషలిస్ట్ రష్యా, వియత్నాం, క్యూబా, చైనా లాంటి దేశాలు ఆ కోవలో నిలిచాయి. మన దేశంలో కేరళ, తమిళనాడు వంటి రాష్ట్రాల్లో కూడ ఉద్యమ సంకల్పంతో అత్యధిక అక్షరాస్యత సాధించటం జరిగింది. అలాంటి అనుభవాలను సమీక్షించుకొని ఆచరణాత్మక చర్యలు చేపడితే అందరికీ విద్యను అందించగలము.

❑

---

*(6వ పేజీ తరువాయి)*

సాధ్యం కాదు. భా.జ.పా.లో వున్న అగ్రనాయకత్వం, ద్వితీయశ్రేణి నాయకత్వం, యింకా యితరులు, అద్వానీ రాజీనామాను వుపసంహరించామనుకున్నారే గానీ, ఆయన భావాలను సమర్థించలేదు. కనీసం చర్చించి నిజం నిగ్గు తేలుస్తామన్న ప్రయత్నమూ చేయలేదు. దీనికారణం ఆర్.ఎస్.ఎస్.కు భా.జ.పా.పై ఉన్న సంపూర్ణమైన ఆధిపత్యం ఆర్.ఎస్.ఎస్.ను కాదనే సాహసం భా.జ.పాకు లేదు. దాదాపు తొంభై శాతం నాయకులు ఒకప్పటి స్వయం సేవకులే(వాజ్‌పేయి ఇదే విషయాన్ని ప్రధానిగా వున్నపుడు, అమెరికా గడ్డపై సగర్వంగా ప్రకటించుకున్నాడు). అది వారికి గర్వకారణంగా చెప్పుకుంటారు. ఆర్.ఎస్.ఎస్.భావజాలానికి ఆద్యుడైన వీరసావర్కార్ జిన్నా ద్విజాతి సిద్ధాంతం ప్రవచించక ముందే, తన 'హిందూత్వ' గ్రంథంలో, యీ సిద్ధాంతాన్ని గూర్చి చెప్పివున్నాడు. ఆ సిద్ధాంతం ప్రకారం మెజార్టీ ప్రజల మత ప్రాతిపదికపై, జాతీయ రాజ్యం ఏర్పడ్డాక, ఇక ఆ దేశంలో వుండే ప్రజలందరూ లౌకికత్వానికి, మతవిభేదాలు లేకుండా, మత ప్రాతిపదికపై ప్రత్యేక హక్కులు పొందకుండా, మెజార్టీ ప్రజలతో కలిసి, మెలిసి, సర్దుకుపోయి జీవించాలి. ఇదీ జిన్నా ఆవుపన్యాసంలో చెప్పింది. అదే అంశాన్ని అద్వానీ కూడ చెపుతూవస్తున్నాడు. అందుకనే ఇక్కడి లౌకికవాదుల్ని నకిలీ లౌకికవాదులంటున్నాడు. మైనార్టీలకు ప్రత్యేకహక్కులిచ్చే విధంగా రాజ్యాంగబద్ధమైన రాయితీలున్నాయి. కాబట్టి అలా వుండకూడదని, అందరూ ఒకే చట్టానికి కట్టుబడి వుండాలని అద్వానీ అభిప్రాయం. అందుకే జిన్నా లౌకికవాదవుపన్యాసాన్ని కోట్ చేసి జిన్నాకు లౌకికవాది కితాబునిచ్చాడు. అటు ముస్లింమతవాదులూ, ఇటు హిందూ మతతత్వవాదులిద్దరూ అద్దంలో ప్రతిబింబాలే. నాణేనికి రెండు పార్శ్వాలే!

❑

# సామాజిక లక్ష్యాలను నిర్దేశించుకోని సెకండరీ విద్య

- ఎ. నరసింహా రెడ్డి

**విద్య వ్యవస్థీకృత మానవ కార్యకలాపం. వ్యవస్థీకృత కార్యకలాపం నిర్దిష్ట లక్ష్య సాధనకు ఉద్దేశించబడినది. కాబట్టి వ్యవస్థీకృత మానవ ఆచరణను నియంత్రించి నడిపించడానికి వర్గ సమాజంలో వర్గ ప్రయోజనాల్ని ఆశించి నెరవేర్చింది. పెట్టుబడిదారీ వ్యవస్థలో విద్య పెట్టుబడిని పెంచడానికి దోహదపడింది. నేటి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ కాలంలో బహుళ జాతి సంస్థల మార్కెట్ ప్రయోజనాలు చేకూర్చి లాభాలు సంపాదించడానికి దోహదపడుతుంది. వర్గ సమాజంలో విద్య తటస్థంగా ఉండదు. మన దేశంలో కుల-వర్గ ప్రయోజనంతో బాటు సామ్రాజ్యవాద ప్రయోజనం కొరకు విద్య వ్యవస్థ దోహద పడుతుంది. అందువలన విద్యలో అసమానతలు చోటుచేసుకోవడంతోబాటు నేడు విద్య ఒక వాణిజ్య సరుకుగా మారి లాభాలు సంపాదించే వ్యాపారంగా మారింది. ఈ నేపథ్యంలో సెకండరీవిద్య స్థితిని పరిశీలించడం ఈ వ్యాస ఉద్దేశ్యం.**

మన దేశంలో ఆగష్టు 1947 తర్వాత ప్రత్యక్ష వలస అంతరించింది. 1950 జనవరి 26 నుండి రాజ్యాంగం అమలులోకి వచ్చింది. మన రాజ్యాంగం సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని సాధించడం తన లక్ష్యాలుగా ప్రకటించుకొంది. ఆ లక్ష్యాల సాధనకు విద్యను ఒక సాధనం చేసింది. మన రాజ్యాంగం అమలులోకి వచ్చి దాదాపు ఐదున్నర దశాబ్దాలు గడిచింది. అయినా నేటికీ దేశ ప్రజలకు సామాజిక, ఆర్థికన్యాయం చేకూరలేదు. వ్యక్తుల మధ్య, ప్రాంతాల మధ్య ఆర్థిక అంతరాలు పెరిగి పోయాయి. ఇక విద్యలో అందరికి సమాన అవకాశాలు అన్న రాజ్యాంగ హామీ ఆచరణీయం కాలేదు. నాటినుండి నేటివరకు కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు వందకు పైగానే కమిషన్లు వేశాయి. ఏ ఒక్క కమిషన్ సూచనలు అమలులోకి రాలేదు. ప్రభుత్వాలు మారినప్పుడల్లా విద్యారంగంపై ఓ కొత్త ప్రయోగం చేస్తున్నారు.

అసమానతలున్న సమాజంలో విభిన్న సామాజిక నేపథ్యాల నుండి పాఠశాలలకు వస్తున్న పిల్లల అభ్యసన గమనం వారి సామాజికార్థిక నేపథ్యంతో ముడిపడి ఉంటుంది. విద్యలో వారి రాణింపు అసమంగా ఉండే స్థితి అనివార్యంగా ఉంటుంది. విభిన్న సామాజిక నేపథ్యాల ఫలితంగా అనివార్యంగా తలెత్తబోయే అసమానతల్ని అధిగమించే విధంగా పాఠశాల వ్యవస్థ ఉండాలి. కాని ప్రస్తుత మన పాఠశాల వ్యవస్థ, పాఠ్యాంశాలు, బోధన పద్ధతులు, పరీక్షా విధానం సమాజంలోనున్నటువంటి అసమానతల్ని, క్రమానుగత శ్రేణుల్ని పునరుత్పత్తి చేసే విధంగా ఉన్నాయి. విషయ వివక్షత, విద్యాక్రమవివక్షత, భాష వివక్షత విద్యలో గుప్తంగా, బహిరంగంగా ఉండడం వలన సమానత సాధించవలసిన విద్యావ్యవస్థ తానే ఒక సమస్యగా పరిణమించడం విషాదకరం.

మన దేశ విద్యావిధానం ద్వైదీభావాల కేంద్రం. రెండు రకాల పాఠశాలలు, రెండు రకాల విద్యా వసతులు, రెండు రకాల బోధనా మాధ్యమాలు, రెండు రకాల ప్రతిభా పాటవాలు విస్పష్టంగా కన్పిస్తున్నాయి. ఒక వైపు అతికొద్ది మంది నిపుణుల్ని మరోవైపు అత్యధిక నిరక్షరాస్యుల్ని తయారుచేస్తుంది. ఈ వైరుధ్య పూరిత విద్యా స్థితి హఠాత్తుగా పుట్టుక వచ్చిందికాదు. అనాదిగా మన దేశంలో విద్య విషయంలో అసమానత చోటుచేసుకొంది. వేద కాలంలో విద్య బ్రాహ్మణ, క్షత్రియ కులాలకే పరిమితం అయింది. ఆ తర్వాత బ్రిటిష్ వలస కాలంలో వడపోత విధానం ఆధారంగా విద్య అగ్రకులాలకు, సంపన్నులకే పరిమితమై పోయింది. ప్రభుత్వ-ప్రైవేట్ పాఠశాలలు, తెలుగు-ఆంగ్ల మాధ్యమంలో బోధన లాంటి ద్వంద్వ విధానం వ్యవస్థీకరింపబడింది. 1966లో డా॥ కొఠారి సూచించిన కామన్‌స్కూల్ విధానం పార్లమెంట్‌లో ఆమోదం పొందినప్పటికీ ఆచరణలోకి రాలేదు. రాజీవ్ గాంధీ నూతన విద్యా విధానం (1986) శిష్ట వర్గాన్ని తయారుచేసేదిగా కొనసాగింది. నూతన విద్యావిధానంపై నియమించిన ఆచార్య రాంమూర్తి (1990) కమిటీ విద్యా విధానంలో ఎన్నో అపసవ్యతలున్నాయని పేర్కొన్నారు. నూతన ఆర్థిక విధానాలు అమలులోకి వచ్చిన తర్వాత సెకండరీ విద్యలో కార్పోరేట్ జోక్యం పెరిగింది. ఇంటర్‌నేషనల్ స్కూల్సు, కాన్‌సెప్ట్ స్కూల్సు ఎన్నో వెలిశాయి. పాఠశాలల మధ్య బోధనలో, విద్యా ప్రమాణాలలో తేడాలు చోటు చేసుకున్నాయి. పర్యవసానంగా ప్రాంతాల మధ్య, వర్గాలమధ్య, కులాల మధ్య విద్యాప్రమాణాలలో అంతరాలు పెరిగాయి. విద్య సంపన్నుల ప్రత్యేక హక్కుగా మారింది.

రాజ్యాంగం అమలులోకి వచ్చిన వెంటనే నియమించిన మొదటి సెకండరీ విద్యాకమిషన్ డా॥ మొదలియార్ కమిటీ (1952) దారిద్రం తాండవిస్తున్న చోట ప్రజాస్వామ్యం పరిఢవిల్లదని అభిప్రాయపడింది. కాబట్టి ప్రజాస్వామ్య మనుగడకు ఉత్పత్తిని

అధికం చేసే వృత్తి సామర్థ్యాన్ని పెంచాలని, వ్యక్తిత్వ వికాసాభివృద్ధికి సృజనాత్మకాంశాలను విద్యాక్రమంలో ఏర్పాటు విద్య లక్ష్యం కావాలని పేర్కొంది. డా॥ కొఠారి (1966) కమిషన్ విద్యను ఉత్పత్తితో అనుసంధానం చేయాలని, ప్రజాస్వామ్యం పటిష్ట పరచడానికి విద్య దోహద పడాలని, విద్యార్థుల ఆసక్తుల్ని, అభిరుచుల్ని, నైపుణ్యాన్ని పెంపొందిస్తూ సమాజానికి నిర్దిష్టమయిన సామాజిక లక్ష్యాలను విద్య ద్వారా సాధించాలని పేర్కొనడం జరిగింది. రాజీవ్ గాంధీ నూతన విద్యా విధానం (1986) విద్యలో సమాన అవకాశాల గురించి నొక్కి చెప్పింది. ఇంత వరకు విద్యకు దూరంగా ఉన్న మహిళ, మైనారిటీ, దళిత, ఆదివాసీలకు ప్రత్యేక ప్రణాళికలు రూపొందించి అమలుచేయాలని పేర్కొంది. అయితే 1986 నూతన విద్యా విధానం విద్యాపరంగా కంటే రాజకీయపరమైందన్న విమర్శ వచ్చింది. నూతన విద్యా విధానాన్ని సమీక్షించడానికి నియమించిన ఆచార్య రాంమూర్తి కమిటీ (1990) ప్రపంచ నిరక్షరాస్యులలో 50 శాతం మన దేశంలో ఉన్నారని, ఆర్థిక, రాజకీయ ప్రగతి ఉన్నప్పటికి అశేష ప్రజానీకానికి విద్య అందక పోవడం పట్ల విచారం వ్యక్తంచేసింది. విద్యను ఉత్పత్తికి, ఉపాధికి అనుసంధానం చేయాలని రాంమూర్తి కమిటీ పేర్కొంది. ఇప్పటి వరకు విద్యాలక్ష్యాలు శిష్టవర్గానికి తోడ్పడ్డాయని, అనేక అపసవ్యతలు విద్యా విధానంలో చోటు చేసుకొన్నాయని, సమాన అవకాశాలు కల్పించడానికి, ఒకేరకమైన విద్య అందరికి అందించడానికి "కామన్‌స్కూల్" విధానం అమలు పరచాలని, ప్రైవేట్ యాజ మాన్యంలోని సెకండరీ పాఠశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని కమిటీ పేర్కొంది.

విద్య మానవ వికాసానికి, సామాజిక అభివృద్ధికి తోడ్పడాలి. విద్య ఒక నిరంతర ప్రక్రియగా, ఒక ప్రయోజనాత్మకమైన చర్యగా ఉండాలి. అభివృద్ధి చెందిన దేశాలు, అవిసాధించిన ప్రగతి విద్యా ప్రగతి ద్వారానే అన్నది అక్షర సత్యం. ఏ సామాజిక వ్యవస్థకైనా విద్యా రంగం ప్రాథమికమైనది. అందుకే సామాజిక వ్యవస్థలో విద్యను సామాజికాంశంగా, ప్రాధాన్యతగల అంశంగా గుర్తించాలి. మనిషి సామాజికాచరణలో గడించిన అనుభవాన్ని ఆలోచనపూర్వకంగా విశ్లేషించడాన్ని, వ్యక్తీకరించడాన్ని జ్ఞానంగా పేర్కొనవచ్చు. ఈ జ్ఞానం విద్య ద్వారా ఒక తరం నుండి మరోతరానికి వ్యాప్తి చెందుతుంది. విద్య జ్ఞానానికి ఒక నిధిగాను, ఒక ప్రజాతంత్ర శక్తిగాను పనిచేస్తుంది. ప్రకృతి శక్తులను, పరిసరాలను అవగతం చేసుకొని, అదుపులో పెట్టుకొని, ఉత్పత్తిని పెంచి ప్రజల అవసరాలను తీర్చడానికి విద్య ఒక సాధనంగా పనిచేయాలి. మనిషిని విద్య బహుముఖ ప్రజ్ఞాశాలిగా రూపొందించాలి. విద్యారంగం అభివృద్ధి చెందకుండా ఏ ఇతర రంగం అభివృద్ధి చెందదు. విద్య మానవ సామర్థ్యాన్ని అభివృద్ధి పరిస్తే, మనిషి ప్రకృతిని సద్వినియోగ పరచుకొని అభివృద్ధి చెందుతాడు.

మన రాష్ట్రంలో 1990-91 లో 6365 సెకండరీ పాఠశాలలు ఉండగా అవి 2003-04 సంవత్సరానికి 13242 కి పెరిగాయి. పాఠశాలల్లో 90-91 (8,9,10 తరగతులు) విద్యార్థులు 27 లక్షల 80 వేలు ఉండగా 2003-04 నాటికి 25లక్షల 97వేలకు తగ్గింది. అంటే సెకండరీ విద్యనభ్యసించే విద్యార్థుల సంఖ్య రెండు లక్షలు తగ్గింది. నేడున్న సెకండరీ పాఠశాలల్లో నాల్గవ వంతు పాఠశాలలు ప్రైవేట్ యాజమాన్యంలో ఉన్నాయి. విద్యార్థులు నలభైశాతం ప్రైవేట్ పాఠశాలల్లో విద్యనభ్యసిస్తున్నారు. ఇక ప్రాథమిక విద్య అక్షరాస్యతగా మారింది. నియత విద్య అనియత విద్యగా కొనసాగుతోంది. నిర్బంధ విద్యా చట్టం నిర్బంద పాఠశాలలను హామీ ఇవ్వలేదు.

సెకండరీ పాఠశాలల్లో సైన్స్-ఆంగ్ల విషయోపాధ్యాయులను 2003 లో భర్తీచేసింది. 1985-2004 మధ్యలో ఎయిడెడ్ పాఠశాలల్లో ఏర్పడిన ఖాళీ పోస్టులను 2004 లో భర్తీచేసింది. ఇప్పటికి 4000 సెకండరీ పాఠశాలల్లో వ్యాయామ ఉపాధ్యాయులు, విషయోపాధ్యాయుల పోస్టులు మంజూరి చేయబడలేదు. ఏ ఒక్క పాఠశాలలో తగిన సైన్స్ ప్రయోగశాల, గ్రంథాలయంలేదు. కొన్ని పాఠశాలలకు తగినంత భవన సదుపాయంకూడ లేదు. రిటైర్‌మెంట్లు, పదోన్నతి ద్వారా ఏర్పడిన ఖాళీలను వెంటనే భర్తీ చేయరు. 1000 పైగా ఉన్నత పాఠశాలల్లో ఉండవల్సిన సంఖ్యలో ఉపాధ్యాయులులేరు. కొన్ని పాఠశాలలు షిఫ్ట్ పద్ధతిలో నడుస్తున్నాయి. కొన్ని పాఠశాలల భవనాలు శిథిలావస్థలో ఉన్నాయి. ప్రభుత్వ పాఠశాలలకు వస్తున్న విద్యార్థులు పేదవారు. వారి విద్యా వికాసాన్ని పట్టించుకొనే నాథుడే కరువైనాడు.

1984-85 విద్యాసంవత్సరంలో ఏడు జిల్లాలలో ప్రయోగాత్మకంగా వృత్తి విద్యను ప్రవేశపెట్టారు. ఆ తర్వాత అన్ని జిల్లాలకు విస్తరింపజేశారు. రాష్ట్రంలో వృత్తి విద్య బోధించబడుతున్న సెకండరీ పాఠశాలలు కేవలం 245 మాత్రమే. అందులో పనిచేస్తున్న వృత్తివిద్యాబోధకులను రెండు దశాబ్దాలు గడిచినా క్రమబద్ధీకరించలేదు. వారికి మొదటి సంవత్సరం 600 రూపాయలు, పదిసంవత్సరాల తర్వాత 1000 రూపాయలు, గత సంవత్సరం నుండి 2500 రూపాయలు వేతనంగా చెల్లిస్తున్నారు. వృత్తి విద్య నిర్వహణ ఖర్చులో 90 శాతం కేంద్రమే భరిస్తోంది. ఈ నిధులు పూర్తిగా ఖర్చుచేయక దారిమళ్ళుతున్నాయి.

*(మిగతాది 20వ పేజీలో)*

# దేశానికి అవసరమైన సాంకేతిక విద్యను అందించే ఐఐటిలు

- చుక్కా రామయ్య

భారతదేశంలో సాంకేతిక విద్యకు ఆరంభం బ్రిటిష్ పరిపాలన కాలంలోనే జరిగింది. బ్రిటిష్‌వారు సాంకేతిక విద్యకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటానికి కారణాలు కూడా లేకపోలేదు. భారతీయ విద్య ప్రధానంగా ఆధ్యాత్మిక పునాదులపై ఆధారపడినది. చెట్టు, పుట్ట వంటి ప్రకృతి శక్తులను ఆరాధించే భారతీయ సమాజాన్ని తమ అదుపాజ్ఞలలో ఎలా పెట్టుకోవాలనేదానిపై బ్రిటిష్ వారు ఎంతో అధ్యయనం చేశారు. ప్రకృతిపై ఆధిపత్యం సంపాదించలేనిచోట ఆరాధన చోటుచేసుకుంటుందని విశ్వసించిన బ్రిటిష్ వారు, తాము ప్రకృతిపై సాధించిన ఆధిపత్యం (సాంకేతిక పరిజ్ఞానం) చూపి, తమ విద్యా విధానం భారతీయ విద్యా విధానం కన్నా మెరుగు అని చూయించదలచారు. అలా భారతీయులను పాశ్చాత్య విద్య వైపు మొగ్గుచూపేలా చేయాలని ప్రయత్నించారు.

నదులను, పర్వతాలను అమితంగా ఆరాధించే భారతీయులకు బ్రిడ్జిలను, విమానాలను బ్రిటిష్ వారు చూయించారు. నీటిని దాటేందుకు నిర్మించిన వంతెన, పర్వతాలను దాటేందుకు తయారు చేసిన విమానం ప్రకృతిపై తాము సాధించిన ఆధిపత్యానికి సంకేతాలను చూపారు. అలా రకరకాల సాంకేతిక పరమైన అంశాలను భారతదేశంలో ప్రవేశపెట్టిన బ్రిటిష్‌వారు వాటి నిర్వహణలో పాలు పంచుకొనేందుకు వీలుగా భారతీయులను సాంకేతిక విద్యవైపు ఆకర్షించారు. రూర్కీ, అన్నా, కలకత్తా ఇంజనీరింగ్ కాలేజీలలో ఇంజనీరింగ్ విద్యను బోధింపనారంభించారు.

'ఇంజనీరింగ్' అనేది ఒక నిర్మితిని నిర్వహించడానికి ఉపయోగపడుతున్నదే గాని, సగటు భారతీయుడి సమస్యకు పరిష్కారం ఎక్కడ చూపుతున్నదనే ప్రశ్న ఉదయించింది. అపుడు ఇంజనీరింగ్ విద్య 'యాంత్రికత' నుంచి మానవీయ కోణాన్ని సంతరించుకోవటమెట్లా అనే అంశంపై మేధావి వర్గం దృష్టి కేంద్రీకరించింది. జవహర్‌లాల్ నెహ్రూను ఇక్కడ ప్రధానంగా ఉదహరించాలి.

'సైన్స్' అనేది టెక్నాలజీకి మూలం. 'బేసిక్ సైన్స్' అధ్యయనం సగటు వ్యక్తి సమస్యల పరిష్కారానికి దోహదపడుతుంది గనుక ఇంజనీరింగ్ విద్యలో 'టెక్నాలజీ' సంబంధిత సబ్జెక్టులతో పాటు 'బేసిక్ సైన్స్'ను అధ్యయనం చేయటం భాగం చేయటమెట్లా అని ఆలోచించారు. అలాగే సగటు వ్యక్తి సమస్యలను గుర్తించి వాటికి పరిష్కార మార్గాలను సూచించగలిగే 'పరిశోధనా దృక్పథం' పెంచటమెట్లా అని కూడా ఆలోచించారు.

ఆ సమయంలో ఎం.ఐ.టి. (అమెరికా) నెహ్రూ దృష్టిలో పడింది. సరిగ్గా ఇలాంటి దృక్పథంతో ఎం.ఐ.టి.లో విద్యాబోధన జరగటాన్ని గుర్తించారు. దాని స్ఫూర్తితో ఐ.ఐ.టి.లకు రూపకల్పన చేశారు. అంటే ఐ.ఐ.టి.లను ప్రధానంగా మూడు అంశాలను దృష్టిలో ఉంచుకొని ప్రారంభించారు. మేథ్స్, సైన్స్‌లో మంచి ప్రతిభ కలిగిన వారికి మాత్రమే సీటివ్వటం, సగటు మనిషి సమస్యలను గుర్తించి, పరిశోధన జరిపేలా పరిశోధనా దృక్పథం అలవాటు చేయటం, సామాజిక స్పృహ (సోషల్ ఔట్ లుక్) పెంపొందించటం. వీటికి తోడుగా ఎం.ఐ.టి.లవలెనే కమ్యూనికేషన్, సాఫ్ట్‌స్కిల్స్ పెంపొందించటం ప్రధాన లక్ష్యాలుగా ఐ.ఐ.టి.లు రూపుదిద్దుకున్నాయి.

అంటే ఐ.ఐ.టి.లు ఓ భిన్నమైన ఇంజనీరింగ్ కాలేజీలని స్పష్టమవుతున్నది. సాధారణ ఇంజనీరింగ్ కాలేజీలలో చదివిన భారతీయ విద్యార్థులు ప్రాక్టికల్ పరిజ్ఞానంలో బాగా వెనుకబడి ఉంటారు. చైనా, రష్యా, అమెరికా వంటి దేశాలలో ప్రాక్టికల్స్‌కు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. ఎం.ఐ.టి.లో ఈ విషయం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. భారతదేశంలోని ఇంజనీరింగ్ విద్యార్థులు 'థియరీ'లో మంచి పరిజ్ఞానం కలిగి ఉన్నా, 'ప్రాక్టికల్' పరిజ్ఞానం బాగా తక్కువగా ఉండటం పెద్ద లోపంగా గుర్తించి, ఐ.ఐ.టి.లలో అలాంటి లోపానికి అవకాశం లేకుండా చూశారు. అందుకే ఎం.ఐ.టి.లో 150 గంటలను 'ప్రాక్టికల్స్'కు కేటాయిస్తే మన ఐ.ఐ.టి.లలో దానిని 300 గంటలుగా నిర్దేశించారు. మంచి ప్రాక్టికల్ పరిజ్ఞానంతో విద్యార్థులు ఐ.ఐ.టి.లనుంచి బయటకు రావాలని దీని ఉద్దేశ్యం.

ఐ.ఐ.టి.లలో చదివే విద్యార్థులకు శ్రమపట్ల గౌరవాన్ని పెంపొందించేలా అనేక కార్యక్రమాలు చేయిస్తారు. స్విమ్మింగ్ పూల్ వంటి నిర్మాణాలు విద్యార్థులే డిజైన్ చేసుకొని, విద్యార్థులే పూర్తి చేసుకుంటారు. ఇంకా అనేక 'సాంఘిక కార్యక్రమాలు' (సోషల్ వర్క్) ఉంటాయి. అలాగే పాఠ్యేతర కార్యక్రమాలనేకం జరుగుతుంటాయి. విద్యార్థులు తమ అభిరుచులకు అనుగుణంగా వాటిలో చేరవచ్చు.

ఓ వైపు దారిద్ర్యం, మరోవైపు నిరక్షరాస్యత తాండవించే భారత్‌వంటి తృతీయ ప్రపంచ దేశాలలో ఐ.ఐ.టి.ల వంటి ఉన్నతస్థాయి విద్యా సంస్థల ఏర్పాటు ఎంత సాహసోపేతమైనది. నెహ్రూ ఎంతో దూరదృష్టితో దేశ సౌభాగ్యం పెంచే పట్టుకొమ్మలుగా వాటిని తీర్చిదిద్దాలనే సంకల్పంతో ఆరంభం చేశారు. సాంకేతిక రంగానికి నూతన దిశానిర్దేశం చేశారు.

అయితే నెహ్రూ తదనంతర కాలంలో వాటిని దేశీయ అవసరాలకు తగ్గట్లుగా మలచటంలో పాలకులు విఫలం కావటంతో ఐ.ఐ.టి.ల వల్ల అమెరికా వంటి దేశాలు లాభపడినంతగా భారత దేశం లాభ పడలేకపోయింది. ఇది చేదైన వాస్తవం. ❑

# యు జి సి: వ్యవస్థ, ఉద్దేశాలు, సవాళ్ళు

- ప్రొ॥ ఇవటూరి రామబ్రహ్మం

పొలిటికల్ సైన్స్ డిపార్ట్‌మెంట్, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ

**యుజిసి అంటే యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్. దీని పేరును యూనివర్సిటీ డెవలప్‌మెంట్ ఎడ్యుకేషన్ కమిషన్‌గా మార్చాలని ప్రయత్నం. అసలు ఈ యుజిసి విధి ఏంటి? ఉన్నత విద్యకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దశ, దిశను సూచించడానికి నవంబర్ 1956 లో పార్లమెంట్ యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్‌ను స్థాపించడానికి ఓ చట్టాన్ని ఆమోదించింది. ఉన్నత విద్యాసంస్థల స్థాపన, సమన్వయం, ప్రమాణాలు నిర్ణయం, నిర్ధారణ, వాటి అమలు ఈ సంస్థప్రధాన విధులు. కాలేజి, యూనివర్సిటీలకు నిధులు మంజూరీ చేసే అధికారం యుజిసి కి ఉంది. బోధన, పరిశోధన, పరీక్షల నిర్వహణకు సంబంధించిన మార్గదర్శకసూత్రాలు ఈ సంస్థ నిర్ణయిస్తుంది. 1976 వరకు విద్య రాష్ట్ర జాబితాలో ఉండేది. రాజ్యాంగ సవరణ ద్వారా ఈ అంశం రాజ్యాంగంలోని ఉమ్మడి అంశాల జాబితాకు చేర్చబడింది. ఈ పరిణామంతో విద్యారంగంపై కేంద్ర ప్రభుత్వ పెత్తనం ఎక్కువ అవుతూ వచ్చింది. యుజిసి కాకుండా అనేక సమాంతర వ్యవస్థలను కేంద్రం స్థాపించింది. జాతీయ అవసరాలు, జాతీయ ప్రమాణాలు, జాతీయ విద్యావ్యవస్థ అవసరం, జాతీయ విలువలు, దృక్పథం వంటి లక్ష్యాలతో కేంద్ర విధానాలు రూపొందించారు. వీటి అమలు యుజిసి ప్రధానవిధి.**

యుజిసి రాక పూర్వం ఉన్నత విద్యకు వ్యవస్థాపర ఏర్పాటు 1925లో ఇంటర్-యూనివర్సిటీ బోర్డుద్వారా జరిగింది. అంతర యూనివర్సిటీ వ్యవహారాలు, క్రీడలు, సహకారం వంటి సబ్జెక్టులు ఈ బోర్డు చూసుకొనేది. స్వాతంత్ర్యం తర్వాత 1948 లో యూనివర్సిటీ విద్యాకమిషన్ సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యక్షతన ఏర్పడింది. దేశ అవసరాలు, ఆశయాలను దృష్టిలో ఉంచుకొని భారతీయ విశ్వవిద్యాలయాలకు సంబంధించి భవిష్యత్‌లో చేయవలసిన మార్పులను సూచించమని ఈ కమిషన్‌ను కోరారు. బ్రిటన్‌లో ఉన్న యూనివర్సిటీ గ్రాంట్స్ కమిటీని నమూనాగ తీసుకొని అటువంటి వ్యవస్థను సాపించమని ఈ సంఘం సిఫార్స్ చేసింది. 1952 లో కేంద్ర కేబినేట్ కేంద్రీయ, ఇతర విశ్వవిద్యాలయాలకు ఇచ్చే నిధులను విశ్వవిద్యాలయాల గ్రాంట్స్ కమిషన్‌కు అప్పగించమని తీర్మానించారు.

ఈ విధంగా యుజిసి సుమారు గత యాభై సంవత్సరాలుగా ఉన్నతవిద్యా వ్యాప్తిలో నిమగ్నమైంది. 2004 నాటికి దేశంలో సుమారు 360 ఉన్నత విద్యా సంస్థలు, 16000 కాలేజీలలో సుమారు 89 లక్షల మంది విద్యను అభ్యసిస్తున్నారు. 2005 సంవత్సరంలో యుజిసి బడ్జెట్ అంచనాలు రు.1870 కోట్లు. అందులో సుమారు 1100 కోట్లు మేంటెనెన్స్ కింద మిగిలినది గుర్తింపు పొందిన విశ్వ విద్యాలయాలకు ఇస్తుంది.

**ఉన్నతవిద్య-స్వాతంత్ర్యం ముందు**

1857 నుంచి 1948 మధ్యన దేశంలో 20 విశ్వవిద్యాలయాలు, 496 కాలేజీలు ఉండేవి. వీటిలో 2.15 లక్షల మంది చదువుకొనేవారు. 1950 నుంచి 2004 మధ్యన 360 ఉన్నత విశ్వవిద్యాలయాలు, 16 వేల కాలేజీలు వెలిసాయి. వీటిలో సుమారు 89 నుంచి 90 లక్షల మంది విద్యార్థులు అభ్యసిస్తున్నారు. 17-23 సంవత్సరాల మధ్య ఉన్నయువతీ యువకులకు సాధారణంగా ఉన్నత విద్య ఉద్దేశింపబడింది. కానీ మన దేశంలో ఈ వయసులో అభ్యసిస్తున్నవారి సంఖ్య 7-8 శాతం మధ్యనే ఉంటుంది. ఉన్నతవిద్య అవకాశాలు మెరుగు పరిచేందుకు చేసిన ప్రయత్నాలు అనుకోని పరిణామాలకు దారి తీసాయి. యుజిసి నియమావళి అనుసారం తన విధులను విస్తృత పరచుకుంటూ వస్తున్నా, విపణి శక్తులలో వస్తున్న మార్పులకు ప్రస్తుత ఉన్నత విద్యావ్యవస్థ అందించే మానవ వనరులకు మధ్య తేడా గత 5-6 సంవత్సరాలుగా తీవ్రమవడం గమనించవలసిన పరిణామం. మార్కెట్‌కు అవసరమైన నైపుణ్యాలు వెంటనే అందించడంలో ప్రభుత్వరంగం వైఫల్యం చెందడంతో, ప్రైవేటు చదువులకు గిరాకీ ఏర్పడిందని కొందరు పరిశీలకుల అభిప్రాయం.

చారిత్రికంగా చూస్తే రాధాకృష్ణన్ కమిషన్ యుజిసి బాధ్యతలను చాలా స్పష్టంగా పేర్కొంది. విశ్వవిద్యాలయాలు రాజకీయాలకు, పాలనావ్యవస్థకు, పారిశ్రామిక రంగానికి నాయకత్వాన్ని అందించాలని పేర్కొన్నారు. అన్నిరకాల ఉన్నత విద్యను అందించాలని, దేశాన్ని పీడిస్తున్న ఆకలి, దారిద్ర్యం, నిరక్షరాస్యత వంటి జాడ్యాలనుంచి విముక్తి చెందించే ఉన్నత విద్యను అందించాలని అభిలషించారు.

యుజిసి స్థాపించినపుడు దేశంలోనే ఉండే ఒకే ఒక విరాళాల సంఘం. అదేకాక ప్రమాణాల పరిరక్షణా బాధ్యత కూడ యుజిసిదే.

ఇవికాక i) యూనివర్శిటీ విద్య విస్తరణ, సమన్వయం ii) బోధన, పరిశోధన, పరీక్షా ప్రమాణాల నిర్ణయం iii) కనీస ప్రమాణాల నిర్ధారణకు అవసరమైన మార్గదర్శక సూత్రాల రూపకల్పన iv) కాలేజీ, యూనివర్సిటీల విద్యా మూల్యాంకనం, నిధుల మంజూరు, విడుదల v) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ఉన్నతవిద్యా సంస్థలకు మధ్య కీలక వ్యవస్థగాను vi) యూనివర్శిటీ విద్యపై కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు సలహాలను ఇవ్వడం vii) ఉన్నత విద్యలో జాతీయ విధానాల రూపకల్పనలో ప్రధాన పాత్ర.

భారతదేశ ఉన్నతవిద్య అఫిలియేటింగ్ సూత్రంపైన ఆధారపడడం మరో పేర్కొన తగ్గ అంశం. యు జి సి చట్టంలో 12 (బి) 2 (ఎఫ్) అనే రెండు అంశాలు పేర్కొనాలి. ఒకటి అఫిలియేషన్. ఏ కాలేజీ అయినా ఏదో ఒక విశ్వవిద్యాలయానికి అనుబంధమై ఉండాలి. రెండోది అది యుజిసి నిధులు పొందడానికి అర్హతకలిగి ఉండాలి. మొత్తం ప్రపంచంలో భారతదేశం, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో తప్ప ఈ అఫిలియేటింగ్ వ్యవస్థ ఎక్కడాలేదు. విశ్వవిద్యాలయాల విరాళాలసంఘం, యూనివర్సిటీల అధిక సమయం ఈ అనుబంధ కళాశాలల నిర్వహణకే వెచ్చిస్తారు. ఈ రెగ్యులేటరీ విధి యుజిసి సమర్థవంతంగా నిర్వహించ గలుగుతోందా? అనుమానమే.

ఇతరదేశాల జనాభా యునివర్సిటీల నిష్పత్తి ఆరోగ్యకరంగా ఉంది. ఉదాహరణకు అమెరికా జనాభా 28 కోట్లుకాగా 2364 విశ్వవిద్యాలయాలు ఉంటే (1752 ప్రైవేటు) బ్రిటన్‌లో 104 యునివర్సిటీలు, 231 అటానమస్ సంస్థలు ఉన్నాయి. దీని జనాభా ఆరుకోట్లు! జపాన్ జనాభా సుమారు 12 కోట్లు. 684 యూనివర్సిటీలు ఉన్నాయి. జర్మనీ జనాభా ఎనిమిదికోట్లు ఉంటే 330 విశ్వవిద్యాలయాలు ఉన్నాయి.

పై నిష్పత్తిలో చూస్తే 104 కోట్ల జనాభా ఉండే భారతదేశంలో సుమారు 360 విశ్వవిద్యాలయాలే ఉండడం ఆలోచింపచేయాలి. యునివర్సిటీ కాన్సెప్ట్‌లోమనకు, పాశ్చాత్యదేశాల మధ్య ఉన్న ప్రధాన విభేదాలను సూచిస్తుంది. మనం డిగ్రీలు ఇచ్చే సంస్థలుగా పరిగణించడంతో వ్యవస్థ అనేక సమస్యలకు దారితీస్తోంది.

ఉన్న 360 యూనివర్సిటీలలో కొన్ని యుజిసి గుర్తింపు అవసరంలేకుండా ప్రారంభించి విద్యను వ్యాపారంగా మార్చి నాణ్యత ప్రమాణాలను అపహాస్యం చేస్తున్నారు. వీటి నియంత్రణ యుజిసికి పెద్ద సవాలు. తనకుండే సిబ్బంది, అధికారాల పరిధిలో వీటిని నియంత్రించే ప్రక్రియలో ఉన్నత విద్యారంగంలో భవిష్యత్‌లో ఉత్పన్నమయ్యే మార్పులను ఎదుర్కొనే విధానపర ఆలోచనలపై కేంద్రీకరించగలదా?

మరికొన్ని కోణాలనుంచి యుజిసిని విశ్లేషించేముందు దేశంలో ఉండే వివిధ ఉన్నత విద్యాసంస్థలు ఏవోచూద్దాం.

ఈక్రింద పేర్కొన్న పట్టికద్వారా ఎన్నిరకాల సంస్థలు యు జి సి పరిధిలో ఉన్నాయో తెలుసుకుందాం.

| నం. | ఉన్నతవిద్యా సంస్థలు: వివిధ రకాలు | సంఖ్య |
|---|---|---|
| 1 | సెంట్రల్ యూనివర్సిటీలు | 18* |
| 2 | రాష్ట్ర విశ్వవిద్యాలయాలు | 178 |
| 3 | డీమ్డ్ యునివర్సిటీలు | 52 |
| 4 | రాష్ట్రాల చట్టాల ద్వారా నెలకొల్పబడిన సంస్థలు | 5 |
| 5 | జాతీయ గుర్తింపు పొందిన సంస్థలు | 12 |
| 6 | కాలేజీలు | 1600* |

* పైన పేర్కొన్న వాటిలో 145 విశ్వవిద్యాలయాలు, 4600 కాలేజీలు వివిధ స్కీములద్వారా ఆర్థిక సహాయాన్ని పొందుతున్నాయి. (కవితా ర్మ: యుజిసి- యాభైసంవత్సరాలు (గోల్డెన్ జూబిలి) 2004).

ఇందిరాగాంధీ సార్వత్రిక విశ్వవిద్యాలయం, కేంద్రీయ అగ్రికల్చరల్ యూనివర్సిటీ పైనపేర్కొన్న వాటిలో కలిపి ఉన్నాయి. ఈ పట్టిక వివిధ ఇతర రిపోర్టుల ఆధారంగా రూపొందించాం.

చెప్పాలంటే 2002-2003 యుజిసి నివేదిక అనుసారం 580 కాలేజీల అభివృద్ధికై యుజిసి సుమారు 653 కోట్లరూపాయలు మంజూరు చేసిందని అవగతమౌతుంది. అదేవిధంగా 116 అటానమస్ కాలేజిలు కూడా నిధులు పొందాయి. 23 కరెస్పాండెన్స్ కోర్సులకు కూడా అనుమతినిచ్చింది.

యు జి సి విద్యా వ్యాప్తికేకాక పరిశోధనకు కూడా సమాన ప్రాముఖ్యం ఇవ్వాలి. యుజిసి చట్టం 12(సిసిసి) నెంబరు ప్రకారం పరిశోధన రంగంలో దీని పాత్రచూస్తాం: ఈ చట్టంలో పేర్కొన్న అంశాల సాధనకు, ఉమ్మడి వినియోగానికి, సేవలకు అనేక సెంటర్లను ప్రారంభించింది. ఉన్నత విద్య సంస్థలు అంటే యూనివర్సిటీలు ఇతర సంస్థలు ఈ క్రింద పేర్కొన్న వ్యవస్థలలో జరుగుతున్న రిసెర్చ్‌తో అనుబంధమవడానికి మంచి అవకాశం కల్పిస్తుంది.

1) న్యూక్లియర్ సైన్స్ సెంటర్, న్యూఢిల్లీ 1984
2) ఇంటర్-యూనివర్సిటీ సెంటర్ ఫర్ ఏస్ట్రానమి, ఏస్ట్రోఫిజిక్స్
3) ఇంటర్-యూనివర్సిటీ కన్సార్టియమ్, ఇండోర్, 1989
4) కన్సార్టియమ్ ఫర్ ఎడ్యుకేషనల్ కమ్యూనికేషన్ , 1991
5) ఇన్ఫర్మేషన్ అండ్ లైబ్రరీ నెట్‌వర్క్ (ఇన్‌ఫ్లిబినెట్) 1991
6) పశ్చిమ ప్రాంతీయ ఇన్‌స్ట్రుమెంటేషన్ సెంటర్, 1978

7) దక్షిణ ప్రాంతీయ ఇన్‌స్ట్రుమెంటేషన్ సెంటర్, బెంగుళూరు
8) క్రిస్టల్ గ్రోత్ సెంటర్; అన్నాయూనివర్సిటీ
9) ఎమ్ ఎస్ టి రాడార్ సెంటర్, శ్రీవెంకటేశ్వరా యూనివర్సిటీ, తిరుపతి
10) ఇంటర్ యూనివర్సిటీ సెంటర్‌ఫర్ హ్యూమానిటీస్ & సోషల్‌సైన్సెస్, సిమ్లా
11) ఈస్టర్న్ సెంటర్ ఫర్ రేడియోఫిజిక్స్, కోల్‌కత్తా
12) నేషనల్ సెంటర్ ఫర్ సైన్స్ ఇన్ఫర్మేషన్, బెంగుళూరు
13) ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్, ఎస్.ఎన్.డి.టి. యూనివర్సిటీ
14) ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్ ఎంఎస్ బరోడా

ఇదేకాకుండా ఏ యూనివర్సిటీ అయినా తన విద్యా కార్యక్రమాలను మెరుగు పరచడానికి యుజిసి ని సలహా అడిగి పొందవచ్చు. ఎన్నివిశ్వవిద్యాలయాలు ఇటువంటి సలహా పొందుతున్నాయి? వాటి పనితీరు ఏవిధంగా మెరుగుపడింది వంటి వివరాలు అందుబాటులోలేవు. యుజిసికి అనుబంధంగా రాష్ట్రస్థాయిలో ఆరు కౌన్సిల్స్ ఫర్ హైయర్ ఎడ్యుకేషన్, ప్రారంభించారు. అలాగే వివిధ మంజూరీలలో జాప్యం నివారించడానికి ఏడు ప్రాంతీయ కార్యాలయాలను యుజిసి ప్రారంభించింది.

ఇంటర్ యూనివర్సిటీ సెంటర్ల స్థాపనవల్ల ఏమాత్రం, ఏ సంస్థలు ప్రయోజనం పొందాయో అంచనావేయడానికి సమాచారం లేదు. అదేవిధంగా రాష్ట్రస్థాయి ఉన్నత విద్యామండళ్ళు తమ పరిధిలోని విశ్వవిద్యాయాలలో పరిశోధన, బోధన, విస్తరణ పటిష్ట పరచడానికి తీసుకున్న చర్యలు, వాటి ప్రభావాలపైన విధానపర విశ్లేషణకు దోహదపడే సమాచారం లభ్యంకాకపోవడం అందరినీ ఆలోచింపచేయాలి. ప్రవేశ పరీక్షలు నిర్వహణ ఒక గురుతరమైన బాధ్యత కాని వీటికే పరిమితమైతే ఉన్నతవిద్య అందులోనూ సామాజిక రంగంలో వెనుకబడ్డ రాష్ట్రాలు ఎదుర్కొంటున్న సమస్యలను గురించి ఆలోచన చేసి తగిన విధాన వ్యూహాలు రూపొందించే బాధ్యత ఎవరిది అన్న ప్రశ్నవస్తుంది.

**యుజిసి పరిధి**

18 కేంద్ర విశ్వవిద్యాలయాలకు డెవలప్‌మెంట్, మెయింటెనేన్స్ గ్రాంట్స్ రెండూ యుజిసి అందిస్తుంది. కాని 120 పైన ఉండే రాష్ట్ర విశ్వవిద్యాలయాలకు ప్రణాళికల ద్వారా అంటే లైబ్రరీ, బిల్డింగ్‌లకు, కొత్త కోర్సుల ప్రారంభానికి అవసరమైన డెవలప్‌మెంట్ గ్రాంట్‌ను మాత్రమే యుజిసి అందిస్తుంది. ఇవేకాక 53 ఢిల్లీ యూనివర్సిటీ కాలేజీలకు, నాలుగు బనారస్ హిందూ యూనివర్సిటీ కళాశాలలకు, 12 ఢిల్లీ యూనివర్సిటీ హాస్టళ్ళకు మెయింటెనేన్స్, అభివృద్ధి రెండింటికి గ్రాంట్లు యుజి సి భరించాలి. ఇవికాక పైన పేర్కొన్న ఇంటర్ యూనివర్సిటీ సెంటర్లు, 24 డీమ్డ్ యూనివర్సిటీలకు, యుజిసి ఆర్థిక సహాయం అందుతోంది. సెంట్రల్ యూనివర్సిటీలు, కాలేజీలు, పరిశోధనలకు పెట్టేఖర్చు రాష్ట్ర విశ్వవిద్యాలయాలపై చేసే ఖర్చుకన్నా ఎక్కువగా ఉంటుంది. యుజిసి బడ్జెట్‌లో సింహభాగం వీటికే పోతుంటే ఉన్నత విద్య అభివృద్ధికై మిగిలేది అంతంత మాత్రమేనన్న అభిప్రాయం ప్రబలంగా వినపడుతుంది.

## ప్రమాణాల కొనసాగింపు

ఇక ప్రపంచీకరణ నేపథ్యంలో ఉన్నత విద్యా రంగంలో వస్తున్న పోటీని తట్టుకోడానికి మన యూనివర్సిటీలు సిద్ధంగా ఉండాలంటే గుణాత్మక విద్యకై నడుంబిగించాలనీ, దీనికి ప్రథమంగా కాలేజీలు, యూనివర్సిటీలు అసెస్‌మెంట్ అక్రిడిటేషన్ జరగాలని యుజిసి భావించి ప్రత్యేక కార్యక్రమాలను రూపొందించింది. అవి.

అ) ఇన్నోవేటివ్ ప్రోగ్రామ్స్ ఇన్ ఎమర్జింగ్ ఏరియాస్
ఆ) అంతర్జాతీయ సహకారం
ఇ) ఐడెంటిఫికేషన్ ఆఫ్ యూనివర్సిటీస్ అండ్ కాలేజెస్ విత్ పొటెన్షియల్ ఫర్ ఎక్సలెన్స్
ఈ) నెట్ వర్కింగ్ ఆఫ్ యూనివర్సిటీస్
ఉ) ఫ్యామిలి డెవలప్‌మెంట్
ఊ) జాతీయ అర్హత పరీక్ష ఫర్ రిక్రూట్‌మెంట్ ఆఫ్ లెక్చరర్స్
ఎ) రిసెర్చ్‌ను బలపర్చే స్కీములు
ఏ) ఇంజనీరింగ్, సాంకేతిక విద్య అభివృద్ధికై కార్యక్రమం
ఐ) కంప్యూటర్ విద్యారంగం విస్తరణ

పైన పేర్కొన్నవి కాక గుణాత్మక విద్య దీర్ఘకాలిక లక్ష్యంగా జాతీయ అసెస్‌మెంట్, అక్రెడిటేషన్ కౌన్సిల్‌ను యుజిసి 1994లో ప్రారంభించి ప్రమాణాల నిర్వహణకు, నాణ్యత పెంపొందించేందుకు వ్యవస్థాపర ఏర్పాట్లు పూర్తిస్థాయిలో ఇప్పుడు ఉన్నాయి. ఇప్పటికే అనేక యూనివర్సిటీలు కాలేజీలు 'నాక్ గ్రేడింగ్'ను రూపొందించాయి. గ్రేడింగ్ పైనే అనేక వివరణలు, సందేహాలు సంస్థలు కోరుతున్నప్పటికీ అనేక ఉన్నత విద్యా వ్యవస్థల పనితీరు మెరుగు పరచడానికి ఇదో అవకాశం అనేవారి సంఖ్య పెరగడం గుర్తించాలి. ఇన్ని లక్ష్యాలను సాధించేందుకు యుజిసికి ఒక సమగ్ర వ్యవస్థా చట్టం అవసరం.

**యుజిసి- వ్యవస్థ, సభ్యత్వం**

యుజిసి ఎక్కువగా కాలేజి, యూనివర్సిటీల ఉపాధ్యాయుల పేస్కేళ్ళు నిర్ణయించే వ్యవస్థగానే ప్రజలకు పరిచయం. కాని యుజిసి 1956లో పనిప్రారంభించినపుడు తొమ్మిది మంది సభ్యులతో కూడుకున్న కమిషన్. ఒక పూర్తికాల చైర్ పర్సన్, వైస్ చైర్‌పర్సన్‌తోపాటు తొమ్మిది మంది సభ్యులను కేంద్ర ప్రభుత్వం నియమిస్తుంది 1972లో ఒక సవరణ ద్వారా సభ్యత్వాన్ని 10కి

పెంచారు. కమిషన్‌లో ఇద్దరు కేంద్ర ప్రభుత్వ ఆఫీసర్లు; నలుగురు యూనివర్సిటీ ఉపాధ్యాయులు. ఇక మిగిలిన నలుగురు వ్యవసాయం, వాణిజ్యం, పారిశ్రామిక రంగానికి చెందిన వారైనా ఇంజనీరింగ్, వైద్యం న్యాయ లేదా ఇతర వృత్తులకు చెందినవారు వైస్ చాన్సలర్లుగా పనిచేస్తున్నవారు. అంటే 10 మంది సభ్యత్వం ఇలా చూడాలి i) ముగ్గురు కంటే మించకుండా విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్లు ii) భారత ప్రభుత్వం నుంచి ఇద్దరు ఆఫీసర్లు iii)మిగిలిన ఐదుగురు విద్యారంగానికి చెందిన నిష్ణాతులు.

ప్రతినెలకు ఒకసారైనా కమిషన్ సమావేశమవుతుంది. నిర్ణయాల అమలు బాధ్యత కమిషన్ సెక్రటేరియట్‌దే.

విశ్వవిద్యాలయాల ఆర్థిక అవసరాలను గురించి వాకబు చేయడం, సెంట్రల్ యూనివర్సిటీల నిర్వహణ వ్యయం, అభివృద్ధి వ్యయం అంచనా, మంజూరు, ఉన్నతవిద్య ప్రమాణాలకు సంబంధించి కోరిన విశ్వవిద్యాలయానికి సలహాలు, కన్సాలిడేటెడ్ ఫండ్‌నుంచి విశ్వవిద్యాలయాలకు గ్రాంట్లు విడుదలకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు సలహా, కొత్త విశ్వవిద్యాలయాల స్థాపనకు లేదా విస్తరణకు సలహా, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు విశ్వవిద్యాలయాలకు అడిగిన విషయాలపై సలహా, దేశ విదేశాలలో ఉన్నత విద్యకు సంబంధించిన సమాచార సేకరణ, విశ్వవిద్యాలయాలు కమిషన్ కోరిన సమాచారం సేకరణ; విశ్వవిద్యాలయాలు కమిషన్ కోరిన సమాచారం ముఖ్యంగా గ్రాంట్లు, అధ్యయనానికి సంబంధించిన ఇతర విషయాలపై తెప్పించుకొనే బాధ్యత. స్థూలంగా చెప్పాలంటే ఉన్నత విద్య అభివృద్ధికి సంబంధించిన అన్ని నిర్ణయాలు తీసుకొనే అధికారం యుజిసికి ఉందని చట్టప్రకారం చూస్తే తెలుస్తుంది. ఎంతవరకు ఆచరణలో యుజిసి వీటిని ఉపయోగించుకుంది అన్న చర్చనీయాంశం.

ఇప్పటిదాక 15 మంది చైర్మన్‌లు, 9 మంది వైస్ చైర్మన్‌లు, 9 మంది సెక్రటరీలు కమిషన్‌కు సేవలందించారు. మొదటి చైర్మన్ డాక్టర్ శాంతి స్వరూప్ భట్నాగర్. ఇతర ప్రముఖులు హుమాయూన్ కబీర్ డా॥ సి.డి. దేశ్‌ముఖ్, డా॥ వి.ఎస్. కృష్ణ, డా॥ డి.ఎస్. కొఠారి; డా॥ జార్జిజాకబ్; డా॥ సతీష్‌బాద్ర; డా॥ మాధురిబెన్‌షా; ప్రొఫెసర్ యశ్‌పాల్; డా॥ మన్మోహన్ సింగ్; ప్రొఫెసర్ జి. రాంరెడ్డి; డా॥ ఆర్మీతిదేశాయి; డా॥ హరిప్రతాప్ గౌతమ్; ప్రొఫెసర్ అరుణ్ నిగవేకర్.

**జాతీయవిధానాలు - ఉన్నతవిద్య - యుజిసి**

1968, 1986, 1992 జాతీయ విద్యావిధానాలు ఉన్నతవిద్య ఏదిశలో పయనించాలో దేశఅభివృద్ధిలో ఎటువంటి కీలకపాత్ర పోషించాలో విధాననిర్మాతలు ఆలోచించారు. ఇవికాక పంచవర్ష ప్రణాళికలలో ఉన్నతవిద్య ప్రాధాన్యతను పేర్కోడం జరిగింది. ఇవికాక 1977-78 ఉన్నతవిద్య అభివృద్ధికై ఒక అప్రోచ్ పేపర్‌ను యుజిసి తయారుచేసింది. ఈ విధాన ప్రకటన అమలుకు 10-15 సంవత్సరాల కాలం అవసరమని పేర్కొన్నారు. ఆచరణకోసం యుజిసి ఐదు వర్కింగ్ గ్రూప్‌లను నియమించింది. అవి: (i) విస్తరణా కార్యక్రమాలు; (ii) కళాశాలల మూల్యాంకనానికై కొలమానాల రూపకల్పన(iii) ఉపాధ్యాయుల పాత్ర; బాధ్యతలు (iv) నిమ్నవర్గాలకు ఉన్నతవిద్య ఎలా అందించాలి; (v) ప్రాంతీయభాషలో బోధనకు తీసుకోవల్సిన చర్యలు. 1978లో జరిగిన వైస్ ఛాన్సలర్ల కాన్ఫరెన్స్‌లో ఇవి ఆమోదించారు. అమలుకై అనేక నిర్ణయాలను తీసుకొని కార్యక్రమాలను రూపొందించారు. కాని వచ్చిన రాజకీయ మార్పులు ఈ ప్రణాళికలపై ప్రభావం చూపాయి. 1979-80 లలో ఉన్నతవిద్య సమీక్షకు ప్రభుత్వం ఆదేశించింది. ఉన్నతవిద్య అత్యున్నత జాతీయ అంతర్జాతీయ శిఖరాలను చేరాలని, కోరింది. దీనికై మొదటిగా అకడమిక్ ప్రమాణాలను కాపాడాలని పేర్కొంది. వీటికై మంజూరైన ఉపాధ్యాయ పోస్టులను భర్తీ చేయాలని పేర్కొంది. ఆతర్వాత 10 సంవత్సరాలలో బోధన సిబ్బంది భర్తీ ప్రాధాన్యతనిచ్చినా ఈరంగంలో అనూహ్యమైన మార్పులు 1991 తర్వాత ఆరంభమైనాయి.

90లలో నరళీకరణ విధానాల అమలుకు నిర్ణయం ఉన్నతవిద్యకు గొడ్డలిపెట్టు. 1995లో భారత ప్రభుత్వం ఉన్నత విద్యను నాన్‌మెరిట్‌గా పునర్వర్గీకరించింది. అంతకు ముందు మానవవనరులను పెంపొందించేదిగా పేర్కొన్న విశ్వవిద్యాలయ విద్యారంగం పునఃనమీక్షతో నమన్యల నుడిగుండంలో పడిపోయింది. కొన్ని అంచనాల్లో దేశంలో సుమారు రెండు లక్షల బోధనా సిబ్బంది భర్తీ ఆగిపోయింది. 1995లో ప్రభుత్వ సబ్సిడీలపై నివేదిక ఆధారంగా కొత్త విధానాలు రూపొందించ బడ్డాయి. ప్రపంచీకరణ నేపథ్యంలో వచ్చిన మార్పులకు అనుగుణంగా విద్యావ్యవస్థలో మార్పులు రావలసిన ఆవశ్యకతను పేర్కొంటూ దానికి ప్రభుత్వ ఆధారిత సంస్థలు సిద్ధంగాలేవని భావించి, ప్రైవేటు వర్సిటీలకు విధానపర మద్దతు ఆరంభమైంది. సమస్య తీవ్రత ఏస్థాయికి వెళ్ళిందంటే అసోషియేషన్ ఆఫ్ ఇండియన్ యూనివర్సిటీస్ (ఎఐయు) ఉన్నతవిద్య నాన్ మెరిట్ గుడ్ ఎలా అవుతుందని ప్రశ్నిస్తూ ఒక జాతీయస్థాయి సెమినార్ 1999లో జరిగింది.

అప్పటి యుజిసి ఛైర్ పర్సన్ డా॥ ఆర్మీతిదేశాయ్ అందులో చురుకుగా పాల్గొని ప్రభుత్వ మద్దతు ఉన్నతవిద్యకు అత్యవసరం అని తీర్మానించారు. అంతకుముందు యుజిసి నియమించిన జస్టిస్ పున్నయ్య కమిటీ కూడా ఉన్నతవిద్యకు రాజ్య మద్దతు ఎంత అవసరమో పేర్కోవడం మరవకూడదు.

అయినప్పటికీ ప్రభుత్వ విధానాలు క్రమేపీ ఉన్నతవిద్యను అప్రాధాన్యతారంగానికి నెట్టివేయడం గమనించాలి. యుజిసి విధానాలపై కూడా దీని ప్రభావాన్ని చూడొచ్చు.

ఒకవేళ ప్రపంచీకరణ అన్ని రంగాలలో ముఖ్యంగా నాలెడ్జ్ బేస్డ్ ఎకానమి, ఇన్ఫర్మేషన్ కమ్యునికేషన్ టెక్నాలజీల ఆవశ్యకతల నిమిత్తం మార్పుకావాలన్నా లాభాపేక్ష లేకుండా సమాన అవకాశాల దృష్ట్యా చూసినా ఉన్నతవిద్యా రంగానికి ప్రభుత్వ పెట్టుబడి అత్యవసరం. మనదేశ అవసరాల నిమిత్తం మన జాతీయ లక్ష్యాలను సాధించడానికైనా యూనివర్సిటీలు బలోపేతం కావాలి. అలాకాకుండా ప్రభుత్వ రంగంపైన పూర్తిగా ఆధారితమైన విశ్వవిద్యాలయాలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల నిరాసక్తతతో క్రమేణా బలహీనపడుతూ వస్తున్నాయి. యూనివర్సిటీలు స్వయం సమృద్ధికై కృషిచేయాలని, అలా ఆదాయం గడించిన విశ్వవిద్యాలయాలకు ప్రోత్సాహకాలు ప్రకటించి ఒక రకమైన గందరగోళ పరిస్థితిని సృష్టించాయి.

పై విధానాలు ప్రపంచబ్యాంక్, ఐ.ఎం.ఎఫ్. వంటి సంస్థల ప్రోద్బలంతో రూపొందించడం విచారకరం.

యుజిసి - వనరులు*, వ్యయం (కోట్లలో)

| క్ర. | ఆర్థిక సంవత్సరం | కేటాయింపు | ఖర్చు |
|---|---|---|---|
| 1 | 1992-93 | 467.23 | 469.15 |
| 2 | 1993-94 | 496.45 | 495.62 |
| 3 | 1994-95 | 602.49 | 571.87 |
| 4 | 1995-96 | 683.59 | 688.37 |
| 5 | 1996-97 | 687.64 | 723.93 |
| 6 | 1997-98 | 928.17 | 936.35 |
| 7 | 1998-99 | 1388.66 | 1403.79* |
| 8 | 1999-00 | 1414.77 | 1420.29 |
| 9 | 2000-2001 | 1463.00 | 1479.8 |
| 10 | 2001-2002 | 1498.56 | 1491.41 |
| 11 | 2002-2003 | 1659.47 | 1685.77 |
| 12 | 2003-2004 | 1649.05 | 1747.98 |
| 13 | 2004-2005 | 1870 | - |

* భారత ప్రభుత్వ మానవ వనరులశాఖ యజిసి కి కేంద్రం నుంచి నిధులు విడుదల చేస్తుంది.

* 1996 సవరించిన పేస్కేళ్ళు బోధన, బోధనేతర సిబ్బందికి అమలుకావడం ప్రారంభమైంది.జీతాలు పెరగడంవల్ల బడ్జెట్ కేటాయింపులు పెరిగాయి.

ఎనిమిదో పంచవర్ష ప్రణాళిక కేటాయింపులలో 40 శాతం విశ్వవిద్యాలయాలు, కాలేజీలలో మౌలిక సదుపాయాల కల్పనకు, 15 శాతం రిసెర్చ్‌కు, 9 శాతం మానవవనరులకు; రెండుశాతం అనియత విద్యకు; ఇంటర్ యూనివర్సిటీ సెంటర్లకు 11 శాతం; కొత్తగా ఆవిర్భవిస్తున్న సబ్జెక్టుల అధ్యయనానికి 11 శాతం అంతర్జాతీయ సహకారానికి 1 శాతం; యుజిసి నిర్వహణకు ఒకశాతం; ఇంజనీరింగ్, టెక్నాలజీలకు 10 శాతం నిధులు కేటాయించారు. తొమ్మిదో పంచవర్ష ప్రణాళికా కాలం (1998-2002) కేటాయింపులు ఇలా ఉన్నాయి.

| | |
|---|---|
| కాలేజీలు, విశ్వవిద్యాలయాల అభివృద్ధి | 53% |
| ప్రామోషన్ ఆఫ్ రిలవెన్స్ | 11% |
| ప్రామోషన్ ఆఫ్ ఎక్సలెన్స్, క్వాలిటీ | 13% |
| ఇంటర్ యూనివర్సిటీ వనరులు; క్వాలిటీ | 7% |
| ఎన్‌హాన్సింగ్ క్వాలిటీ అండ్ ఈక్విటీ | 4% |

ఇతర కార్యక్రమాలకు 12 శాతం నిధులు తెచ్చారు.

యుజిసి బడ్జెట్లు, ఖర్చు గత 12 సంవత్సరాల నుంచి విశ్లేషిస్తే పైకికనబడేది క్రమేపి పెరుగుతున్న కేటాయింపులు. కాని లోతుగా పరిశీలిస్తే కాలేజీలు, యూనివర్సిటీలు పెరిగిన రేటుదృష్ట్యా చూస్తే ఇది స్వల్పమే. అన్ని విశ్వవిద్యాలయాలకు అందేది ప్రణాళికసాయం. మొత్తం వనరులకేటాయింపు ఉన్నత విద్యకు రు.2270 కోట్లు. తొమ్మిదో ప్రణాళికలో రు. 1901 కోట్లు ఖర్చు చూపెట్టారు. అదే పదో ప్రణాళిక వచ్చేవరకు రూ. 2271. తొమ్మిది పదో ప్రణాళికల మధ్య పెరిగినది రూ. 370 కోట్లు. ప్రతి విశ్వవిద్యాలయానికి అభివృద్ధికై ఒక కోటి రూపాయలు కూడా సహాయం చేయలేకపోతున్నాం. ఇందులో కేంద్రీయ విశ్వవిదాలయాల ఖర్చు పక్కకు పెడితే మిగిలేది ఎంత అన్నది ఊహించడం కష్టంకాదు. పదో ప్రణాళికలో సగటున రాష్ట్ర విశ్వవిద్యాలయాలకు 2 నుంచి రెండున్నర కోట్ల వనరులు కేటాయించారు.

గ్రాంట్లదృష్ట్యా చూస్తే క్రమేపి పెరగవలసిన రీతిలో ప్రభుత్వాలు బడ్జెట్లు యుజిసి కి పెంచలేక పోతున్నాయి. మరి యుజిసి రెండోవిధి ప్రమాణాలు కాపాడడం. నూతన వర్సిటీలు ఎదుర్కొనే నాణ్యతా సమస్యలు అధికం అవుతున్నాయి.

ప్రపంచ వాణిజ్యసంస్థ సర్వీసు సెక్టరులో 161 సేవలను గుర్తించి వాటిలో వ్యాపారానికి అనుమతికోసం దేశాలకు స్వేచ్ఛ ను ఇచ్చింది. జనరల్ ఎగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ అండ్ సర్వీసెస్ (గాట్స్) ఒప్పందం ప్రకారం ఇతర దేశాల విశ్వవిద్యాలయాలు, అనుమతిఇస్తే ఇక్కడ క్యాంపస్‌లు ప్రారంభించవచ్చు. విదేశీ

విశ్వవిద్యాలయాల పోటీని తట్టుకోవాలంటే స్వదేశీవిద్య నాణ్యత, ప్రమాణం గణనీయంగా పెంపొందాలి. దీన్ని యుజిసి, నేషనల్ ఎక్రిడిటేషన్ సంస్థలు సవాలుగా తీసుకొని గ్రేడింగ్‌ను ఒక సవాలుగా తీసుకున్నాయి. అనేక సంస్థలలో అసెస్‌మెంట్ జరిగింది. స్వదేశీ విద్య విదేశీ విద్య పోటీని ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉండాలంటే వనరులు అత్యవసరం.

మొదటి జనరేషన్ విద్యార్థులు నమోదైన వారిలో ఇంకా 30 శాతం వరకు ఉంటున్నారు. విద్య విస్తరణ ఒక లక్ష్యంగా పెట్టుకొని 1970, 1980 లలో కాలేజీలు, విశ్వవిద్యాలయాలు స్థాపించినపుడు మాసిఫికేషన్ మన లక్ష్యం. 1990ల నుంచి 2000 ప్రమాణాల నాణ్యత కోరుతున్నాం. అంతర్జాతీయ పోటీ దృష్టిలో ఉంచుకొని ఈ చర్యలు తీసుకున్నా యుజిసి ఉన్నటువంటి వాటిలో మంచి వాటిని బలోపేతం చేయ్యాలో లేదా కొత్తవి అధిక పెట్టుబడితో నెలకొల్పాలో తెలియని డోలాయమాన స్థితి ప్రభుత్వ విధానాలలో ఇంక్రిమెంటలిజమ్‌ని ఆశ్రయిస్తోంది. ఒక స్థాయిలో విశ్లేషిస్తే ఆ ప్రక్రియలో యుజిసి నిస్సహాయ స్థితిని గమనించవచ్చు.

**పరిశోధన-యుజిసి పాత్ర**

ప్రత్యేక పరిశోధనా సంస్థలయినటువంటి సిఎస్ఐఆర్, ఎఐసిటిఇ, డిఎస్‌టి, డిబిటి, ఐసిఎస్ఎస్ఆర్, ఐసిహెచ్ఆర్, ఐఐఎస్‌సి శాస్త్ర సాంకేతిక విద్యకు, తత్వశాస్త్రం, చరిత్ర, సామాజిక శాస్త్రాలలో పరిశోధనకు ప్రత్యేక సంస్థలు వెలిసాయి. ఇవి యుజిసి నిర్వహించే పరిశోధనలను ప్రోత్సహించే బాధ్యతను నిర్వహించవలసి రావడంతో యుజిసి పాత్ర క్రమేపి తగ్గింది. లక్ష్యాలు ఏవైనా దాని ప్రభావం యుజిసి మీద ఉంది. సంఖ్యా పరంగా చూస్తే సుమారు 90 లక్షల విద్యార్థులకు విద్యనందించే ప్రక్రియలను పర్యవేక్షణతో సతమతమౌతున్న యుజిసి కి సమాంతర పరిశోధనా, పర్యవేక్షణా సంస్థల స్థాపన ఒక పెద్దసవాలు. వనరులు తగ్గిపోవడం ఒక సమస్య. డుప్లికేటింగ్, సమన్వయం మరికొన్ని సమస్యలు.

**యుజిసి ఎదుర్కొంటున్న ప్రధానాంశాల్లో మరికొన్ని సవాళ్ళు ఇవి:**

కొత్త యూనివర్సిటీలు కాలేజీలు పుట్టగొడుగులుగా వెలియకుండా ఒక చట్టం చేయాలి. కొన్ని రాష్ట్రాలు విచ్చలవిడిగా యూనివర్సిటీల స్థాపనకు చట్టపరంగా ఆమోదముద్ర వేయడంవల్ల, ఉన్నతవిద్యలో అపస్వరాలు తలెత్తాయి. విద్యను వ్యాపారీకరణ కాకుండా నిరోధించేందుకు యుజిసి నడుంబిగించాలి.

మనం బోధిస్తున్న సిలబస్‌లు పాతవి. సవాళ్ళుకొత్తవి. వీటిమధ్య అంతరం తగ్గించాలంటే బోధనాసిబ్బందికి ప్రతిసంవత్సరం పునః శిక్షణా తరగతులు హాజరవడానికి సంస్థాగత ఏర్పాటు చేయాలి. ఇప్పుడున్న ఎకడమిక్ స్టాఫ్ కాలేజీలకు కొత్త రూపం ఇచ్చి శిక్షణకు స్వచ్ఛందంగా వచ్చేట్టు చెయ్యాలి. కోర్సులను ప్రతి రెండు సంవత్సరాలకు మార్చాలి. యుజిసి ఈ విషయంలో ఒక కార్యాచరణ ప్రణాళిక తయారుచేసి సిద్ధంగా ఉంచాలి. బోధనా సిబ్బందికి ప్రత్యేక సదుపాయాలు కల్పించాలి. జీతాల వరకే యుజిసి నిర్ణయిస్తుందని భావించరాదు. ప్రమాణాల నిర్ధారణలో మనకు బోధనాసిబ్బంది సలహాలు అవసరం.

వ్యవస్థాపరంగా చూస్తే 1995 తర్వాత విశ్వవిద్యాలయాల విధాన మండళ్ళు పునర్వ్యవస్థీకరించాలి. అన్నిట్లో బోధనా సిబ్బందిని కలుపుకోవాలి. విధానపర సంబంధమైన ఎకడమిక్ కౌన్సిల్ వంటివి తప్పనిసరిగా సంవత్సరానికి రెండు మూడుసార్లు సమావేశమై ఉన్నతవిద్యలో వస్తున్న మార్పులను గమనించి విశ్వవిద్యాలయాల పునరుజ్జీవనానికి నాంది వలకాలి. సాధ్యమైనంతవరకు ప్రభుత్వపర సిబ్బంది జోక్యం తగ్గించి బోధనా సిబ్బంది భుజస్కందాలపై బాధ్యతలను మోపాలి.

యుజిసి దేశ ఉన్నతవిద్యకు ఒక ట్రస్టీగా భావించుకొని గ్రాంట్లు ఇచ్చే మరో ప్రభుత్వ సంస్థగా పరిగణించకూడదు. అంతర్జాతీయంగాను, అంతర్గతంగా కూడా దేశం ఎదుర్కొంటున్న సవాళ్ళను ఎదుర్కొవాలంటే యుజిసి మార్గదర్శకంగా ఉండాలి కాని రూల్స్, రెగ్యులేషన్లను వల్లించే ప్రభుత్వ ఆఫీస్‌లాగ ఉండకూడదు.



# దళితులు-విద్య

- ఎం. రామాంజనేయులు

**అంటరాని వాడిగా అవతరించబడి అక్షరానికి ఆమడ దూరంగా అగ్రవర్ణాల ఆధిపత్యంలో అందరిలో కలిసి ఆడుకోవడానికి అనర్హుడనే ముద్ర వేయించుకొని, ఆరు బయట అందరికి దూరంగా ఉంచబడినవాడు దళితుడు. నేను బడికి వెళుతుంటే అమ్మ కళ్లల్లో ఆనంద బాష్పాలు చూడాలనే తపన తాపత్రయం మాత్రం నిండుగా ఉంటాయి. కాని కార్యరూపం దాల్చేలోపు కాలమే వానిని శాసించగలుగుతుంది. అడుగడుగునా అవమానాలు, బడిమెట్లు ఎక్కవద్దని బల్లగుద్ది చెప్పి చెప్పుల ప్రక్కన చోటిస్తే ఉత్తమ విద్యార్థులు సైతం చదువును సక్రమంగా సాగించలేక సతమతమౌతున్నారు. కారణం కడుపు తిప్పలు.**

కూలికెళితే గాని పూట గడువని దుస్థితి. పైచదువులకెళ్ళిన విద్యార్థులు ఆర్థికంతో తంటాలు పడుతున్నారు. పార్ట్‌టైమ్ ఉద్యోగాలతో ఊపిరాడక ఉక్కిరిబిక్కిరవుతున్నారు. చదువు,ఉద్యోగం, ఊపిరిపోసిన తల్లితండ్రుల పరిస్థితి ఎలా వుందోనన్న సందేహం. మా పరిస్థితి బాగోలేదురా అన్న సంకేతాలు ఊరి నుండి ఊడిపడగానే ఒక్కసారిగా ఉలిక్కి పడ్డ గుండె తట్టుకోలేక చదువును పక్కకి నెట్టి చేదోడు వాదోడుగా వారికి సాయం.

స్వాతంత్ర్యం వచ్చి 58 సంవత్సరాలు గడుస్తున్నా విద్య దళితుల దరికి చేరడం లేదు.

ప్రభుత్వాలు ఉన్నత చదువులను ప్రైవేటు పరం చేస్తున్న ఫలితంగా దళితులు ఫీజులు చెల్లించలేక చెదిరిపోతున్నారు. ఇలాంటి విపత్కర పరిస్థితులలో అక్షరాలను అందుకోలేక పోతున్నారు. అర్హులైన దళిత విద్యార్థులు లేక ఇంజనీరింగ్, బి.ఇడి, సాంఘిక సంక్షేమ గురుకులాల్లో సీట్లు ఖాళీగా ఉంటున్నాయి. విద్యకు తగిన ప్రాధాన్యతనివ్వని కారణంగా వయోజన విద్యలో 28 రాష్ట్రాల్లో 22 వ స్థానానికి ఆంధ్రప్రదేశ్ దిగజారిపోయింది. యూనివర్సియల్ డిక్లరేషన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్ విద్య మానవుని సగౌరవ జీవన హక్కుగా ప్రకటించింది. విద్య హక్కు అందులోనూ దళితుల విద్య చాలా ఆటంకాలకు గురౌతోంది.

దళిత, ఆదివాసి, బలహీన వర్గాలకు చెందిన విద్యార్థులకు విద్య, వసతులు అందించాలనే లక్ష్యంతో పని చేయాల్సిన హాస్టల్స్ అందుకు భిన్నంగా పనిచేస్తున్నాయి. సాంఘిక సంక్షేమ శాఖల్లో మెరుగైన సౌకర్యాలు అమలయ్యేలా ప్రభుత్వ నిధులు సద్వినియోగం అయ్యేలా తనిఖీలు నిర్వహించే నిబంధన కలిగిన స్టాండింగ్ కమిటీల సిఫారసులు సైతం బుట్టదాఖలు అవుతున్న పరిస్థితి నేడు కనిపిస్తుంది. మాసిన మొఖాలు, చెదిరిన దుస్తులు, నూనెలేని కురులు, నిత్యం వ్యాధులతో పోరాడు తుంటారు. ఇదీ సాంఘిక సంక్షేమ హాస్టర్ విద్యార్థుల స్థితి. ప్రధానంగా దేశంలోని దళితులు విద్య తమ ప్రధాన జీవన హక్కుగా భావించి పరిరక్షించునేందుకు పాటు పడాల్సిన పరిస్థితి నెలకొంది. దళితులు విద్యహక్కును గుర్తించి తాము, తమ పిల్లలు, ముందు తరాలు విద్యా సుగంధాలతో వెల్లివిరిసినప్పుడే అంబేద్కర్ ఆకాంక్షించిన నమసమాజం ఏర్పడుతుంది. దళితులు విద్యాహక్కుని సొంతం చేసుకోవాలి. తరతరాలుగా యుగయుగాలుగా అక్షరాల కోసం కన్న కలల్ని కాటికి పంపకుండా సార్థకం చేసుకోవాలి.

భారతదేశ చరిత్రలో విద్యలో ప్రజాస్వామ్యం కాని, ప్రజాస్వామ్య వ్యవస్థలో విద్యగాని సంపూర్ణంగా ఎన్నడూ లేదు. సాధించే ప్రయత్నంలో పరుగుతీస్తున్నాము. ప్రపంచంలో కొందరు చదువుకోకూడదని, అక్షర జ్ఞానం కూడా వద్దని రాక్షసంగా రాసిన దేశాల్లో భారతదేశం ఒకటి. క్రిస్టియన్ మిషినరీల మూలంగానే పేదవారికి విద్య, అట్టడుగు వర్గాలవారికి అక్షర జ్ఞానం అందడం మొదలైంది. మద్రాసులో ముస్లింలు ఈ ప్రయత్నం చేసినా పై చేయి మాత్రం క్రిస్టియన్లదే.

గాంధీ బేసిక్ విద్యను ప్రతిపాదించారు. ఇందులో కొంత వృత్తి విద్యకు సంబంధించిన విద్య వుంది. ప్రపంచాన్ని అర్థం చేసుకోగలిగే తాత్విక భావనను చెప్పలేదని కృష్ణకుమార్ విమర్శించారు. తనపని తాను చేసుకోవాలి, కొన్ని నైపుణ్యాలు నేర్చుకోవాలి, ఉత్పత్తిలో నేరుగా పాల్గొనాలి. శ్రమను గౌరవించాలి, అనేవి గాంధీగారి బేసిక్ విద్యలో విలువైనవి.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సంపూర్ణ అక్షరాస్యత ఎంతకాలంలో సాధిస్తాం అనే చర్చ రచ్చకెక్కింది. ఆ సందర్భంలో ఓ సభ్యుడు 40 ఏళ్ల తరువాత సాదించుకుందామంటే భారత ప్రజలు ఈ సుదీర్ఘకాలాన్ని సహించరని చాలామంది వ్యతిరేకించారు. 10 సంవత్సరాలలో "అందరికి విద్య" అని తీర్మానించారు. అనగా 1960 వరకు సంపూర్ణ విద్య సాధిస్తామని రాజ్యాంగంలో రాశారు. 1964 వరకు అలాగే నెట్టుకు రావడంతో దేశంలోని అట్టడుగు వర్గాల ప్రజల ఆకాంక్షకు స్పందన లేకపోవడంతో బిన్న రూపాల్లో అసంతృప్తి వ్యక్తమయింది.

మా జీవితం ఏమిటి? అన్న ప్రశ్న మొదటి సారిగా ఉత్పన్నమైంది. ఒరిస్సాలో ఫుడ్‌రైట్స్ ఉద్యమం, బెంగాల్‌లో నక్సల్బరీ తదితర ఉద్యమాల రూపంలో సమాజం స్పందించింది. అప్పుడు కొఠారి

విద్యా కమిషన్‌ను నియమించారు.

ప్రస్తుతం రాష్ట్రంలో (2004-05) 1625 బాలుర హాస్టళ్ళు, 585 బాలికల హాస్టళ్లున్నాయి. ఇందులో 2.50 లక్షలమంది ఉండగా వీరిలో దళితులు 1.75 లక్షల మంది మాత్రమే. ఇందులో చదివే వారికి 1999లో 7వ తరగతి వారికి నెలకు రు.270. 10వ తరగతి వారికి రు.330గా నిర్ణయించారు. కాలక్రమేణా మారుతున్న పరిస్థితులు, పెరుగుతున్న రేట్లు ప్రభుత్వం పరిగణలోనికి రాలేదంటే ఎంత ఘోరం! హాస్టల్లో చదువుతున్న బాలురకు నెలకు రు.20 బాలికలకు రు.25 పనికిరాని వస్తువులు కొన్నా పదిహేను రోజులు రావు.

నేడు పల్లెలలోని దళితులు విద్య లేక దేశ, రాష్ట్ర ఆర్థిక నిర్మాణంలో పాల్గొనలేక పోతున్నారు. కారణం ప్రాథమిక స్థాయి విద్య కూడా ప్రైవేటు పరం కావడం. వేలమందిలో దళితుల్లో ఒక్కరు అందలమెక్కి ఆఫీసరయితే వారిని గూర్చి ప్రచారం చేస్తే అందరికి విద్య రాదని గమనించాలి. కేవలం విద్య వలన మాత్రమే దళిత జాతి ప్రగతి సాధించగలుగుతుంది. అయితే ఇటీవల ఢిల్లీ హైకోర్టు ప్రైవేట్ స్కూళ్ళల్లో సైతం 20% సీట్లు పేదవారికి ఉచితంగా ఇవ్వాలని తీర్పునిచ్చింది. ఎడ్యుకేషన్ బిల్లు 2005 లో కూడా ఈ ప్రతిపాదన చేయబడింది. అయితే ఈ 20% సీట్లు ఏ పేదలకు ఇస్తారనే సంశయం వుంది. ఎక్కడ చూసినా కార్పొరేటు సంస్థలు, ప్రైవేట్ పరమైన విద్యా సంస్థలు నెలకొన్నాయి.

*(దళితుల వివరాలు లక్షల్లో)*

| క్ర. | వివరం | 1961 | 1971 | 1981 | 1991 | 2001 |
|---|---|---|---|---|---|---|
| 1 | జనాభా | 49.73 | 57.74 | 79.61 | 105.92 | 123.40 |
| 2 | మగవారు | 25.12 | 29.27 | 40.39 | 53.80 | 62.28 |
| 3 | ఆడవారు | 24.61 | 28.47 | 39.22 | 53.80 | 62.28 |
| 4 | చదువుకున్న ఆడవాళ్ళు | 3.37 | 4.65 | 10.02 | 18.12 | - |
| 5 | శాతం % మగవారు | 13.43 | 15.90 | 24.80 | 34.49 | - |
| 6 | చదువుకున్న స్త్రీలు | 0.84 | 1.50 | 4.02 | 8.92 | - |
| 7 | % శాతం | 3.04 | 5.30 | 10.25 | 17.12 | - |
| 8 | మొత్తం శాతం % | 8.47 | 10.65 | 17.65 | 31.58 | 40.00(అంచనా) |

పై గణాంకాలు తెలియజేస్తున్నదేమిటి? జనాభారీత్యా దళితుల జనాభా 16.16 శాతం వుంది. గణనీయ సంఖ్య కలిగిన వీరికి సమాజంలో తగు స్థానం లభించే విధంగా విద్యనందించడంలో ప్రభుత్వాలు కృషి చేయాలి.

కోట్లాది మంది దళితుల సమస్యలను పరిశీలించి, పరిష్కారాన్ని సూచించే అధికారం, బాధ్యత ఐ.రా.స. కు ఉందని 1947 జనవరి 17వ, తేదీన అంబేద్కర్ ప్రకటించారు. ఐక్యరాజ్య సమితి అధికార సదస్సులో ప్రపంచంలోని ముఖ్యంగా దక్షిణాసియా దళితుల పక్షాన జీతీయ దళిత, మానవ హక్కుల ప్రచారోద్యమ నాయకులు పాల్‌దివాకర్‌కు ప్రసంగించే అవకాశం వచ్చింది. అంతర్జాతీయంగా వచ్చిన మద్దతు మూలంగా నిరంతరంగా ఐ.రా.స వేదికల మీద ఈ చర్చ వచ్చింది. 2004లో 100 మంది అంతర్జాతీయ సంస్థల ప్రతినిధులు ఐ.రా.స కు తమ విజ్ఞాపనలు యిచ్చి ఖాట్మండు డిక్లరేషన్‌లో తీర్మానాలు చేయించారు. మార్చిలో జరిగే కమిషన్‌లో కూడా ఈ తీర్మానాలు కచ్చితంగా అమలయ్యేట్లు చూడాలని నిర్ణయించారు. ఏప్రిల్ 19, 2005లో సమావేశమైన ఐ.రా.స. మానవ హక్కుల కమిషన్ ఈ సమస్య తీవ్రతను అంగీకరించింది.

ఈ కమిటి సభ్యులు ప్రతి సంవత్సరం అన్ని దేశాల్లో పర్యటించి ఆయా తెగల, కులాల ప్రజల స్థితిగతులను, ఇప్పటికే అమలులో వున్న చట్టపరమైన రక్షణలను, వాటి అమలును, రక్షణ ఏర్పాట్లు లేనట్లైతే ఎటువంటివి రూపొందించాలనే విషయాలను పరిశీలిస్తారు. 1970 దశకానికి ముందు మహిళల అభివృద్ధికి సంక్షేమానికి ప్రత్యేకమైన శ్రద్ధ లేదు. అదే సంవత్సరం బీజింగ్‌లో జరిగిన అంతర్జాతీయ మహిళా సదస్సు అనంతరం ఐ.రా.స. ఈ విషయంపై దృష్టి సారించింది. మనదేశంలో అమలు జరుగుతున్న బాలల కార్య క్రమాలు, బాలకార్మిక నిర్మూలన చట్టాలు ఇవన్ని ఐక్యరాజ్యసమితి పుణ్యమే. భారతదేశం తప్పనిసరి పరిస్థితుల లోనైనా ఐ.రా.స విధానా లను, సలహాలను పాటించక తప్పదు. అయితే దళిత సంఘాలు ఈ అవకాశాన్ని సక్రమంగా విని యోగించుకోవాలి.

సమాజంలో ఎక్కువ అణచివేతకు, దోపిడీకి గురైన వారి సమస్యలే ప్రథమ ఎజెండాగా ఉండాలి. భారతదేశ రాజకీయ ఉద్యమాల చరిత్రలో దళితులకు సంబంధించి నంతవరకు విషాదకరమైన విషయాలే కనిపిస్తున్నాయి. ఒక్క అంబేద్కర్‌ను మినహాయిస్తే, ఏ సామాజిక, రాజకీయ ఉద్యమంలో కూడా దళి తులకు సంబంధించిన సమస్యలు ప్రథమ ఎజెండాగా లేవు. ఇప్పుడున్న పరిస్థితిలో వ్యవసాయ రంగంలో ఒక భయంకరమైన సంక్షోభం వస్తే తప్ప భూమి దళితుల దరికి చేరదు.

భూమి దళితుల సమస్యగా ఉంది గనుకే భూ పోరాట ఉద్యమాలు 50,70 దశకాల జరిగిన తీవ్రమైన ఉద్యమాలలాగా రూపు దాల్చడం లేదు. భూ సమస్య ఇంత తీవ్రంగా వుంది గనుకే దీర్ఘకాలిక ఎజెండాగా ఉండిపోయింది. మరి విద్య కూడా భూ

సమస్యలాంటిదేనా? ఇలా దీర్ఘకాలిక ఎజెండాగా వుంచబడటంలో ప్రభుత్వాల వైఫల్యంతో పాటు, ఇక్కడి రాజకీయ ఉద్యమాలు, కార్మిక సంఘాల పాత్ర ఎంత?

అసలు దళితుల విద్య సమస్యను ఎలా అర్థం చేసుకోవాలి? వివిధ దేశాల అనుభవం ఎలా ఉంది? ఈ సమస్యను గుర్తించడంలో ఎక్కడ గండి పడింది? ఇలాంటి ప్రశ్నలు సహజంగానే ముసురుకుంటాయి. ప్రాథమిక విద్య వ్యాప్తిలో వివిధ దేశాల అనుభవాలను పరిశీలించినప్పుడు యూరప్‌లో పారిశ్రామిక విప్లవానికి ముందే సాంస్కృతిక పునర్జీవ ఉద్యమాల కాలంలో బీజం పడింది. ముఖ్యంగా వామపక్ష రాజకీయ ఉద్యమాలలో విద్య అతిముఖ్యమైన సమస్యకాదు. వారి దృష్టిలో భూసమస్యే కీలకమైంది. ఈ సమస్య పరిష్కరించబడితేనే మిగతా అన్ని సమస్యలు పరిష్కరింపబడతాయనే వైఖరి వల్ల విద్య ఒక రాజకీయ ఎజెండాగా లేకుండపోయింది.

విద్యయొక్క అవసరాన్ని గూర్చి ప్రొఫెసర్ అమార్త్యసేన్ విశ్లేషిస్తూ విద్య వ్యక్తి సామర్థ్యాన్ని, సాధన, శక్తిని పెంచుతుందంటాడు. అణగారిన వర్గాలలో దోపిడీ,దౌర్జన్యం, పీడనలకు వ్యతిరేకంగా పోరాడే శక్తినిస్తుంది. ఇంతటి శక్తిని కలిగిన ఆయుధాన్ని దళితులకు అందించడంలో ఉద్యమాలు వైఫల్యం చెందాయనే చెప్పాల్సి వస్తుంది. ఉద్యమాల పోరులో స్వార్థం, స్వలాభం లాంటి వాటిని దూరంగా వుంచి, అంకిత భావంతో పోరాడిన నాడే సార్థకత చేకూరుతుంది. ఉన్నత విద్యకు అనుకూలంగా పని చేసే వర్గాల వల్ల అగ్రకులాలకే ప్రయోజనం చేకూరింది. రాజకీయంగా వారికి బలంవుంది కాబట్టి తమ ప్రయోజనాలను సాధించుకుంటారు. ఈ విధంగా అణగారిన వర్గాలకు సంబంధించిన ప్రాథమిక విద్యపట్ల ఇంత నిర్లక్ష్యం జరుగుతున్నా ఏ రకమైన రాజకీయ నిరసనలు వ్యక్తం కావడం లేదు. అందుకని దీనిని అతి ముఖ్యమైన రాజకీయ సమస్యగా చేయాల్సి వుంది. అదే సమయంలో రాజకీయ పార్టీలలో ప్రాథమిక విద్యను ఒక ఎజెండాగా చేసే ప్రయత్నం జరగాలి. ఈ విధంగా విద్యను ఒక రాజకీయ ఎజెండాగా చేయించడమే దళిత శక్తుల ముందున్న ప్రధాన కర్తవ్యం. □

(10వ పేజీ తరువాయి)

ఏ వ్యక్తయినా జీవితంలో స్థిరపడాలంటే కనీసం సెకండరీ విద్య గడించాలి. పాఠశాలలు అందుబాటులో లేక కొందరు, పేదరికం వలన పాఠశాల విద్య పూర్తిచేయలేని వారు కొందరు, ప్రభుత్వ అప్రజాస్వామిక విధానాల వలన కొందరు సెకండరీ విద్యను పొందలేకపోతున్నారు. మహిళ, మైనారిటీ, దళిత, గిరిజన, అంగ వికలురకు విద్య అందించడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని ఎన్నో కమిషన్లు సూచనలు చేశాయి.

సెకండరీ విద్య ఉన్నత విద్యకు పునాది లాంటిది. అంతేకాకుండా ఏ ఉపాధి పొందాలన్నా కనీస అర్హత 10వ తరగతిగా గుర్తించడం జరిగింది. సెకండరీ విద్యలో వృత్తి విద్యను బోధిస్తే స్వయం ఉపాధి పొంది వ్యవసాయ రంగంపై ఒత్తిడి తగ్గి కొంత మేరకు విద్యావంతులు స్వయం పోషకం అయి నిరుద్యోగం తగ్గేది.

సెకండరీ పాఠశాల విద్యార్థుల పాఠ్యాంశాలు గణితం, సైన్స్, సాంఘికం విద్యార్థుల స్థాయికి మించి ఉన్నాయి. మన రాష్ట్రంలో పదవతరగతి విద్యార్థులు పరీక్షలో 11 పేపర్లు రాయవలసి ఉంది. ఉపాధ్యాయులు లేక, సిలబస్ కాక, పరీక్షలు రాయడం గ్రామీణ పేద విద్యార్థులకు తలకు మించిన భారంగా మారి అధిక సంఖ్యలో 10వ తరగతిలో ఉత్తీర్ణులు కాలేకపోతున్నారు. 1వ తరగతిలో చేరిన ప్రతి వందమందిలో 25 మంది మాత్రమే 10వ తరగతి చేరుకుంటే 10వ తరగతి పరీక్షలో హాజరైనవారిలో 40% తప్పుతున్నారు. అంటే కేవలం 15 శాతమే 10వ తరగతిలో ఉత్తీర్ణులవుతున్నారు.

ఏదేశంలోనైనా, ఏవ్యవస్థలోనైనా ఆర్థిక వ్యవస్థ పునాది కనుగుణంగానే దాని ఉపరితల అంశాలైన విద్య, సాహిత్యం, రాజకీయాలు, కళలు తదితర మానవ సంబంధాలు ఏర్పడతాయనేది చారిత్రక వాస్తవం. ఏ వర్గం చేతిలో ఆర్థిక సంపద ఉంటుందో వారి చేతుల్లోనే రాజకీయాధికారం ఉంటుంది. వారి రాజకీయాలే ప్రజారాజకీయాలుగా, వారి భావాలే ప్రజాభావాలుగా, వారి విలువలే ప్రజా విలువలుగా సమాజంలో చలామణీ చేయడానికి విద్యను ఒక సాధనంగా మలచుకొంటారు. ఆర్థిక సంస్కరణల క్రమంలో సామాజిక, వ్యక్తి వికాసాలకు తోడ్పడవలసిన విద్య వ్యక్తిని, సమాజాన్ని ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణల వలన బహుళజాతి సంస్థలకు, మార్కెట్‌కు ఎరగా మార్చడం శోచనీయం.

ప్రజాస్వామ్య బద్ధంగా ప్రజలకొరకు పాలన కొనసాగిస్తామంటున్న పాలకులు ప్రయోజనాలు విస్మరించారు. ప్రజలు ప్రభుత్వాలను మార్చుతున్నారు కాని పాలకుల విధానాలను మార్చలేకపోతున్నారు. ఎన్నికల ముందు పాలకులు చేసిన వాగ్దానాలు గెలిచిన తర్వాత ఏమీ అమలు కావడంలేదు. ఈ క్రమంలో విద్య ఒక ప్రజాతంత్ర శక్తిగా మలచుకోవాల్సి ఉంది. సమాజంలోని సమస్యలను పరిష్కరించే ప్రజాతంత్ర శక్తిగా విద్యను రూపొందించుకోవాలంటే ప్రజాస్వామిక వాదులు విద్యను ప్రజాస్వామికీకరించడానికి, విద్య ద్వారా హేతుబద్ధతను పెంచడానికి, లౌకిక భావనను కల్పించడానికి, విద్యలో సమాన అవకాశాలు కల్పించడానికి డా॥ కోఠారి సూచించిన కామన్‌స్కూల్ విధానాన్ని అమలు పరిచేలా, మాతృభాషలో విద్యాబోధన జరిగేలా, విద్యను సామాజికాంశంగా గుర్తించి అధిక నిధులు కేటాయించేలా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై ఒత్తిడి తీసుకరావల్సిన ఆవశ్యకతను కర్తవ్యంగా గుర్తించాలి. □

# ఆంధ్రప్రదేశ్ విద్యారంగం: కొన్ని గణాంకాలు

## స్కూళ్ల సంఖ్య

| 1956 | 2003 |
|---|---|
| ప్రైమరీ స్కూళ్ళు - 29,000 | ప్రీ ప్రైమరీ స్కూళ్ళు - 25 |
| మిడిల్ స్కూళ్ళు - 273 | ప్రైమరీ స్కూళ్ళు - 582,49 |
| హై స్కూళ్ళు - 732 | అప్పర్ ప్రైమరీ స్కూళ్ళు - 14,472 |
| | హై స్కూళ్ళు - 11,464 |
| | హైయ్యర్ సెకండరీ స్కూళ్ళు - 73 |
| | స్పెషల్ స్కూళ్ళు - 80 |
| | ఓరియంటల్ స్కూళ్ళు - 163 |

## కళాశాలల సంఖ్య

- ఇంటర్మీడియట్ కళాశాలలు - 3283
- డిగ్రీ కళాశాలలు - 1080

| | ఇంజనీరింగ్ | మెడిసిన్ | బియిడి | ఎంబిఎ | ఎంసిఎ | పాలిటెక్నిక్ | బిఫార్మసి |
|---|---|---|---|---|---|---|---|
| కళాశాలలు | 236 | 30 | 304 | 217 | 313 | 101 | 55 |
| సీట్లు | 82970 | 3825 | 34,076 | 13525 | 17225 | 36487 | 3250 |

## దక్షిణాది రాష్ట్రాలలో మన స్థానం

| రాష్ట్రం | వార్షిక బడ్జెట్ (రు.కోట్లు) | విద్యారంగానికి కేటాయింపులు (రు.కోట్లు) | బడ్జెట్‌లో శాతం | అక్షరాస్యత |
|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 28157 | 4523 | 16.06 | 61.1 |
| కర్ణాటక | 21404 | 3861 | 18.04 | 67.0 |
| కేరళ | 13893 | 2976 | 21.42 | 90.9 |
| తమిళనాడు | 26862 | 5072 | 18.88 | 73.5 |

# విదేశీ ఉప్పు వద్దన్న దేశంలో విదేశీ విద్యా సంస్థలను అనుమతిస్తారా?

- ఎం. కోదండరామ్

**1995లో ఏర్పడిన ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాలలో ఒకటైన సర్వీసుల ఒప్పందం, జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ ఇన్ సర్వీసెస్ (గాట్స్) అమలులోకి రానుండటంతో ఆ ఒప్పందం విద్యా వ్యవస్థ పైన ఎటువంటి ప్రభావం చూపుతుందోనని విద్యా వేత్తలు ఆందోళన చెందుతున్నారు. అసలు వాణిజ్య సంస్థ ఒప్పందాల గురించి మనకింత వరకు పూర్తిగా అవగాహన ఏర్పడలేదు. అమలులోకి వచ్చే క్రమంలోనే ఆయా ఒప్పందాల స్వభావం వెలుగులోకి వస్తున్నది.**

ప్రపంచ వాణిజ్య సంస్థ ఏర్పడక ముందు గాట్స్ వంటి ఒప్పందాలు లేనేలేవు. అప్పటికి అంతర్జాతీయ రంగంలో సరుకులు వ్యాపారం మాత్రమే సాగుతుండేది. కాబట్టి వచ్చిన ఒప్పందాలన్నీ సరుకుల వ్యాపారాన్ని నియంత్రించడానికే రూపొందాయి. అమెరికా, కెనడా, యూరప్, జపాన్ దేశాలు సేవా రంగంలో గణనీయంగా వ్యాపారావకాశాలున్నాయన్న విషయాన్ని గుర్తించి, ఆ రంగంలోనూ స్వేచ్ఛా వ్యాపారాన్ని పెంపొందించే లక్ష్యంతో గాట్స్ ఒప్పందాన్ని ప్రతిపాదించాయి. ఆ దేశాల ఒత్తిడి ఫలితంగానే చివరకు సేవా రంగంలో స్వేచ్ఛా వ్యాపారాన్ని విస్తృత పరచడానికే గాట్స్ ఉనికిలోకి వచ్చింది. ప్రభుత్వం తన అధికార నిర్వహణలో భాగంగా, లాభాపేక్ష లేకుండా నిర్వహించే సేవలు తప్ప మిగతా సేవలన్నీ గాట్స్ పరిధిలోకి వస్తాయి. అటువంటి 161 సేవలను 12 రకాలుగా వర్గీకరించి గాట్స్ ఒప్పందంలో చేర్చారు. చాలా దేశాల్లో ప్రభుత్వాలే విద్యను అందించే బాధ్యతను స్వీకరించాయి. కాబట్టి విద్య గాట్స్ పరిధిలోకి రాదేమోనని కొందరు అంటున్నారు. ప్రభుత్వం విద్యా రంగంలో పాల్గొన్నంత మాత్రాన అది గాట్స్ పరిధినుండి మినహాయింపు పొందదు. ఎందుకంటే గాట్స్ నుండి మినహాయింపును పొందాలంటే మూడు లక్షణాలు కలిగి వుండాలి. అది (1) ప్రభుత్వం అందించే సేవ అయి వుండాలి. (2) వ్యాపార దృక్పథంతో నిర్వహించే సేవ కాకూడదు. (3) పోటీ లేని రంగమై వుండాలి. భారతదేశంతో సహా చాలా మూడో ప్రపంచ దేశాల్లో ప్రభుత్వాలు విద్యాలయాలను నిర్వహిస్తున్నాయి. కానీ ఈ దేశాల్లో ప్రభుత్వంతోపాటు ప్రైవేటు సంస్థలు కూడా విద్యాలయాలను నడుపుతున్నాయి. ప్రపంచీకరణ మొదలైన తరువాత ప్రైవేటు సంస్థలన్నీ విద్యను ఒక వ్యాపారంగానే చూస్తున్నాయి. విద్యా రంగంలో వ్యాపార ధోరణులు, పోటీ తత్వం రెండూ ప్రబలి పోయాయి. కాబట్టి గాట్స్ పరిధి నుండి విద్యను మినహాయించలేమని నిపుణులు అంటున్నారు.

గాట్స్ ఒప్పందం ప్రకారం సేవారంగంలో నాలుగు రకాలుగా లావాదేవీలు చేసుకోవచ్చు. ఇవి కొత్తవేమీ కాదు. ఇప్పటికే అమలులో ఉన్న పద్ధతులను గాట్స్ గుర్తించింది. తమ దేశంలోనే ఉంటూ సరిహద్దుల ఆవల నున్న వారికి సేవలను అమ్ముకోవడం మొదటి పద్ధతి. కంప్యూటర్, కమ్యూనికేషన్స్ పరిజ్ఞానం పెంపొందిన తరువాతే ఈ రకమైన సీమాంతర వ్యాపారానికి అవకాశాలు బాగా పెరిగాయి. విద్యా విషయానికొస్తే ఈ పద్ధతిలో దూరవిద్యా కేంద్రాలు ఇంటర్నెట్ ద్వారా దేశదేశాల విద్యార్థులకు ఇప్పటికే కోర్సులను అందజేస్తున్నారు.

ఇక రెండవ రకమైన పద్ధతిలో సేవలను పొంద దలచుకున్న వారు, ఒక దేశ విద్యార్థులు ఇంకొక దేశానికి వెళ్ళి అక్కడ చదువుకున్నట్టే, తమ దేశాన్ని వదిలి ఇంకొక దేశానికి వెళ్తారు. ఇక మూడవ రకమైన పద్ధతిలో ఒక సంస్థ. ఇంకొక దేశంలో సంస్థలను ఏర్పరుస్తుంది లేదా అక్కడి సంస్థలతో ఒప్పందాన్ని కుదుర్చుకొని వాటి ద్వారా సేవలను అందజేస్తుంది. ఒక దేశ విద్యా సంస్థ ఇతర దేశాలలో బ్రాంచిలను ఏర్పాటు చేయటం కాని అక్కడి సంస్థలతో పొత్తు పెట్టుకొని కోర్సులను అందజేయడం కాని ఈ మధ్యనే బాగా పెరిగిపోయింది. ఇక నాల్గవ పద్ధతిలో సేవలను అందజేసే వారు తాత్కాలికంగా ఇతర దేశాలకు వెళ్తారు. ప్రొఫెసర్లు, రిసర్చి స్కాలర్లు ఇతర దేశాలకు వెళ్ళి బోధన, రిసర్చి చేసి వస్తారు కదా. ఆ రకమైన పద్ధతే ఇది. ఈ నాలుగు మార్గాల ద్వారా, పద్ధతుల ద్వారా సేవా రంగాల్లో వ్యాపారానికి అవకాశం ఉంటుందని గాట్స్ ఒప్పందం పేర్కొంటున్నది. ఇది విద్యారంగానికీ వర్తిస్తాయని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు.

సేవా రంగ వ్యాపారానికి సంబంధించి గాట్స్ ఒప్పందంలో రెండు రకాల నియమాలున్నాయి. మొదటి కోవకు చెందినవి తప్పనిసరిగా, విధిగా పాటించవలసిన సాధారణ నియమాలు. మోస్ట్ ఫేవరడ్ నేషన్ (అత్యంత ఇష్టపడే దేశమని అర్థం) సూత్రం. దీని ప్రకారం ప్రపంచ వాణిజ్య సంస్థలో సభ్యత్వమున్న ప్రతీ దేశం ఇతర దేశాలన్నింటిని సమానంగా చూడాలి. వాటి మధ్య తేడాను చూపరాదు. వివక్షను పాటించకూడదు. ఒక దేశానికి ఏ రకమైన

రాయతీలను, అవకాశాలను కల్పిస్తే మిగతా అన్ని సభ్య దేశాలకు అవే రాయతీలను అవకాశాలను కల్పించాలి.

ఇక రెండవది నేషనల్ ట్రీట్‌మెంట్ సూత్రం. దీని ప్రకారం సభ్య దేశాలు దేశీయ సంస్థలను విదేశీ సంస్థలను సమానంగా చూడాలి. ఇక మూడవ సూత్రం ప్రకారం సభ్య దేశాలన్ని గాట్స్ అమలులో తలెత్తే వివాదాల పరిష్కారానికి ఏర్పడిన అంతర్జాతీయ వివాద పరిష్కార వ్యవస్థ అధికారానికి కట్టుబడి ఉండాలి.

ఇవికాక ఒప్పందం ప్రకారం ప్రతి సభ్య దేశానికి ఏదేని సేవను గాట్స్ పరిధినుండి పూర్తిగా మినహాయించడానికి గాని, పరిమితులతో గాట్స్ పరిధిలోకి తేవడానికి గాని పూర్తి స్వేచ్ఛ ఉన్నది. ఈ నియమం ప్రకారం ప్రతి సభ్య దేశం హామీ పత్రాన్ని సమర్పించాలి. అందులో గాట్స్ పరిధిలోకి తేదలుచుకున్న సేవలను సూచించాలి. ఆ సేవల లావాదేవీలపై పరిమితులను విధించ దలచుకుంటే వాటిని పేర్కొనాలి. ఏ మేరకు విదేశీ సంస్థలను అనుమతించేది, ఏ పద్ధతిలో వ్యాపారం చేసుకోడానికి అవకాశం కల్పించేది స్పష్టంగా అందులో పేర్కొనాలి. ఈ హామీ పత్రంలో పేర్కొన్న నియమాలు కూడా సేవారంగ వ్యాపారానికి వర్తిస్తాయి. ఏ పరిమితులను సూచించకపోతే పూర్తి స్వేచ్ఛా వ్యాపారాన్ని ఆమోదించినట్టుగా పరిగణిస్తారు.

పై నియమం సభ్య దేశాలకు, గాట్స్ పరిధి నుండి సేవలను మినహాయించడానికి గాని సేవారంగ లావాదేవీలను పూర్తిగా నియంత్రించడానికి గాని పూర్తి స్వేచ్ఛను కల్పిస్తున్నదని చాలా మంది అనుకుంటున్నారు. నిజానికి గాట్స్ ఇచ్చిన స్వేచ్ఛకు చాలా పరిమితులున్నాయని అంతర్జాతీయ వాణిజ్యాన్ని, ప్రపంచ వాణిజ్య సంస్థను అధ్యయనం చేస్తున్న నిపుణులు అంటున్నారు.

గాట్స్ ఒప్పందం ప్రకారమే సేవారంగ వ్యాపారంపై అన్ని దేశాలు ఆంక్షలను సడలించి క్రమంగా స్వేచ్ఛా వ్యాపారాన్ని విస్తృత పరచాలి. ఈ నియమాన్ననుసరించి అన్ని రంగాలను క్రమంగా గాట్స్ పరిధిలోకి తేవాలి. ఒకవేళ ఏదైనా దేశం ఒప్పుకోక పోతే ఈ నియమాన్ని ఉపయోగించి ఆ దేశంపై ఇతర దేశాలు ఒత్తిడి తేవచ్చు.

ఇంకొక విషయమేమిటంటే గాట్స్ అమలుతో సేవారంగ వ్యాపారంపై అనివార్యంగా ఇతర దేశాలతో చర్చ జరుగుతుంది. ముఖ్యంగా హామీ పత్రంపై చర్చ జరిగే క్రమంలో ఒక దేశం ఒక నిర్దిష్ట రంగంలో వ్యాపారావకాశాలను పెంచుకోడానికి చేసే ప్రయత్నంలో భాగంగా ఇతర దేశాలకు వారు కోరిన రంగంలో స్వేచ్ఛను అనుమతించక తప్పదు. ఉదాహరణకు భారతదేశం కంప్యూటర్స్, కమ్యూనికేషన్ రంగాలలో అభివృద్ధి చెందిన దేశాలలో వ్యాపారావకాశాలను అడుగుతుందని అనుకుందాం. అప్పుడు అభివృద్ధి చెందిన దేశాలు అందుకు అంగీకరించి ప్రతిగా విద్యారంగంలో అవకాశాలను కోరవచ్చు.

ఈ చర్చ సమానుల మధ్య జరిగే చర్చ కాదని గమనించాలి. అంతర్జాతీయ రంగంలో అసమానతలున్నాయి. కొన్ని దేశాలు సైనిక పరంగానూ, ఆర్థిక పరంగానూ బలంగా ఉన్నాయి. కాగా మూడో ప్రపంచ దేశాలన్నీ రాజకీయంగానూ, ఆర్థికంగాను, బలహీనంగా ఉన్నాయి. మరి ఇటువంటి పరిస్థితిలో చర్చను బలమైన దేశాలే నియంత్రించగలవు. తమ లక్ష్యానికనుగుణంగా చర్చను నిర్దేశించ గలవు. ఇప్పటికే ప్రపంచ వాణిజ్య సంస్థలను అధ్యయనం చేసిన మూడో ప్రపంచ దేశాల మేధావులు ఆ సంస్థలో నిర్ణయాధికారం అభివృద్ధి చెందిన దేశాల చేతుల్లో కేంద్రీకృతమై ఉన్నది అంటున్నారు. తమ నిర్ణయాలను అభివృద్ధి చెందిన దేశాలు మూడో ప్రపంచ దేశాలపై రుద్దుతున్నాయని పరిశోధించి తేల్చారు. మరి ఇటువంటి సంస్థలో మూడో ప్రపంచ దేశాల ప్రయోజనాలకు రక్షణ లేదు.

గాట్స్ సూత్రరీత్యా దేశాలకు స్వేచ్ఛ కల్పిస్తున్నా ఆ స్వేచ్ఛకు ఆచరణలో అనేక పరిమితులున్నాయి. అమెరికా లాంటి దేశాలు ఇప్పటికే విద్యా రంగంలో, ప్రత్యేకించి వృత్తి విద్య, వృత్తి శిక్షణ వంటి విభాగాలలో స్వేచ్ఛా వ్యాపారాన్ని పెంపొందించాలని పట్టుబడుతున్నాయి. ఈ రంగంలో స్వేచ్ఛా వ్యాపారానికున్న అవరోధాలను తొలగించడానికి చర్యలు తీసుకోవాలని పట్టుబడుతున్నది. ఎందుకంటే విద్యా వ్యాపారంలో గణనీయమైన ఆదాయం ఉందని అమెరికా అనుకుంటున్నది. ఒక అంచనా ప్రకారం కేవలం ఆసియా, పసిఫిక్ ప్రాంతాలలోనే 37 బిలియన్ డాలర్ల విద్యా వ్యాపారానికి అవకాశం ఉన్నదట. ఇంత వ్యాపారాన్ని అమెరికా ఎలా వదులుకుంటుంది.

అయినా ఇప్పటి వరకు 143 దేశాలలో 40 దేశాలు మాత్రమే విద్యను గాట్స్ పరిధిలోకి తెచ్చాయి. ఎందుకంటే విద్యను గాట్స్ పరిధిలోకి తెస్తే దేశీయావసరాలకు కావలసిన విద్యను పెంపొందించే స్వేచ్ఛను కోల్పోతామని చాలా దేశాలు అనుమాన పడుతున్నాయి.

భారతదేశం ఇంకా ఒక విధానాన్ని రూపొందించుకోలేదు. విధానాల రూపకల్పనకు కేంద్ర ప్రభుత్వం సి.యన్.ఆర్.రావు నేతృత్వంలో ఒక కమిటీని నియమించగా రాష్ట్ర ప్రభుత్వం కె.సి.రెడ్డి అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. కమిటీలు ఇంకా నివేదికలను ఇవ్వలేదు. కాబట్టి విద్యా వేత్తలకు విధాన నిర్ణయాన్ని ప్రభావితం చేయగల అవకాశం ఉన్నది.

భారత దేశంలో గత దశాబ్ద కాలంలో విద్యా వ్యాపారీకరణకు లోనైంది. విద్యా రంగంలో ప్రైవేటు సంస్థల భాగస్వామ్యం కొత్త విషయమేమీ కాదు. స్వాతంత్ర్యోద్యమ కాలం నుండీ ప్రైవేటు

సంస్థలున్నాయి. కానీ 1980 దాకా ఉన్న ప్రైవేటు సంస్థలు విద్యను వ్యాపార దృష్టితో చూడలేదు. కేవలం విద్యా వ్యాప్తి చేసే ఉదాత్త లక్ష్యంతోనే విద్యా సంస్థలను ఏర్పాటు చేశాయి. 1980 దశకం చివరినుండి వ్యాపార సంస్థలు విద్యారంగంలోకి ప్రవేశించాయి. విద్యనూ ఒక వ్యాపారంగా మార్చి వేశాయి. సరళీకరణ విధానాలు ఈ వ్యాపారీకరణను ఎగదోశాయి.

ఒకవైపు ప్రభుత్వం ప్రపంచీకరణ ప్రభావంతో అప్పటికే ప్రాధమిక విద్యకు తప్ప మిగతా రంగాలలో కేటాయింపులను తగ్గించడానికి నిర్ణయించుకున్నది. ఉన్నత విద్యారంగం తన నిధులను తానే సమకూర్చుకోవాలన్నది. తత్ఫలితంగానే ప్రతీ ప్రభుత్వ, ఎయిడెడ్ కాలేజీ సెల్ఫ్ ఫైనాన్స్ కోర్సులను ప్రవేశపెట్టి ఫీజుల రూపంలో విద్యార్థుల నుండి వేల రూపాయలను వసూలు చేసి కాలేజీలను నిర్వహిస్తున్నాయి. మరో వైపు ఉన్నత విద్యారంగం అభివృద్ధికి ప్రైవేటు పెట్టుబడులకు పూర్తి అవకాశాలను కల్పించింది. ఫలితంగానే విద్యా రంగంలో వ్యాపార ధోరణి బాగా ప్రబలి పోయింది.

విద్య అమ్మకం సరుకుగా మారిన తరువాత దాన్ని అమ్ముకో గలగాలంటే విద్యార్థికి వ్యక్తి గత ప్రయోజనాన్ని చూపించాలి. ఏ ప్రయోజనమూ లేని కోర్సుల్లో వేల రూపాయల ఫీజు పెట్టి ఎదురు చదువుతారు? అందుకే అన్ని ప్రైవేటు సంస్థలు, సెల్ఫ్ ఫైనాన్సు కోర్సులను నడిపే కాలేజీలు వృత్తి విద్యాకోర్సులను ప్రవేశపెడుతున్నాయి. సాంప్రదాయకమైన మౌలిక సైద్ధాంతిక సబ్జెక్టుల వలన వెంటనే, ప్రయోజనం నెరవేరదు. వృత్తి విద్యాకోర్సుల్లో నైతే ఉద్యోగం వస్తుందన్న ఆశచూపి విద్యార్థులకు ఆకట్టుకోవచ్చు. కనుకనే వెంటనే ఉపాధి అవకాశాలు దొరికే కోర్సులను, అదీ సరైన శిక్షణా సదుపాయాలతో బోధిస్తున్నామని ప్రతి కాలేజీ ప్రకటనలు గుర్పించడం అందరికీ తెలిసిన విషయమే. ఫలితంగానే మౌలిక సైద్ధాంతిక కోర్సుల పట్ల ఆదరణ తగ్గింది. వృత్తి విద్యా కోర్సుల పట్ల మోజు పెరిగింది. బోధనా శైలి కూడా మారింది. వెంటనే మార్కులు, ఫలితాలు పొందగల చిట్కాలను చెప్పడం బోదనకు పరమార్థమైంది. ఈ మార్కెటు ఒత్తిడులకు లోనై సమాజానికి పనికొచ్చే జ్ఞానాన్ని పెంపొందించడమన్న లక్ష్యాన్ని అన్ని కాలేజీలు వదిలేశాయి.

ఈ విధంగా విద్య అమ్మకం సరుకుగా మారడంతో ఉద్యోగావకాశాలను బట్టి కోర్సు ఫీజులుంటున్నాయి. ఆ ధర పెట్టగలిగిన వారు చదువుకుంటున్నారు. లేని వారికి విద్య అందుబాటులో లేదు.

విద్య ఒక వ్యాపారంగా మారడంతో లాభాపేక్షతో ఎందరో పెట్టుబడి దారులు ఈ రంగానికి తరలివచ్చారు. పెట్టుబడి పెట్టారు. అందువలన ఎకాఎకిన కాలేజీల సంఖ్య పెరిగింది. డబ్బుతో జాగాలు కొనగలరు. అందమైన భవనాలు కట్టగలరు. మౌలిక శిక్షణకు కావలసిన పరికరాలను కొనగలరు. కానీ అధ్యాపకులను తయారు చేయలేరు కదా. ఎన్నో సంవత్సరాలు కృషి చేస్తే తప్ప అధ్యాపకులు రూపొందరు కాబట్టి ఏ కాలేజీలోనూ తగిన సిబ్బంది లేదు. ప్రభుత్వ, యూనివర్సిటీ కాలేజీలలో ఖాళీలను నింపడానికి ప్రభుత్వం అంగీకరించడం లేదు. ఉన్న వాటిలో కొందరు ప్రైవేటు కాలేజీలను వలస పోయారు. కనుక ఈ కాలేజీలోనూ బోధనా సిబ్బంది కొరత ఉన్నది. మరి ఈ ప్రమాణాల ఫలితంగా విద్యా ప్రమాణాలు పడిపోయాయి.

సరిగ్గా ఈ నేపథ్యంలో గాట్స్ అమలులోకి రానున్నది. సభ్య దేశాలన్నీ హామీ పత్రాలను సమర్పించ వలసి వున్నది. ఆ ఒత్తిడి వల్లనే విద్యను గాట్స్ పరిధిలోకి తేవాలా, వద్దా అనే విషయంపై చర్చ తలెత్తింది. సంపన్న, మధ్య తరగతి వర్గాలు విద్యను గాట్స్ పరిధిలోకి తేవాలనే అంటున్నాయి. వీరి అభిప్రాయంలో ఇప్పటికే విద్య ప్రైవేటీకరించబడింది. చాలా మంది విదేశాలకు వెళ్ళి చదువుకుంటున్నారు. అటువంటప్పుడు విదేశీ సంస్థలను అనుమతిస్తే తప్పేమీ లేదని అంటున్నారు. నాణ్యమైన విద్యను విదేశాలకన్నా తక్కువ ఖర్చుతో, భారత దేశంలోనే పొందవచ్చునన్నది వీరి అభిప్రాయం. ఈ వర్గాల ఒత్తిడికి ప్రభుత్వం తలవంచేటట్లున్నది. అయితే గాట్స్‌పైన నిర్ణయానికి వ్యక్తిగత ప్రయోజనం ప్రాతిపదిక కాకూడదు. దేశ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకోవాలి. ఆ కోణం నుండి చూసినప్పుడు గాట్స్ పరిధిలోకి విద్యను తేవడం వలన నష్టాలే ఉన్నాయనిపిస్తుంది. ఇప్పుడున్న పరిస్థితిలో దేశీయ విద్యా సంస్థలు విదేశీ సంస్థలతో పోటీ పడగల పరిస్థితిలో లేవు. కాబట్టి దేశీయ సంస్థలు దెబ్బతించాయి. తత్ఫలితంగా దేశీయావసరాలకు, దేశాభివృద్ధికి కావలసిన జ్ఞానం పెంపొందక పోగా, మనం ఇతర దేశాలపై ఆధారపడ వలసిన పరిస్థితి తలెత్తుతుంది. విద్యా వ్యవస్థపై అధికారం పొందిన దేశాలు క్రమంగా ప్రజల ఆలోచనలను ప్రభావితం చేసి మొత్తం సామాజిక - ఆర్థిక వ్యవస్థలపై పెత్తనాన్ని పొందడానికి కాలవసిన భూమికను తయారు చేసుకోగలవు. అన్నిటికన్నా మించి ఇప్పటి వరకు పెట్టిన పెట్టుబడి నిరర్థకం కాగలదు. కాబట్టి ప్రభుత్వం గాట్స్ ఒప్పందం కింద లభించిన స్వేచ్ఛను సృజనాత్మకంగా పెంపొందించుకోవాలి. దేశీయ విద్యా వ్యవస్థ గాట్స్ పరిధిలోకి రాకుండా చూడాలి.

ఒకే ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక అన్నారు. పెద్దలు మరి ఆ సిరా చుక్కనే ఆయుధంగా మలచి స్వాతంత్ర సముపార్జనకు ప్రజలను కదిలించిన భారత దేశంలో కలాన్నే తాకట్టుపెడతారా? ఉప్పు కొరకు ఇతర దేశాల మీద ఆధారపడటమేమిటన్న గాంధీజీ దేశంలో విద్యనే ఇతర దేశాలకు అప్పగించే ప్రయత్నం చేయటం శోచనీయం. ❑

# విద్యా రంగం : లక్ష్యా లక్ష్యాలు

- విద్యాభూషణ్

విస్తృత వైద్య రంగ ప్రయోజనాలకై మరోసారి జూనియర్ డాక్టర్ల సమ్మె అనివార్యమైయింది. పాలక వర్గాలు అనుసరిస్తున్న 'చలన రాహిత్యం' నిర్లక్ష్యధోరణి' అంటే మరోసారి జూనియర్ డాక్టర్లు సమ్మెకు దిగేందుకు దోహద పడ్డాయనేది వాస్తవం. గతంలో (సుమారు ఏడాదిన్నర క్రితం) సుమారు 45 రోజులు నిరవధిక సమ్మె, నిరసన దీక్షలతో నిర్వహించిన సమ్మెను అధికారం నిలవరించ గలిగింది. అనేక హామీలతో. ఈ తదనంతరపు ఏడా దిన్నర కాలం పాలక వర్గాలు భిన్న పార్టీలకు చెందినవైనా ఒకే లక్ష్యం దిశగా, ఒకే ధోరణితో వ్యవహరిస్తాయన్న వాస్తవాన్ని వ్యక్తం చేశాయి. పోనీ వీరి సమ్మె ఏమైనా ఆర్థిక భారాన్ని గురి చూస్తున్న కారణంగా పాలక వర్గాలు యిలా వ్యవహరిస్తున్నాయా అంటే పాపం డాక్టర్ల సమ్మెలో ఈ తరహా కనీసం తమ జీత భత్యాలను పెంచాలన్న డిమాండ్లు మచ్చుకైనా కానరావు. డిమాండ్లన్నీ వైద్యరంగ విస్తృత ప్రయోజనాలను కాపాడాలనీ, విద్య ప్రైవేటీకరణ వలన చోటుచేసుకోబోతున్న అలక్ష్యాలను నిలువరించాలన్నదే. ప్రైవేటు వైద్య కళాశాలలో విద్యార్థులకు కల్పిస్తున్న సౌకర్యాలు మృగ్యం అవుతున్న వైనాన్ని, అంతరిస్తున్న బోధనా ప్రమాణాలను మెరుగు పర్చి వైద్యవృత్తి పరువును మెరుగు పర్చాలన్నదే నేటి జూనియర్ డాక్టర్ల ప్రధాన లక్ష్యం. ప్రభుత్వాన్ని ప్రైవేటు వైద్య కళాశాలల యాజమాన్యాలు ఎలా ప్రలోభ పర్చి, ఆదర్శప్రాయం అవుతున్నాయో వీరు బహిరంగ పర్చారు గతంలో. భారత వైద్య విధానమండలి (ఎం.సి.ఐ) నిర్దేశించిన ప్రమాణాలను కాలరాసిన ప్రైవేటు కళాశాల లకు అనుమతులు మంజూరు చేయడంతోనే, ప్రభుత్వ బాధ్య తాయుత ప్రవర్తన వెల్లడయ్యింది. ప్రజారోగ్యం-వైద్యవిద్య ప్రమాణాల పట్ల బాధ్యతా రాహిత్యం తగదని ఈ జూనియర్ డాక్టర్ల సమ్మె హెచ్చరిస్తుంది. పేదలకు అన్నివేళలా అందుబాటులో వుండి వైద్య సహకారాన్ని అందించే పవిత్ర వైద్య లక్ష్యాన్ని ఈ జూనియర్ డాక్టర్ల సమ్మె డిమాండు చేస్తుంది. అన్ని రకాల అత్యవసర సేవలూ మెజార్టీ పేదలకు అందుబాటులోకి రావాలన్న ప్రజాస్వామ్యయుత డిమాండు ఈ జూనియర్ డాక్టర్ల సమ్మెలో యిమిడి ఉంది. ప్రాణదాన ప్రక్రియలో వ్యాపార లక్ష్యాలు తగవన్న హెచ్చరిక వీరి సమ్మెలో నినదిస్తుంది. యింతటి పవిత్ర లక్ష్యాలను అవగతం చేసుకోలేకనే ప్రభుత్వం నిర్దిష్ట-నిర్ణయం తీసుకోలేకుంటున్నదంటే అది మన తెలివి తక్కువ తనమే. ఈ ఉదాసీనతకు వారు చేపట్టిన సంస్కరణ విధానాల లక్ష్యాలే ప్రధాన కారకాలు అంటే పరోక్షంగా సంస్కరణా విధానాలు నిర్దేశిస్తున్న విద్యారంగ ప్రైవేటీకరణను ఈ జూనియర్ డాక్టర్లు నిలదీస్తున్నారన్న మాట. ఏ వామపక్ష విద్యార్థి సంఘాలు చేపట్టని నిర్దేశిత ప్రధాన లక్ష్యాన్ని మన ఈ జూనియర్ డాక్టర్లు చేపట్టారు. ఎవరి ఆధ్వర్యంలో ఈ సమ్మె చేపడుతున్నారన్న కుత్సిత కారణాలకు పోకుండా సర్వత్ర సంఘీభావాన్ని వెల్లడిం చాల్సిన న్యాయపరమైన సమ్మె యిది. ఎందుకంటే విద్యా లక్ష్యాలను - సంస్కరణలు ఏ అలక్ష్యాలకు నెలవయ్యేలా చేయనున్నావో అన్న పవిత్ర లక్ష్యాన్ని ప్రశ్నించే సమ్మె కనుక. సంస్కరణల అమలు ప్రయోగంలో నెలకొంటున్న అనైతిక విలువల విహారాన్ని నిలవేస్తున్న సమ్మె కనుక. ఈ సందర్భంగా అసలు విద్యా రంగ లక్ష్యాలు ఏంటో అవి ఎలా పెడదారి పడుతున్నాయన్న లోతులను మనం పరిశీలించాల్సి వుంది.

## విద్య-అర్థం-పరమార్థం

విద్యను సూటిగా సూక్ష్మంగా నిర్వచించాలంటే "మనిషి వ్యక్తి త్వపు సర్వతో ముఖాభివృద్ధికి దోహదపడేదే విద్య." అని తొలినాటి సోషలిస్టు విద్యా వ్యవస్థ నిర్మాతలు నిర్వచించారు. అయితే యిది తమ చుట్టూ వున్న ప్రాపంచిక జ్ఞానాన్ని శారీరక, మానసిక శక్తుల బహుముఖ ప్రమేయంతో ముడిపడాలనీ సుఎహోమ్లిన్స్కీ వంటి విద్యా వేత్తలు వ్యక్తం చేశారు. అక్కడ జ్ఞానం అంటే అనుభవాల సారాంశం అనే అర్థాన్ని అన్వయినస్తూ, ఈ చదువు (విద్యా అధ్యయనం) అశాస్త్రీయ భావాలను తమ అనుభవాలతో ఖండిస్తూ, చిన్నప్పటి నుంచే పిల్లల్లో అధ్యయనం పట్ల ఆసక్తిని పెంచేదిగా వుండాలనీ సుహోమ్లిన్స్కీ సూచించారు. అయితే, ఇందుకు ప్రధాన ప్రాతిపదిక ఆర్థిక వ్యవస్థ పునాదికి అనుగుణంగాక దాని ఉపరితలాలైన సమస్త కళలు, విద్య తదితర మానవ సంబంధాలు ఏర్పడతాయన్నది మరో చారిత్రక వాస్తవం. ఈ నియమం ప్రకారం ఏ వర్గం అధికారం కింద మొత్తం సమాజం రాజకీయంగా పరిపాలించ బడుతుందో ఆయా వర్గ ప్రయోజనాలకు అనుగుణంగానే భావజాలం, సాంస్కృతిక విలువలు రూపుదిద్దు కుంటాయి. ప్రస్తుత పాలకుల ధోరణికి యిది అద్దం పడుతుంది. సామాజిక ప్రయోజనంగా వుండాల్సిన విద్యా రంగాన్ని సంస్కరణ నేతలు, వ్యక్తి ప్రయోజన దిశగా, ఓ సంతలోని సరుకుగా మార్చేశారు. పైగా సంస్కరణలు సమాజ సర్వోత్తమ ప్రోత్సాహానికే అని కీర్తిస్తూనే!

## విద్య-చారిత్రక పరిశీలన

జ్ఞానం అంటే అనుభవాల సారాంశంగా చెప్పుకున్నట్టే సమాజ పరిణామక్రమంలో మానవజ్ఞానం వర్గ సమాజంతో ముడివేయబడి,

వర్గ ప్రయోజనాలకు నెలవయింది. ఆదిమ సమాజంలో స్వచ్ఛందం గా ప్రకృతి నియమాలను తెలుసుకో గలిగితే, బానిస సమాజంలో వర్గ విభజనకు అంకురార్పణ జరిగింది. ఉత్పత్తి సాధనాలపై పట్టు వున్న వర్గాలే విద్యా రంగాన్ని గుప్పెట్లో పెట్టుకోగలిగారు. ఈ క్రమమే ఫ్యూడల్ పెట్టుబడిదారీ వర్గాలు విద్యను ప్రజానీకానికి అందు బాటులోకి తీసుకు రాకుండా, తమకు అనుకూల వర్గాలకే పరిమితం చేస్తూ, తమ ప్రయోజనాలకే దోహదపడే మేధావి శ్రామిక వర్గాల ఏర్పాటుకు విద్యారంగాన్ని వినియోగించుకోవాలన్న లక్ష్యం రూపుదిద్దుకుంది. ప్రస్తుత ప్రజాస్వామ్య వ్యవస్థలో విద్యను సమాజపరంగా అన్వయించే ప్రక్రియకు ప్రధాన ప్రాతిపదిక ఈ నియమమే. ఎందుకంటే ప్రజాస్వామ్యం, మెజార్టీ ప్రజల ప్రయోజనాలను కోరుకుంటుందని చెప్పి, నిర్బంధ ప్రాథమిక విద్య అందరికీ చదువు, బాలకార్మిక రద్దు, అనియత విద్యా, వయోజన విద్య, మళ్ళీ బడికి పోదాంరా, మధ్యాహ్న భోజన పథకాలు వంటి అనేకానేక నినాదాలు, పథకాలు పురుడు పోసుకున్నా నిలువలేక పోయాయి. కారణం ఆచరణలో చిత్తశుద్ధి లేకపోవడమే. ప్రజా స్వామ్య స్థానే పెట్టుబడిదారీ వ్యవస్థకు పాదు పోస్తూ సంస్కరణల మార్కెట్-వ్యవస్థ విస్తృతికి దోహద పడుతున్న లక్ష్యం, ప్రజాస్వామిక లక్ష్యాన్ని అధిగమించేసింది. అందుకే 'అందరికీ చదువు' కొందరికే పరిమితమై పోనారంభించింది.

అసలు యిందుకు పునాది, భారతీయ విద్యా విధానంలో ఆర్యుల కాలంలోనే వేళ్ళూను కుందనే విషయం శతాబ్దాల చరిత్రను అధ్యయనం చేస్తే అవగత మౌతుంది. వైదిక యుగం లోనే విద్య అగ్రవర్ణాల పరమైంది. వర్ణాశ్రమ విద్య ఉన్నత వర్గాల హక్కుగా పరిగణించారు. తదనంతరపు బౌద్ధ, జైన మతాల హయాంలో కూడా విద్య శాఖోపశాఖలుగా విస్తరించినా, మతాధి పత్యానికి, పాలకవర్గ ప్రయోజనాలకే పరిమిత మయ్యాయన్న విషయం మరువరాదు.

ఈ క్రమం బ్రిటిష్ వలసవాదుల ప్రవేశంతో విద్యారంగం లక్ష్యంలో మార్పుకు అంకురార్పణ జరిగింది. వారు వారి లక్ష్యమైన వాణిజ్య వ్యాపార పాలనాసంబంధాల నిర్వహణకు దోహదపడే విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టాలని యోచించారు. పాలకుల లక్ష్యా లకు అనుగుణంగానే విద్యా లక్ష్యాలు వుంటాయి కదా మరి. చిన్న, చిన్న రాజ్యాలుగా వున్న సంస్థానాలను ఏకం చేసేసి, ఒకే పాలనా వ్యవస్థ కిందకు తీసుకు వచ్చారు. తదుపరి తమ వాణిజ్య ప్రయోజనాలను కాపాడుకునేందుకు అనుకూల ఉద్యోగ వర్గాన్ని రూపొందించుకోవాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. దీని ఫలితమే 1835లో రూపొంది, నేటికీ కొనసాగుతున్న 'మెకాలే' విద్యా విధానం. ఇది పాలకులకు, కోట్లాది జనానికి మధ్య 'దుబాసీలు'గా వ్యవహరించే విద్యా విధానం. ఇక్కడే దోపిడీ కొనసాగింపుకు అవసరమైన భావజాలాన్ని, సంస్కృతిని విద్య ద్వారా నియంత్రించే లక్ష్యానికి పునాది వేయడం జరిగింది. నాటి నుంచి కొనసాగుతున్న ఈ విద్యా విధానం స్వాతంత్ర్యం వచ్చి 58 ఏళ్ళు అయినా నిరాటంకంగా సాగుతూ వుంది. ఇందుకు కారణం. ఆర్థిక విధానంలో ఏ తరహా మార్పులు చోటుచేసుకోవని, సాధ్యమైనంత వరకూ స్వదేశీ విదేశీ పరిశ్రమలను జాతీయ చేయబోమని నాటి స్వాతంత్ర్య పోరాట నేతలు, బ్రిటిష్ పాలకులతో కుదుర్చుకున్న రహస్య ఒప్పంద ఫలితమే. అందుకు 1948 ఏప్రిల్ నాటి రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రస్తుతం అమల్లో వున్న చట్టంను మించి, దెబ్బ తినకుండా వుండేలాగ జాగ్రత్త వహించాలి. దానిని, ఇంకే మాత్రం నాశనం చేసే ధైర్యసాహసాలు నాకు లేవని" నెహ్రూ స్పష్టంగా ప్రకటించాడు. ఈ కారణంగానే నాటి లక్ష్యాలు నేటికీ నిరాటంకంగా కొనసాగుతూ వున్నాయి. అయినా భారతావనిలో చోటు చేసుకున్న వామపక్ష ఉద్యమాల ప్రభావ ఫలితంగా ఈ పాలక వర్గాలే తమ రాజ్యాంగ శీర్షికలో 'సోషలిస్టు' అన్న పదాన్ని చేర్చక తప్పలేదు. ఈ అంశాన్ని ఎందుకు ప్రస్తావిస్తున్నా నంటే, నాటి నుంచి నేటికీ ప్రజల్లో కొన సాగుతున్న వామపక్ష ప్రభావాన్ని ప్రస్తావించేందుకే. చారిత్రక పరిణామ క్రమం కూడా యిందుకు సైదోడుగా, ప్రోత్సాహకరంగానే వున్నదనిపిస్తుంది.

## విద్యారంగ నిర్వహణలో పాలకవర్గాల కుప్పి గంతులు

దేశ ఆర్థిక సామాజిక స్వరూప స్వభావాన్ని అంచనా వేయలేక, ఎరువు తెచ్చుకున్న పాలనా విధానంతో సామ్రాజ్యవాద బంటులుగా విద్యా విధానాన్ని కొనసాగించారన్నది తిరుగులేని వాస్తవం. 70 శాతం వరకూ ప్రజలు గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారై ప్రధానంగా వ్యవసాయరంగంపై ఆధారపడి వుండగా, సంప్రదాయ సేద్యాన్ని ప్రోత్సహించకుండా కార్పొరేట్ వ్యవసాయాన్ని ప్రోత్సహించే దిశగా పాలకుల కృషి జరుగుతూవుంది. యిందుకు 'సస్య' విప్లవాల పేరుతో నాంది పలకడం జరిగింది. భూపంపిణీకి చిత్తశుద్ధి నాడే కొరవడింది. ఇక గ్రామీణులు విద్యావంతులై చైతన్యాన్ని పొందకుండా విద్యను కొరవడేలా చేయడం యాదృచ్ఛికమైతే కాదు. పైగా పారిశ్రామికంగా దేశ అభివృద్ధికి ఈ పాలకులు పాటు పడింది లేదు. కేవలం కొన్ని కుటుంబాలు మాత్రమే దేశ పారిశ్రామిక రంగాన్ని నియంత్రిస్తున్నాయి. దేశ ఆర్థిక రాజకీయ రంగాలనూ వారే నియంత్రిస్తున్నారు. ఈ పరిస్థితి కొనసాగింపు కనువుగా పాలకులు ప్రణాళికాబద్ధ విధానాలను రూపొందించారు. అవి అభివృద్ధి పథకాలు, ప్రణాళికా వ్యూహాలు, శాస్త్ర సాంకేతిక రంగాల్లో విప్లవాత్మక మార్పులు వంటి ప్రకటనల మాటున. అదీనాడు సంస్కరణల వెల్లువతో సమగ్ర శాశ్వతాభివృద్ధిగా పరిణతి చెందింది. అనాదిగా పాలకుల లక్ష్యం సామ్రాజ్యవాదుల వూడిగమే నన్నది మనం గుర్తెరగాల్సి వుంది. వారసత్వపు హక్కుతో రాజ్యాధికారం .

చేపట్టిన రాజీవ్ నేతృత్వంలో 1987లో 'విద్య విసిరిన సవాళ్ళు-నూతన దృక్పథం' అన్న జాతీయ విద్యా విధాన డాక్యుమెంటును విడుదలచేయడం జరిగింది. యింతకు ముందుగానే విద్యా విధానాన్ని సంస్కరిస్తున్నామని చెప్పేందుకుగాను. డాక్టర్ రాధా కృష్ణన్ నాయకత్వాన యూనివర్సిటీ ఎడ్యుకేషన్ కమిషన్‌ను 1949లోనూ, మొదలియార్ నాయకత్వంలో సెకండరీ విద్యా కమిషన్‌ను 1953లోను, 1964లో కొఠారి కమీషన్‌ను, 1978లో ఈశ్వరీ రాయ్ పటేల్ కమిటీ, వృత్తి విద్యా కోర్సుల పరిశీలనకై మాల్కం ఆదిశేషయ్య నాయకత్వంలో కమిషన్‌ను నియమించారు. మొత్తం అన్ని కమిటీల నివేదికలు చెత్తబుట్ట పాలే. ఈ క్రమంలోనే నూతన విద్యా విధానం డాక్యుమెంటులో "మొత్తం సాంఘిక వ్యవస్థలో విద్య కూడా ఒక ఉప వ్యవస్థ తప్ప మరొకటి కాదు. కనుక మొత్తం పరిసరాలు విద్యను ప్రభావితం చేయడమే కాకుండా, దాని నిర్వహణలో కూడా వ్యవస్థ లక్షణాలు ప్రతిబింబిస్తూ వుంటాయని" సరిగ్గానే పేర్కొనడం జరిగింది. అవి ఏంటంటే :

1. ప్రాథమిక, మాధ్యమిక విద్యా వ్యాప్తికి అనియత విద్య విధానం పై ఆధారపడాలి. అంటే రెగ్యులర్ పాఠశాలలకు స్వస్తి పలికి రేడియో, దూరదర్శన్, వీడియో, అంగన్‌వాడీల పద్ధతులపై ఆధారపడాలని. ప్రస్తుతం జరుగుతున్న దదే.
2. సెకండరీ విద్యను పూర్తి చేసుకున్న వారిలో కనీసం 50 శాతం మందిని వృత్తి విద్యల్లోకి మరల్చాలని.
3. విజ్ఞాన సంపాదనాభివృద్ధి గలవారికే ఉన్నత విద్య ప్రవేశార్హత కల్పించడం.
4. ఉన్నత విద్యారంగ విస్తరణను ఆపుదల చేయడం.
5. కొన్ని పరిమితులకు లోబడి అయినా క్యాపిటేషన్ ఫీజు విద్యా సంస్థలకు అనుమతించడం. నాటి సూచన నేటికి వచ్చేసరికి 'పరిమితులను' పూర్తిగా తుడిచేసుకుంది.
6. కార్పోరేట్ విద్యా వ్యవస్థను కొనసాగనివ్వడం.
7. ప్రతిభావంతుల పేరిట ప్రత్యేక విద్యాలయాల ఏర్పాటు.
8. ఉద్యోగాలకు - డిగ్రీలకు మధ్య గల లింకులను రద్దు చేయడం.
9. విద్యార్థులను రాజకీయాలకు అతీతుల్ని చేయడం.
10. విద్యను ఉమ్మడి జాబితా నుండి, కేంద్రానికి మార్చే యత్నం.
11. మాతృభాషలో విద్యాబోధనను మరుగున పర్చడం.
12. శాస్త్రీయ దృక్పథానికి, ఆధ్యాత్మిక విలువలను అంటగట్టడం.

అయితే, యింతకు ముందే పేర్కొన్నట్టు పలు కమిషన్లలో ఏ ఒక్క కమిషన్ పై సూచనల్లో ఒక్కదాన్ని సూచించలేదు. ఆయా కమిటీలను ప్రజా ఒత్తిడికి లోనయి నియమించి, సూచనలను బుట్ట దాఖలు చేసి, ప్రభుత్వ లక్ష్యాలను పై సూచనల పేరిట ఈ నూతన విద్యా విధానంలో ప్రకటించడం జరిగింది.

❖ సెకండరీ విద్య పూర్తయ్యే వరకూ అన్ని తరగతుల వారికి ఒకే విధమైన బోధనా పాఠ్యాంశాలు వుండాలి. నిర్బంధ ఉచిత విద్యను అమలు పర్చాలన్న ప్రగతిశీల వాదుల డిమాండ్లకు భిన్నంగా అనియత విద్యా విధానం. ప్రచార మాధ్యమాల ద్వారా విద్యా వ్యాప్తి.

❖ వృత్తి విద్యా కోర్సులలో 50% చేరేందుకు ప్రోత్సహించా లనడం సరైందే... కానీ ఈ వృత్తి విద్యా కోర్సులను కేవలం పేదలకు పరిమితం చేసేస్తూ, సాధారణ విద్యను ఉన్నత వర్గాలకు అందించాలన్న కుట్ర ఈ సూచనలో అంతర్లీనంగా దాగి వుంది.

❖ విజ్ఞాన సంపాదనా అభిరుచి గలవారికే ఉన్నత విద్య ప్రవేశ అర్హతను కల్పించడం. ఈ ప్రతిపాదన సాదాసీదాగా వున్నా లోతుగా పరిశీలిస్తేనే దానిలో అంతరార్థం అవగతమౌతుంది. వ్యక్తి అభిరుచులు, ఆకాంక్షలు తను పుట్టి పెరిగిన సామాజిక-ఆర్థిక పరిస్థితులకు అతీతంగా వుండవు. కనుక దేశంలో అధిక శాతానికి చెందిన సాధారణ యువత ఈ ఉన్నత విద్యలకు అర్హులు కారని పరోక్షంగా చెప్పడమే ఈ సూచన లక్ష్యం.

❖ ఉన్నత విద్యారంగ విస్తరణను ఆపుదల చేయడం. యిందుకు డాక్యుమెంటు చెప్తున్న కారణం, ఉన్నత కళాశాల విద్య, స్నాతకోత్తర విద్య అపరిమితంగా విస్తరించి నందునే ప్రమాణాలు దిగజారి పోయాయని చెప్పడం జరిగింది. యిది పూర్తిగా ఆశాస్త్రీయ ధోరణి. వ్యవస్థ పురోభివృద్ధిని సహేతుకంగా అంచనా వేయగలిగిన నాడు, ఏ సంఖ్యలో ఉన్నత విద్యావంతులు అవసరం అవుతారో అంచనా వేయగలిగి అందుకు తగ్గ ప్రతిపాదనలను విద్యారంగంలో ప్రతిపాదించడం శాస్త్రీయ ధోరణి. ఈ శాస్త్రీయత పూర్తిగా లోపించిన ఫలితమే, ఈ అస్తవ్యస్త ప్రతిపాదనలు.

అలాగే ఉద్యోగాలకు డిగ్రీలకు మద్యగల లింకును రద్దు చేయడం యిందుకు ప్రభుత్వం చెప్తున్న కారణం ఏంటంటే, కనీసం గుమస్తా గిరికి కూడా డిగ్రీయే కనీస అర్హత అయినందున కళాశాల విద్యకు గిరాకీ పెరిగి పోతుందని, ఈ లింకును విడగొడితే రద్దీ నివారించ వచ్చని. గుమస్తా గిరీ ఎంపికలను ప్రవేశ పరీక్షల ద్వారా నిర్వహించాలని ఈ డాక్యుమెంటు చెప్తుంది. అంటే ఈ సామాన్య ప్రజలు గుమస్తా గిరీ జాబులకోసం కోచింగ్ సెంటర్లను ఆశ్రయించాలన్న మాట. ప్రజాధనంతో ఉన్నత విద్యను పొందిన ధనిక వర్గాలు ఈ ప్రవేశ పరీక్షల్లో పాల్గొని అవకాశాలను ఎగరేసుకు పోతారు. యిదో రకం కుట్ర. ఈ తరహా అంతు-పొంతు లేని విధి

విధానాలలో విద్యారంగం చిన్నాభిన్నం అయింది. యిందుకు ప్రధాన కారణం విద్యా వ్యవస్థ నిర్వహణకు అవసరమైన రాజకీయ లక్ష్యం కొరవడటమే తప్ప మరొక్కటి కాదు.

ఆధునిక శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధిని దేశ పారిశ్రామిక వ్యవసాయక రంగాలకు అన్వయించాలని చెప్తూ కాలం చెల్లిన సాంకేతిక విజ్ఞానాన్ని దిగుమతి చేసుకుంటున్నాయి మన పాలక వర్గాలు. వృత్తి విద్యా వ్యాప్తికి కృషి చేస్తున్నా మంటూనే ఉత్పాదక కృషితో విద్యా రంగాన్ని జతచేయాలనడం మరో వింత. వృత్తి విద్యా వ్యాప్తికి కీలకమైన దేశీయ మార్కెట్‌ను విదేశాలకు అప్పగించేస్తుంటే యింకెక్కడి వృత్తి విద్యా కోర్సులు? ఉత్పత్తిని పెంచుకున్నా వినియోగించాల్సిన ప్రజానీకానికి కొనుగోలు శక్తి కొరవడుతోంది. దేశ ఆర్థిక పారిశ్రామిక శాస్త్ర సాంకేతిక రంగాల్లో వస్తున్న అభివృద్ధి మార్పుల కనుగుణంగా ఉన్నత విద్యా విధానం అభివృద్ధి జరుగుతుంది. అయితే ప్రభుత్వ విధానాలు విదేశాలకు వలస వెళ్ళే మేధావి వర్గాన్నే రూపొందిస్తున్నాయి. ఎందుకంటే వీరిని వినియోగించుకో గలిగే సామాజిక వ్యవస్థ లేదు కనుక. ప్రజల కొనుగోలు శక్తి పెరిగేలా దేశీయ ఉత్పత్తి - మార్కెట్ వ్యవస్థలు రూపొందాలి. యిందుకు భిన్నంగా, ఎదుగుదల లేని పారిశ్రామిక రంగాన్ని దళారీ బూర్జువాలు-భూస్వాములు నియంత్రిస్తున్నప్పుడు ఉన్నత విద్యావంతులు ఎవరి కోసం పనిచేయగలరు? ఈ దళారీల భూస్వాముల నియంత్రణ నుండి అశేష ప్రజానీకం విముక్తి కాకుండా, బహుళజాతి పెట్టుబడిదారీ వర్గాల ఆస్తుల్ని జాతిపరం చేయకుండా దేశం సర్వతో ముఖాభివృద్ధిని సాధించలేదన్నది తిరుగులేని వాస్తవం.

## ముగింపు:

స్థూలంగా దేశీయ విద్యా విధానాన్ని సమీక్షించినప్పుడు ఈ విద్యా విధాన తిరోగమనం యాదృచ్ఛికం అయితే కాదు. సామ్రాజ్య వాదం అనాదిగా తగు అంచనాలతో పథక ప్రకారం సాగిస్తున్న కుట్ర నని అవగత మౌతుంది. ఎందుకంటే, నేటి విద్యా విధాన అమలుకు బీజాలు నాటి నూతన విద్యా విధాన పత్రంలోనే చోటు చేసుకోవడం క్రమానుగత పథక అమలుకు దేశ పాలక వర్గ పార్టీలన్నీ సానుకూలతను వ్యక్తం చేయడం మరో పథకం. ఇది అధికారంలో ఎవ్వరున్నా సంస్కరణల పర్వానికి తిరుగులేని పరిస్థితులకు ఏర్పాటు. ఈ నేపథ్యంలో విద్యారంగ ప్రైవేటీకరణ ఫలితాలు ఎంతటి వక్ర భాష్యాలకు తావిస్తున్నాయో ప్రత్యక్షంగా చూస్తూనే వున్నాం. ఈ వక్రీకరణలను యిప్పటికైనా నివారించాలన్న లక్ష్యంతోనే వైద్య విద్యార్థులు - జూనియర్ డాక్టర్లు సమ్మెకు మరోసారి సాహసించడం, వారి సామాజిక బాధ్యతను గుర్తెరగడమే అనే విషయాన్ని ప్రతి ఒక్కరూ గుర్తెరగాలి! భావి తరపు భవితవ్యాన్ని వ్యక్తం చేయ్యాలి! ఈ రోజు జూనియర్ డాక్టర్లు, రేపు రోడ్డు రవాణా సంస్థ కార్యాలయాల ప్రైవేటీకరణకు వ్యతిరేక ఉద్యమం, ముందు ముందు సంస్కరణల-వ్యతిరేక పోరుకు అందరూ సంసిద్ధం కావల్సిందే మరి!

❑

---

(31వ పేజీ తరువాయి)

అలాగే ప్రభుత్వ విద్య పరిరక్షణకోసం ప్రత్యామ్నాయమార్గాలను మా సంఘాలు ఎప్పటినుంచో సూచిస్తున్నాయి. గత 10 సం॥లుగా సదస్సులు, వర్క్‌షాపులు, సెమినార్‌లు నిర్వహించాము. ఇంటర్ వ్యవస్థలోని టీచింగ్, నాన్ టీచింగ్ సంఘాలతో కలిసి ఐక్య వేదికలు నిర్మించి పోరాటాలు నిర్మించాము. ఇఆర్‌టిడబ్లు లాంటి పరిశోధక సంస్థలు, ఎకడమిక్ స్టాఫ్ ట్రయినింగ్ కాలేజీలు ఏర్పాటు చేసేంతవరకు ఉద్యమం కొనసాగింది. ఈ సంస్థలవల్ల ఇంటర్ విద్యలో నిరంతర పరిశోధన, అధ్యాపకుల విజ్ఞానానికి ఎప్పటికప్పుడు పదును పెట్టడానికి అవకాశం వుంటుంది.

అయితే బోర్డ్‌కి సంబంధించిన ఒక సెక్రటరీ నిర్వాకం వల్ల స్టాఫ్ ట్రయినింగ్ కాలేజీ పని ప్రారంభించలేకపోయింది. ఇఆర్‌టిడబ్లు సైతం అనుకున్నంతగా తన కృషి కొనసాగించలేకపోయింది. ఇది ప్రభుత్వం ఇంటర్ విద్య పట్ల చూపిస్తున్న నిర్లక్ష్య వైఖరికి నిదర్శనం. ప్రభుత్వ రంగంలోని ఇంటర్ విద్యను కాపాడటానికి 1982 విద్యా చట్టం అమలు చేయటం అత్యవసరం, అనివార్యం! అట్లాగే ఇప్పటివరకు 13 లక్షలమంది విద్యార్థుల విద్యను నిర్వహిస్తున్న ఇంటర్మీడియట్ బోర్డ్‌ను ప్రాంతీయ బోర్డులుగా వికేంద్రీకరించి సిలబస్, పరీక్షలు తదితర విద్యా కార్యక్రమాలను నిర్వహించినట్లయితే విద్యార్థులకు ముఖ్యంగా దళిత,పేద వర్గాల వారికి సమన్యాయం దొరుకుతుంది. పొరుగు రాష్ట్రమయిన తమిళనాడులో ఇచ్చినట్లుగానే విద్యార్థులకు పాఠ్యపుస్తకాలను మన రాష్ట్రంలో కూడా ఉచితంగా అందించాలి. అదేవిధంగా 'తెలుగు అకాడమి' పుస్తకాల పైరసీని అరికట్టాలి. విద్యా నిర్వహణకు ఒక ఐఏఎస్ ఆఫీసర్ కంటే ఒక విద్యావేత్త ఆధ్వర్యంలో అనుభవజ్ఞులైన విద్యావేత్తలతో కలుపుకొని ఒక ఎకాడమిక్ సెనెట్ బాడీ ఇంటర్ బోర్డ్ కార్యక్రమాలను నిర్వహించటం సమంజసంగా వుంటుంది.

ఇప్పటికైనా ప్రభుత్వం విద్యలో తేబోయే సంస్కరణలు పాలక రాజకీయ పార్టీలు తమ ఎన్నికల ప్రణాళికల్లో చెప్పినట్లుగానే కార్పొరేట్ శక్తులు కొనసాగకుండా తమకు ఓట్లువేసి గద్దెనెక్కించే పేద, దళిత, బలహీన వర్గాల, కులాల బిడ్డల కోసం, ప్రభుత్వ విద్యా సంస్థల అభ్యున్నతి కోసం ఉండాలని విద్యాభిమానులందరూ డిమాండ్ చేయాలి. ఇది లక్షలాది పేద విద్యార్థుల, వేలాది అధ్యాపకుల ఆకాంక్ష. ప్రభుత్వం స్పందిస్తుందని ఆశిద్దాం.

❑

# ఇంటర్మీడియట్ విద్య - ఒక సమీక్ష

- ఎమ్.వి. గోనారెడ్డి

ప్రధాన కార్యదర్శి, ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘం

విద్యా వ్యవస్థలో ఇంటర్మీడియట్ విద్య అతి కీలకమైన, నిర్ణయాత్మకమైన దశ. 1969-70 విద్యా సం॥లో కొఠారి కమిషన్ రికమండేషన్ ఆధారంగా మాజీ ప్రధాని అప్పటి ముఖ్యమంత్రి పి.వి. నరసింహరావు నేతృత్వంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 10+2+3 విధానాన్ని ప్రవేశపెట్టింది. స్వయంకృషితో యువత ఎదుగుతూ ఆంధ్రప్రదేశ్‌లో నిరుద్యోగం అనే పదం వినిపించరాదనే మహదాశయంతో ప్రారంభింపబడిన వృత్తివిద్య, విద్యాప్రమాణాల పెంపు లక్ష్యంతో +2 విద్య ప్రారంభించబడింది. బాలారిష్టాలు, ఎన్నో ఒడిదుడుకులు, నిరాదరణకు లోనవుతూ మూడు దశాబ్దాలకు మించి ప్రస్థానం కొనసాగించింది +2 విద్య. ఈ మధ్యకాలంలో +2 విద్యవిధానంలో కేవలం లాభాపేక్షతో పెను తుఫానులా విరుచుకుపడిన ప్రైవేట్ విద్యాసంస్థలు, సంస్కరణల పేరుతో ప్రభుత్వాలు తీసుకున్న ఆలోచనా రహిత చర్యలు పేద, బడుగు విద్యార్థులకు నిలయమైన ప్రభుత్వ రంగ +2 విద్యారంగ నవనాడులూ కృంగదీస్తున్నాయి. వీటి ప్రభావం +2 రంగ ఉపాధ్యాయులపైనా పడ్డాయి.

స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన భారత ప్రభుత్వం నియమించిన మొదటి విద్యాకమిషన్ సిఫారసుల మేరకు రూపొందించిన ప్రప్రథమ విద్యావ్యవస్థ 'ఇంటర్మీడియట్ విద్య'. దాదాపు రెండు దశాబ్దాలపాటు అడ్‌హాకిజమ్ ఇంటర్మీడియట్ విద్యపై పెత్తనం చేయడమే ఈ రంగం సంక్షోభానికి కారణం.దేశ అవసరాలకనుగుణంగా గుణాత్మక విద్యనందించే ఉద్దేశ్యంతో విద్యాసంస్కరణల్లో భాగంగా, పాఠశాల విద్యకు, కళాశాల విద్యకు మధ్య వారధిగా 1969లో ఆంధ్రప్రదేశ్‌లో ఇంటర్మీడియట్ విద్యను ప్రవేశపెట్టారు. అమెరికాలో విజయవంతంగా నిర్వహించబడుతున్న కమ్యూనిటి కాలేజిలపై అధ్యయనం చేసిన రాజగోపాల్ గారి ప్రతిపాదనల్ని ఇంటర్మీడియట్ విద్య లో ప్రభుత్వం ప్రవేశపెట్టింది.

తన ఆవిర్భావం నుంచే ఇంటర్మీడియట్ విద్య ఉన్నతవిద్యలో ఒక భాగమైంది. దీన్ని పాఠశాల విద్యలో అంతర్భాగం చేయడానికి చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. 1982లో ప్రవేశపెట్టిన 'విద్యా చట్టం' పదవతరగతి తరువాతి విద్యను ఉన్నత విద్యగా గుర్తించింది. యు.జి.సి. వేతనాలను ఇవ్వకుండా ఉండడానికి ఉన్నత విద్యాశాఖ నుంచి ఇంటర్మీడియట్ విద్యను విడదీసే ప్రయత్నాలూ జరిగాయి. ఈ విద్య అటు పాఠశాల విద్యకు, ఇటు కళాశాల విద్యకు చెందకుండా త్రిశంకు స్వర్గంలో ఉండిపోయింది. ఈ కారణంగా ఇంటర్మీడియట్ విద్య తన ఉనికిని కోల్పోయే ప్రమాదం ఏర్పడింది. సంఖ్యాపరంగా ఆరంభంలో వున్న 181 కళాశాలలు ఇప్పుడు 3824 అయినప్పటికీ ప్రభుత్వం ఐ.టి.ఐ., పాలిటెక్నిక్ కోర్సులకిచ్చే ప్రాధాన్యతలో సగమైనా ఇంటర్మీడియట్‌కివ్వడంలేదు.

ప్రతి సంవత్సరం ఇంటర్మీడియట్ విద్యనభ్యసించే విద్యార్థుల పెరుగుదలకనుగుణంగా కళాశాలలో బోధనా నియామకాలు జరుగటంలేదు. అధ్యాపకుల పదవీ విరమణ, పదోన్నతుల కారణంగా ఏర్పడిన ఖాళీలను త్వరితగతిన భర్తీ చేయకపోవడంవలన కళాశాలలో విద్యావాతావరణం దెబ్బతింటున్నది. గ్రామీణ ప్రాంతాలలో ఏర్పాటుచేసిన ప్రభుత్వ కళాశాలలు మూతపడే ప్రమాదం ముంచుకొచ్చి పేద, బలహీనవర్గాలకు విద్య లభించక, పట్టణ ప్రాంతాలకు వలసపోలేక విద్యకు దూరమవుతున్నారు.

లోపభూయిష్ట నిర్వహణాకారణంగా ఇంటర్మీడియట్ విద్య బలహీనపడటమే కాదు, సంక్షోభంలో కూరుకుపోతున్నది. ప్రారంభంలో ఈ విద్య డి.పి.ఐ. పరిధిలో, ఆ తరువాత డి.హెచ్.ఇ. పరిధిలోకి వచ్చి, డి.హెచ్.ఇ. నుంచి డి.ఐ.ఇ.గా విడివడి ప్రత్యేకశాఖగా ఆవిర్భవించింది. ఈ విభజనల్లో ఇంటర్మీడియట్ విద్యావ్యవస్థ ఎన్నో సమస్యలను ఎదుర్కొంది. 1989 నుంచి ప్రత్యేక శాఖగా ఏర్పడినా, అందులోని ఉన్నత పదవుల్లో ఇంటర్మీడియట్ విద్యకు సంబంధించినవారు లేకపోవడం వలన నిర్లక్ష్యానికి గురయ్యింది. వారి నిర్లిప్త వైఖరి వల్ల విద్యాభివృద్ధి కుంటుపడింది.

1989లో జరిగిన ఒప్పందాల ప్రకారం ప్రభుత్వ ఉత్తర్వు 343 మేరకు ఇంటర్మీడియట్ విద్య ఉన్నత విద్యామండలి పరిధిలో తీసుకురాబడింది. ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్యామండలి ఎంతో పటిష్టంగా ఉన్నా ఎందుకో ఇంటర్మీడియట్ విద్య పట్ల తగినంత శ్రద్ధ చూపించలేదు. ప్రాథమిక విద్యాభివృద్ధికి ఎస్‌సిఇఆర్‌టి , యన్‌సిఇఆర్‌టి లాంటి సంస్థలు, కళాశాల విద్యాభివృద్ధికి యుజిసి ఎకడమిక్ స్టాఫ్ కాలేజెస్, విశ్వవిద్యాలయాలు దోహదం చేస్తున్నాయి. అయితే ఇంటర్మీడియట్ విద్యాభివృద్ధికి దోహదంచేసే సంస్థలు ఏవీ లేకపోవడం ఆ రంగం సంక్షోభంలో పడటానికి ఒక కారణం.

ఇంటర్మీడియట్ విద్య స్థాపనా లక్ష్యం యువతను వృత్తి విద్యలవైపు ఆకర్షితులను చేయడం. అయితే ఇంటర్మీడియట్ విద్యలో ప్రవేశపెట్టిన వృత్తివిద్యా కోర్సులు కూడా ప్రభుత్వ అనాదరణకు గురవుతున్నాయి. శాశ్వత అధ్యాపకుల నియామకం జరుగకపోవటం, నిధుల కొరత, ప్రభుత్వ శాఖలకు పారిశ్రామిక సంస్థలకు మధ్య సమన్వయం కుదరకపోవడం, ప్రాంతాల అవసరాలకు అనుగుణంగా కోర్సుల రూపకల్పన చేయకపోవడం, సాధారణ విద్యకు, వృత్తి విద్యకు మధ్య వున్న అడ్డుగోడల్ని బద్దలుకొట్టకపోవడం మున్నగు కారణాల దృష్ట్యా వృత్తి విద్యా కోర్సులు కూడా సన్నగిల్లుతున్నాయి.

జాతీయ స్థాయి సిబిఎస్ఇ తోనూ, ఇతర రాష్ట్రాలలోని +2 విద్యావ్యవస్థలతో ఆంధ్రప్రదేశ్‌లోని ఇంటర్మీడియట్ విద్యను సరిపోలిస్తే తులనాత్మక ప్రమాణాల స్థాయి తగ్గినట్లు కనిపిస్తుంది. పాఠశాల విద్య సిలబస్‌కు ఉన్నత విద్య సిలబస్‌కు మధ్య సమన్వయంగా ఇంటర్మీడియట్ సిలబస్ శాస్త్రీయంగా రూపొందించబడటంలేదు. పదో తరగతిలో ముగించిన పాఠ్యాంశాల కొనసాగింపు ఇంటర్మీడియట్ విద్యలో లేదు. ఇందువల్ల ఏర్పడ్డ అంతరాలను సరిదిద్దకపోవడంవల్ల ప్రమాణాల స్థాయి పెరుగుదల గణనీయంగా లేదు. ఈ విద్య అనంతర వృత్తి విద్యాకోర్సులకు అవసరమైన జ్ఞానాన్ని ఈ విద్య అందించలేకపోవడం కూడా ప్రమాణాలు ఆశించినంత లేకపోవడానికి గల కారణం.

ఇంటర్ విద్య సంక్షోభంలో పడటానికి ప్రధాన కారణం ప్రయివేటీకరణ, వ్యాపారీకరణ, కార్పోరేటీకరణ! మార్కెట్ శక్తుల కబంధ హస్తాల్లో ఇంటర్మీడియట్ విద్య నలిగిపోతున్నది. అడ్మిషన్లు మొదలుకొని పరీక్షల నిర్వహణ వరకు నియమోల్లంఘన జరుగుతున్నది. ఉత్తర్వు 1631 ద్వారా అడ్‌హాక్ బోర్డును ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ప్రభుత్వం 518 ఉత్తర్వు ద్వారా ఇంటర్మీడియట్ బోర్డు విధులను స్పష్టంగా నిర్దేశించింది. 1971లో రూపొందించబడిన ఆక్ట్ 2 ద్వారా శాశ్వత ప్రాతిపదికన ఇంటర్మీడియట్ బోర్డు ఏర్పడింది. ఇంటర్మీడియట్ బోర్డు ఏర్పడినప్పటినుండి కొన్ని సంస్కరణలను చేపట్టింది. ముఖ్యంగా పరీక్షా వ్యవస్థలో జంబ్లింగ్ విధానం, మూడుసెట్ల ప్రశ్నాపత్రాలు, బార్‌కోడ్ విధానం లాంటివి ఇంటర్మీడియట్ విద్యలో ప్రమాణాలను అభివృద్ధి పరిచే కారకాలే! రివాల్యుయేషన్ కోసం సమాధానాల పత్రాల జిరాక్స్ కాపీలను ఇచ్చే పద్ధతి ప్రజల్లో బోర్డు విశ్వసనీయతను పెంచిందనటంలో సందేహంలేదు.

ఇట్లా ఎన్ని సంస్కరణలు పరీక్షా వ్యవస్థలో చోటుచేసుకున్నప్పటికీ అనుకున్నమేరకు ఈ వ్యవస్థ పారదర్శకంగా రూపొందటంలేదన్నది అక్షరసత్యం! దీనికి కారణం పరీక్షలను నిర్వహిస్తున్న ఇంటర్మీడియట్ బోర్డ్ 'పరీక్షల నిర్వహణ' 'మూల్యాంకనాన్ని' ఇందులో ప్రధాన భాగస్వాములైన అధ్యాపకులతో కల్సి శాస్త్రీయంగా ఎప్పటికప్పుడు సమీక్ష జరపకపోవడమే!

ఇంటర్ విద్యలో సంక్షోభం మరింతగా తీవ్రం కావటానికి ప్రధానకారణం - ఇంటర్ విద్య 'ఎంసెట్'కి మాత్రమే కుదించబడటం. ఇంటర్ విద్యలో సిలబస్, పరీక్షలు, బోధనా విధానంలాంటి అకాడమిక్ కార్యక్రమాలన్నీ ఎంసెట్ చట్రంలోనే బిగించబడటం మరోకారణం. ఈ ప్రక్రియ మొత్తంగా విద్యను వ్యాపారమయం చేసింది. క్రమంగా ఇంటర్ విద్య కార్పోరేట్ విద్యాశక్తుల చేతిలో కీలుబొమ్మగా దిగజారిందని చెప్పకతప్పదు. పర్యవసానంగా మానవీయ విలువల్ని బోధించే ఆర్ట్స్ కామర్స్ లాంటి కోర్సులు, జీవితానికి కనీస గ్యారంటీనిచ్చే వృత్తివిద్యా కోర్సులు, ప్రైవేట్, కార్పోరేట్ జూనియర్ కళాశాలల్లో కనుమరుగయ్యాయి. మార్కుల కోసం 7కోట్ల తెలుగు ప్రజలు మాట్లాడే తెలుగు భాష, జాతీయ భాష అయిన హిందీ స్థానంలో రెండవ భాషగా సంస్కృతం వచ్చిచేరింది. అంటే కార్పోరేట్,ప్రైవేటు విద్యాశక్తులు శాస్త్రాలను, భాషలను సైతం తమ సంస్థలలో నిషేధించే స్థాయికి చేరుకున్నాయి. ఈ క్రమంలో ఇంటర్ విద్య ఒక పెద్దమార్కెట్‌గా అవతరించింది. విద్యలో మానవీయకోణం విధ్వంసం కావించబడి "ఎకాడమిక్ టెర్రరిజం" విలయతాండవం చేస్తుంది. ఫలితంగా కార్పోరేట్ కళాశాలల్లో విద్యార్థులు మతిస్థిమితం తప్పటమో లేకపోతె ఆత్మహత్యలు చేసుకోవడమో తప్పటంలేదు. ఈ భయంకర విద్యా వాతావరణాన్ని వ్యతిరేకిస్తూ విద్యార్థి, అధ్యాపక, ప్రజాసంఘాలు చేసిన అందోళనల ఫలితంగా ప్రభుత్వం ప్రొఫెసర్ నీరదారెడ్డి కమిటీ వేసింది. ఎంతో నిజాయితీగా, ఆర్ద్రంగా ఈ కమిటీ వెలికితీసిన వాస్తవాలు వెలుగుచూడకుండా ప్రభుత్వమే కమిటీ రిపోర్ట్ గొంతునొక్కటం ఒక ఎకడమిక్ విషాదం!

ఇంటర్ విద్యలో ఇంకా వికృత ధోరణులు పెరగటానికి ప్రైవేట్ , కార్పోరేట్ సర్వసత్తాక స్వతంత్రంగా వ్యవహస్తూ ప్రభుత్వ నియమావళికి మొత్తంగా తుంగలో తొక్కటం మూలకారణమవుతుంది. అడ్మిషన్ల ప్రక్రియ మొదలు ఫలితాలు ప్రకటించే వరకు అన్నింట్లో నియమోల్లంఘన యధేచ్ఛగా కొనసాగుతుంది. బినామీ కళాశాలల పేరిట లక్షలాది విద్యార్థులను తమ తమ సంస్థల్లో చేర్చుకుంటూరు. పరీక్షలు, బోధనాపద్ధతులు, పనిగంటలు అన్నీ 'స్వతంత్రంగా' నిర్వహించబడ్డాయి. వీటన్నింటిలోకి దారుణమైనది, విద్యార్థుల తల్లితండ్రుల నుండి దండుకుంటున్న ఫీజులదోపిడి. ఈ కార్పోరేట్ యాజమాన్యాలు ఒక విద్యార్థినుండి ఇంటర్ విద్య పూర్తి చేయడానికి ఒక లక్ష వసూలు చేస్తున్నాయి. ఈ వైట్‌కాలర్‌దోపిడి ప్రపంచంలో ఎక్కడాలేని విధంగా జరుగుతుందంటే ఇందులో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు. అంతేకాకుండా ఈ కార్పోరేట్ విద్యా మార్కెట్ శక్తుల "విద్యా ప్రయోగాల" వల్ల ఎన్నో ప్రభుత్వ విద్యాసంస్థలు మూతపడే ప్రమాదం పెరిగింది. దీనికితోడు ప్రభుత్వాల నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలవల్ల మారుమూల గ్రామీణ ప్రాంతాల విద్యార్థులు ఇంటర్ చదువుకు దూరమయి డ్రాపవుట్స్‌గా మిగిలిపోతున్నారు. ఆర్థిక తాహతుగలిగిన తల్లిదండ్రులు విద్యార్థుల చదువు కోసం పట్నాలకు వలసపోతున్నారు. ఫలితంగా విద్యార్థులు లేక కొన్ని విద్యాసంస్థలు పల్లెల్నించి ఎత్తివేసే పరిస్థితి నెలకొంది. మరి, కార్పోరేట్, ప్రైవేట్ శక్తులను నియంత్రించడం సాధ్యమా?

ఇప్పటివరకైతే ప్రభుత్వశాఖ ఈ కార్పోరేట్ శక్తుల విద్యా అరాచకాలను అరికట్టలేకపోయింది. అరికట్టడానికి ధీటైన అధికారయంత్రాంగాన్ని రూపొందించలేకపోయింది. అరికట్టడానికి ప్రయత్నించిన అధికారులను కార్పోరేట్ శక్తులే దౌర్జన్యంగా బదిలీలు, సస్పెన్షన్లు చేయిస్తుంటే ప్రభుత్వం నిర్లజ్జగా వ్యవహరించింది. పర్యవసానంగా పల్లెలు పట్నాలకు విద్యాపరంగా మరింత అగాథంలో పెరిగిపోయింది. ఇది దేశాధ్యక్షులు కలాంగారి మానస పుత్రికయిన పుర (ప్రొవైడింగ్ అర్బన్ ఎమనిటీస్ టు రూరల్ ఏరియాస్) లక్ష్యానికి పూర్తిగా వ్యతిరేకమైనది. అయితే కార్పోరేట్ శక్తులను ప్రతిఘటిస్తూనే అధ్యాపక సంఘాలు ప్రభుత్వ ఇంటర్మీడియట్ విద్యను కాపాడుకొనడానికి వివిధ రూపాలలో ఆందోళనలు చేపట్టాయి. ప్రభుత్వ విద్య పరిరక్షణకు ప్రత్యామ్నాయ మార్గాలను సూచించాయి. అయినప్పటికీ ప్రభుత్వం, అధికారులు కలిసి అసమానుల మధ్య అక్రమ పోటీని ప్రోత్సహిస్తున్నారు. ఏ వసతులు లేని- అంటే లెక్చరర్లు లేక, భవనాలు లేక, ఇతర వసతులు లేక రోజురోజుకూ శిథిలమవుతున్న ప్రభుత్వ విద్యాసంస్థలకు, కోట్లకు పడగలెత్తిన కార్పోరేట్ తిమింగలాల మధ్య పోటీని నడిపిస్తున్నారు. ఎందరో అర్హత కలిగిన విద్యాధికులున్నప్పటికీ ప్రభుత్వం రెగ్యులర్ లెక్చరర్లను నియమించక, కాంట్రాక్ట్ లెక్చరర్లని ఒక కొత్త తెగను ప్రారంభించింది. ఏమాత్రం గ్యారంటీ లేని ఈ "ఉపాధ్యాయులు" చేసే టీచింగ్ వల్ల ఫలితాలెలా వుంటాయన్నది ఒక జవాబులేని ప్రశ్న.

ఈ పరిస్థితుల్లో ఎయిడెడ్, ప్రభుత్వ కళాశాలలు మూతపడి ఎందరో విద్యాధికులు ఉపాధి కోల్పోతున్నారు. విద్యార్థులు వీథిన పడుతున్నారు. అందుకే ప్రభుత్వ విద్యాసంస్థల పరిరక్షణ ఏకైక ఎజెండాగా ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘం, ఉన్నత విద్య ఉపాధ్యాయ సంఘాల సమాఖ్య ఆధ్వర్యంలో నిరంతర ఆందోళన కొనసాగుతోంది.

(మిగతా 28వ పేజీలో)

# అందరూ ఆర్థిక శాస్త్ర నిపుణులే, కాని....

- వి. హనుమంతరావు

వంటవండే వాళ్లు మరీ ఎక్కువైతే, వండే వంటకాలు తగలడతాయని ఇంగ్లీషులో సామెత. అలాగే మనదేశ ఆర్థిక పరిస్థితిని మానేజ్‌చేసే ఆర్థిక నిపుణులు మరీ ఎక్కువైపోయారు. ప్రధాని మన్‌మోహన్‌సింగ్, ఆర్థికశాఖ మంత్రి చిదంబరం, ప్రణాళికాసంఘం ఉపాధ్యక్షుడు మాంటెక్‌సింగ్ అహ్లువాలియా, రిజర్వుబ్యాంకు గవర్నర్ వై. వేణుగోపాలరెడ్డి, వీరందరికీ సలహాలిచ్చే ఆర్థిక శాస్త్రవేత్తల సలహా సంఘ సభ్యులు-ఇలా ఎంతో మంది మన ఆర్థిక పరిస్థితిని వంట వండేస్తున్నారు. వీరంతా కలిసి పైన ఉదహరించిన ఇంగ్లీషు సామెతను నిజం చేస్తున్నారా అనిపిస్తుంది.

రెండోపక్క కార్పొరేట్ సంస్థలకు, పారిశ్రామిక వేత్తల అఖిల భారత సంస్థలకు ఒంటిమీద బట్ట నిలవటం లేదు. పచ్చ కామెర్లున్నవాడికి ప్రపంచమంతా పచ్చగా కనిపించినట్లు లాభాలు పోగేసుకొంటున్న వీరికి ఆర్థిక పరిస్థితి అంతా మూడు పువ్వులు, ఆరు కాయలుగా కనిపిస్తుంది. భారతీయ బహుళజాతి సంస్థలు పుట్టుకొస్తున్నాయి, విదేశాలనుంచి రుణాలు తెచ్చుకోవచ్చు, ఇతర దేశాల్లో పెట్టుబడులు పెట్టవచ్చునని ప్రభుత్వం పచ్చ జెండా ఊపింది. వడ్డీరేట్లు తగ్గించింది. ఎక్సయిజు, కస్టమ్స్ సుంకాలు తగ్గించింది. బ్యాంకుల్లో నిధుల నిల్వలు పేరుకుపోతున్నాయి. బడా పారిశ్రామికవేత్తలకు ప్రాతినిధ్యం వహిస్తున్న 'ఎకనమిక్ టైమ్స్' పత్రిక ఒక వెయ్యి కంపెనీల 2004-05 తాలూకు లావా దేవీలను అధ్యయనం చేస్తే, అందులో వంద కంపెనీల్లో ఒక్కొక్క కంపెనీ వద్ద వెయ్యేసి కోట్ల రూపాయల నిధులు మూలుగుతున్నాయని తేలింది. ఈ కంపెనీల్లో రిలయన్స్, బజాజ్ ఆటో, ఒఎన్‌జిసి, ఐటిసి, జిఇషిప్పింగ్, ఎస్సార్‌షిప్పింగ్ లాంటి తాటిని తలదన్నే సంస్థలున్నాయి. ఈ డబ్బంతా బ్యాంకుల్లో, సెక్యూరిటీల్లో వుంటుంది కాబట్టి, వడ్డీ కూడా సంపాదిస్తారు. పట్టణాల్లో, నగరాల్లో రోడ్ల మీద పాదచారులు నడవడమే గగనమైపోతుంది. రోడ్లన్నీ కార్లమయం, కార్ల అమ్మకాలు చుక్కలంటుతున్నాయి. వీరు వ్యవసాయరంగంలో కూడా ప్రవేశిస్తున్నారు. సహజంగానే వీరికి అంతా పచ్చగా కనపడుతుంది.

మూడోపక్క బహుళజాతి సంస్థలు 1991లో నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టిన నాటినుంచి రుణాలిచ్చి, ప్రభుత్వం మెడలువంచి, విదేశీ సంస్థాగత ఇన్వెస్టర్ల రూపంలో, అంతవరకూ ఉమ్మడి రంగంలో వున్న బహుళజాతి సంస్థలు, దేశీయ వాటాదారులను బయటకు నెట్టివేసి ఆ సంస్థలను హస్తగతం చేసుకోవటంలో, పరిశ్రమల్లో, బ్యాంకుల్లో, ప్రభుత్వరంగ సంస్థల్లో విదేశీ పెట్టుబడుల శాతాన్ని పెంచుకోవటంలో కృతకృత్యుల వుతున్నారు. 1400 రకాల ఉత్పత్తుల దిగుమతులమీద ఉన్న ఆంక్షలను తొలగింపచేసుకొన్నారు. డబ్ల్యు.టి.వో. పుణ్యమా అంటూ, ప్రపంచీకరణ నేపథ్యంలో మన పరిశ్రమల మీద, మన ఆర్థిక పరిస్థితి మీద మనకే అజమాయిషీ లేకుండా పోయింది. తాజాగా బి.హెచ్.ఇ.ఎల్ సంస్థల్లో తమ వాటాను పెంచుకోగలిగారు. బ్యాంకుల్లోనూ అదే జరిగింది. కనీస ఉమ్మడి కార్యక్రమాన్ని తుంగలో తొక్కి ఆర్థిక విషయాల్లో తమ చిత్తం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. విదేశీ వస్తువుల దిగుమతులమీద ఆంక్షలు తొలగటంతో సామాన్య, మధ్యతరగతి గృహస్థుల స్థాయిలో చైనా నుంచి, ధనవంతుల స్థాయిలో అభివృద్ధి చెందిన దేశాలనుంచి చవగ్గా వస్తువులు కుప్ప తిప్పలుగా వచ్చి పడుతున్నాయి; భారతీయ పరిశ్రమలు ఈ పోటీని తట్టుకోలేక పోతున్నాయి. బహుళజాతి సంస్థల తడాఖా ఏమిటో తెలుసుకోవడానికి ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

ఇదంతా రూపాయకు ఒకవైపు చిత్రం మాత్రమే; రెండోవైపు కూడా చూడాల్సివుంది. అది పదవ ప్రణాళిక మధ్యంతర సమీక్ష రూపంలో మనముందుంది. ఆ సమీక్ష చూస్తే అంతా పాలూ, తేనె ప్రవహిస్తున్నట్లేమీ లేదు. ఉదాహరణకు ప్రతి ప్రణాళిక, ఆ మాటకొస్తే మన బడ్జెట్, మన ఆర్థిక పరిస్థితి అప్పటికీ అప్పులు తెచ్చుకొంటేనే గాని గడవటం లేదు. ఈ అప్పులు తొమ్మిదో ప్రణాళికలో కన్నా, పదవ ప్రణాళికా కాలంలో తగ్గుతాయని అంచనా వేయగా, ప్రణాళిక మొదటి నాలుగేళ్లలో అనుకొన్నంతమేరకు తగ్గలేదు. ప్రణాళిక కోసం సేకరించిన నిధుల్లో మొదటి నాలుగేళ్లలో 86 శాతం అప్పుతెచ్చిన సొమ్మే. అసలు కేంద్ర ప్రభుత్వ రెవెన్యూ ఆదాయమే అంతంతమాత్రం. ఈ నాలుగేళ్లలో కేంద్ర రెవెన్యూ ఆదాయం (రాష్ట్రాలకు ఇచ్చింది పోగా) అనుకొన్న మేరకు పెరిగినా, ఆ పెరుగుదల బడ్జెట్ అంచనాలు, సవరించిన అంచనాల ఆధారంగా వేసిన లెక్కల ప్రకారం పెరుగుదలే కాని వాస్తవ ఆదాయం ఆధారంగా కాదు. ఇది గణాంకాలతో గిమ్మిక్కులు తప్ప మరొకటి కాదని సమీక్ష తేల్చి చెప్పింది. కస్టమ్స్ సుంకాలు తగ్గించుకొంటూపోతే, ఆదాయం తగ్గిపోతుందని హెచ్చరించింది. ప్రత్యక్షపన్నుల సంస్కరణ ఇంకా ప్రాథమిక దశలోనే వుందని పేర్కొంది.

ప్రతినెలా ఆర్థిక పరిస్థితి గురించి ప్రధానికి నివేదిక సమర్పించే ఆర్థిక సలహా సంఘం నడుస్తున్న సంవత్సరంలో 6.7 శాతం

అభివృద్ధి సాధిస్తే అదే గొప్ప విషయం అని తేల్చి చెప్పింది. (సిఐఐ అంచనా 7.3 శాతం) 2004-05లో తయారీ రంగం 8.9 శాతం వృద్ధి సాధించినా, ఆ సంవత్సరం ఆఖరి రెండు నెలల్లో ఈ వృద్ధి మందగించిందని, దీని ప్రభావం నడుస్తున్న ఏడాదిలో కొంతకాలం కొనసాగుతుందని, ఫలితంగా మొత్తం సంవత్సరం ఆర్థికాభివృద్ధి రేటు తగ్గవచ్చునని ప్రధానిని హెచ్చరించింది. ఎగుమతుల జోరు తగ్గే సూచనలున్నాయని ఆ నివేదిక చెబుతూంది. కొన్ని విధాన నిర్ణయాలు తీసుకొంటే తప్ప, ఈ మందగమనం తప్పక పోవచ్చునంది. ఒక వేళ రుతుపవనాలు అనుకూలించకపోతే అంతే సంగతులు. పారిశ్రామిక వేత్తల సంస్థలు కూడా ఈ భయాన్ని వెలిబుచ్చుతున్నాయి. అయితే, విదేశీ పెట్టుబడులు ధారాళంగా వచ్చిపడితే, పరిస్థితులు అనుకూలించవచ్చునని అభివృద్ధి ఏడుశాతం దాటవచ్చునని ఆశాభావాన్ని వెలిబుచ్చుతున్నాయి.

తయారీ రంగంలో అభివృద్ధి గురించి పైన ఉదహరించటం జరిగింది. అయితే కనీస ఉమ్మడి కార్యక్రమం అమలు గురించి గత నెలాఖరున ఒక నివేదిక పత్రికల వారికి విడుదల చేస్తూ, నడుస్తున్న సంవత్సరంలో, రుతుపవనాలు అనుకూలించిన పక్షంలో వ్యవసాయం అభివృద్ధిరేటు మూడు శాతం వుంటుందని ఆర్థికమంత్రి చిదంబరం చెప్పారుగాని పారిశ్రామికరంగం ఎంతశాతం అభివృద్ధి చెందుతుందో చెప్పకపోవటం గమనార్హం.

కాని ఆ రంగంలో ఒక ముఖ్య భాగమైన యంత్రాల తయారీ విభాగం (కాపిటల్ గూడ్స్) గురించి అంత ఉత్సాహకరంగా చెప్పకోలేం. 1) నాణ్యతలో ఇతర ఆసియా దేశాలతో పోటీ పడలేక పోతున్నాం. 2) ఎగుమతుల కయ్యే ఖర్చు ప్రపంచదేశాలన్నింటి కన్నా ఎక్కువ కావటంతో యంత్రాల అమ్మకానికి స్వదేశీ మార్కెట్ మీదనే ఆధార పడాల్సి వస్తుంది. 3) ఇందువల్ల యంత్రాలకు విస్తృతమైన మార్కెట్ లభించటం లేదు. 4) ఇదే కారణం వల్ల ఈ విభాగంలో పెట్టుబడులు పరిమితంగా వుండడమే కాదు, తగ్గుతున్నాయి కూడా. మన పారిశ్రామిక రంగాన్ని కబ్జా చేయటానికి బహుళజాతి సంస్థలకు ఒక స్వర్ణావకాశాన్ని ఇచ్చినట్లవుతుంది. 5) సాంకేతిక పరంగా గతంతో పోల్చుకుంటే పురోగమించాం కాని అభివృద్ధి చెందుతున్న ఆసియా దేశాల ఉత్పత్తులతోనైనా పోటీ పడలేకపోతున్నాం. పండిత నెహ్రూ కాలంలో యంత్రాలను తయారుచేసే యంత్ర పరిశ్రమల స్థాపనకు, ఆ విధంగా స్వావలంబన సాధించడానికి కృషి జరిపి ఫలితాలు సాధించాం గాని తర్వాత ఆ వైపుగా కృషి సన్నగిల్లింది. ఈ బలహీనత పారిశ్రామికాభివృద్ధిని, మొత్తం ఆర్థిక పరిస్థితి అభివృద్ధి రేటును కుంగదీస్తుంది.

దేశ ఆర్థిక పరిస్థితికి నిధుల కొరత రోగం పట్టుకొంది. దీనికి అసలు సిసలైన మందు సహజ వనరులు, మానవ వనరుల సద్వినియోగం, పన్నులు విధించటం ద్వారా రెవెన్యూ ఆదాయం పెంచుకోవటం.

సహజ వనరుల సద్వినియోగం అంటే అడవుల నుంచి స్మగ్లింగ్‌ను నిరోధించటం, నిర్మించిన నీటిపారుదల ప్రాజెక్టుల పూర్తి స్థాపిత శక్తిమేరకు వినియోగించటం, ఖనిజ సంపదనుంచి అత్యధిక రాబడులను సంపాదించటం, ముఖ్యంగా ఉపాధి, ఉద్యోగ కల్పన ద్వారా మానవ శ్రమ శక్తిని పూర్తిగా వినియోగించుకోవటం. వీటన్నిటి వినియోగంలో ప్రభుత్వానికి నూటికి 10 మార్కులు కూడా వేయలేం. వీటన్నిటినీ సద్వినియోగం చేస్తే రెవెన్యూ ఆదాయం వద్దన్నా పెరుగుతుంది. పన్నుల విధింపు రెండోమార్గం. సామాన్యులమీద పన్ను భారం పెంచే అవకాశం లేదని ఒక పక్క అంగీకరిస్తూనే, రెండోపక్క పరోక్ష పన్నులు పెంచటం జరుగుతూంది. మామూలుగా జిడిపిలో పన్నులు 10 శాతం వుండడం లక్ష్యంగా పెట్టుకోవటం జరుగుతుంది. కొన్ని దేశాల్లో అయితే 14 లేదా 15 శాతం కూడా వుంటుంది. కాని 1989-90లో పన్ను-జిడిపి నిష్పత్తి 11.6 శాతం కాగా 2003లో 9.6 శాతానికి తగ్గిపోయింది. అయితే ప్రస్తుత పాలకులు ఏమైనా వూడబొడిచారా అని చూడబోతే 04-05 బడ్జెట్ అంచనాలో ఈ నిష్పత్తి 10.7 గా పేర్కొన్నప్పటికీ సవరించిన అంచనాల్లో 9.84 శాతానికి తగ్గింది. అలాంటపుడు 05-06 లక్ష్యం 10.5 శాతం సాధిస్తానంటే ఎలా నమ్మకం కుదురుతుంది? పన్నులు వేయటంలో, వసూలు చేయటంలో ప్రభుత్వ యంత్రాంగం శ్రద్ధ, నిజాయితీ చూపడం లేదనడానికి పార్లమెంటు 14వ స్థాయీసంఘం చేసిన సూచన ప్రత్యక్ష సాక్ష్యం.

''పన్ను ఆదాయాన్ని గణనీయంగా పెంచడానికిగాను అత్యధికంగా పన్నులను చెల్లించే వారిపై దృష్టివుంచాలి''.

ఈ పనిని ప్రభుత్వం చేపట్టలేదనడానికి 2004 మార్చ్ కాగ్ నివేదిక మరోసాక్ష్యం. ఆ ఏడాదిలో వసూలు చేయని ప్రత్యక్ష పన్నుల మొత్తం రు. 88017 కోట్లు. ఒక కోటి రూపాయలుపైగా బాకీ పడిన స్థూల ప్రత్యక్ష పన్నులు మొత్తం బాకీల్లో 41 శాతం. ఎలాంటి ఘనాపాటీలో చూడండి. ప్రత్యక్ష పన్నులంటే కార్పొరేట్ పన్ను, ఆస్తిపన్ను, ఆదాయపు పన్ను. చెల్లించాల్సిన (సర్టిఫైడ్) పన్నులో వసూలు చేయని పన్ను 81 శాతం. కాగ్ నివేదికలో బయట పెట్టిన ఒక విచిత్రమైన విషయమేమంటే ఆస్తిపన్ను చెల్లించే వారి సంఖ్య 99-00లో 2.15 లక్షలనుంచి 03-04లో 1.35 లక్షలకు పడిపోయింది!

పరోక్ష పన్నుల్లో 03-04లో ఎగుమతులు చేసేవారికిచ్చే "ప్రోత్సాహకాలు, మినహాయింపులు'' (సబ్సిడీకి ఇవి ముద్దు పేర్లు) రు. 39704 కోట్లు! ఈ సబ్సిడీల శాతం 00-01 లో కస్టమ్స్ సుంకంలో

*(మిగతా 44వ పేజీలో)*

## రైతు ఆత్మహత్యల పాపం డి.ఎఫ్.ఐ.డి.దే

# క్రిస్టియన్ ఎయిడ్ రిపోర్టు

- రామ్‌కి

"మనపల్లెలో ఏదో జరగకూడని పొరపాటు జరుగుతోంది. "

- ఎమ్.ఎస్.స్వామినాథన్

చైర్మన్, రైతుల జాతీయకమీషన్

క్రిస్టియన్ ఎయిడ్ అనే స్వచ్ఛంద సంస్థ ప్రచురించిన రిపోర్టు ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ సంక్షోభాన్ని, వాటికారణాలను, ఇప్పటివరకు 1998 నుంచి రైతులు చేసుకున్న ఆత్మహత్యలను, వాస్తవస్థితిని మన కళ్ళముందు ఉంచుతుంది.

ఈ రిపోర్టు మనకు మెదక్ జిల్లాలోని లచ్చిరెడ్డి(32) ఏవిధంగా ఆత్మహత్య చేసుకున్నాడో చెపుతుంది. లచ్చిరెడ్డి తన పరిస్థితిని మెరుగు చేసుకునే క్రమంలో ఆలుగడ్డ మూడు ఎకరాలు వేసాడు. పెరుగుతున్న అప్పులకు భార్య బుజ్జమ్మ, తను కలిసి ఎంతో వేదన పడ్డారు. ఊళ్ళో చెరువులు, కుంటలు ఎండిపోవడంతో ఒక బోరు వేయించుకునే క్రమంలో 80,000 రూపాయలు అప్పుచేసాడు. ఎర్రనేలలో కాస్త లాభసాటి ఫలసాయంకోసం నీళ్ళు, ఎరువులు పుష్కలంగా వేయాలి. అదృష్టంకొద్దీ కొద్దిగా నీళ్ళు పడ్డాయి. అయితే ఆలుగడ్డ ధరలు ఎంతగా పడిపోయాయంటే కనీసం వడ్డీక్కూడా వచ్చే పైసలు సరిపోవు. ఆ రెండేళ్ళలో అప్పు 1,70,000 రూపాయలకు పెరిగింది.

గిట్టుబాటుకాని ఆలుగడ్డ వదిలి, చెరకు పండిద్దామను కున్నాడు. ఇంటి అవసరాలకు చేసే వ్యవసాయం పోయి పూర్తిగా వాణిజ్య పంటల వైపుకు పోయింది పరిస్థితి. వెనక్కి వచ్చే పరిస్థితి లేదు. పులినెక్కాక స్వారీ చెయ్యాల్సిందే" అన్నట్లు అయిపోయింది. చెరకు కణుపులు కొనడానికి గాని, విత్తేందుకు కావల్సిన కూలీలకు పెట్టుబడిగానీ లేవు. బ్యాంకులు కొత్త అప్పు ఇవ్వడానికి తిరస్కరించాయి. అప్పులవాళ్ళు అధిక వడ్డీలకు కూడా అప్పివ్వలేదు. స్నేహితులు, బంధువుల వద్దకు పోయాడు. చేద్దామనుకున్న ప్రయత్నాలన్నీ చేసాడు. నెమ్మదిగా అర్థమయిన విషయమేమంటే తన గ్రామం (రాయపల్లి)లో చాలామంది పరిస్థితి తనలాగే ఉంది.



బతుకుపైన, భవిష్యత్తుపైన నమ్మకం కోల్పోయిన లచ్చిరెడ్డి 2005 ఫిబ్రవరి 2 ఉదయం 10.30కు పొలానికి ఆలుగడ్డ తవ్వడానికి బయలు దేరుతూ, బండిలో ఏదోమరిచానని బుజ్జమ్మతో చెప్పి, ఇంట్లోకి పోయి ఎండోసల్ఫాన్ పురుగుమందును తాగేసాడు.

వచ్చి బుజ్జమ్మతో ఆలుగడ్డ....నీళ్ళు....చెరకు...ఉన్న అప్పు గురించి చెప్పబోతూ....మాటలు సగంలో ఆగిపోయాయి. జీవితం అర్థాంతరంగా, అసహజంగా ముగిసింది. అతని తల్లి రంగమ్మకు, భార్య బుజ్జమ్మకు కన్నీళ్ళు మిగిల్చి వెళ్ళిపోయాడు. ఇది లచ్చిరెడ్డి ఒక్కడి పరిస్థితి ఎంతమాత్రం కాదు. ఇది మొత్తంగా ఆంధ్రప్రదేశ్‌లో రైతుల పరిస్థితి. మరీముఖ్యంగా చిన్న, సన్నకారు కౌలుదారుల పరిస్థితి.

మనరాష్ట్రంలో ఒక్క 2004 సంవత్సరంలోనే 2,115 మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నట్లు ఈ రిపోర్టు మనకు తెలియజేస్తోంది. అంటే రోజుకు అరడజనుమంది చొప్పున ఆత్మహత్యలు చేసుకున్నారు. 1998 నుంచి ఇప్పటివరకు 4,358 రైతులు ఆత్మహత్య చేసుకున్నట్లు తెలుస్తోంది.

రైతుల ఆత్మహత్యలు పత్రికల్లో పతాక శీర్షికలయ్యాయి.

గత దశాబ్ద కాలంలో దేశవ్యాప్తంగా 22 వేలమంది రైతులు (స్త్రీలు, పురుషులు) ఆత్మహత్య చేసుకున్నట్లు తెలుస్తోంది.

వీటికి కారణాలు ప్రపంచబ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్.ల సరళీకరణ,

**ఆంధ్రప్రదేశ్‌లో రైతుల ఆత్మహత్యల వివరాలు**

| సంవత్సరం | 1998 | 1999 | 2000 | 2001 | 2002 | 2003 | 2004 | 2005 | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆత్మహత్యల సంఖ్య | 221 | 200 | 276 | 372 | 446 | 588 | 2,115 | 140 (మార్చి చివరివరకు) | 4,358 |

ప్రైవేటీకరణ విధానాలే అనేది వీరు ఈ రిపోర్టులో మరోసారి నిర్ధారించారు. ఈ వాదనకు బలం చేకూర్చే విధంగానే జయతీఘోష్ నివేదికలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల విధాన విమర్శను ప్రస్తావించారు.

జయతీఘోష్, వివిధ వర్గాల మేధావులు, ఉత్సా పట్నాయక్ అందరూ గుర్తించిన ఉమ్మడి అంశం ఆంధ్రప్రదేశ్‌లో రైతులు తీవ్రంగా అప్పుల పాలయ్యారని.

దీనికి కారణాలు కూడా గుర్తించారు.

1) పెట్టుబడి విపరీతంగా పెరగడం

2) పండించిన పంటకు గిట్టుబాటు ధరలేకపోవడం

3) సరైన సాంకేతిక సలహా సహకారాలు లేకపోవడం

4) బ్యాంకులు, సహకార సంస్థల నుంచి అప్పు పుట్టకపోవడం.

నూతన ఆర్థిక విధానాల్లో భాగంగా రైతును మార్కెట్ దోపిడికి వదిలేయడమే కారణమని తేల్చారు. ఇంత విస్తృతంగా వివిధ వర్గాల రైతులు ఆత్మహత్య చేసుకోవడం కాకతాళీయమో, వ్యక్తిగత సమస్యో ఇంకెంత మాత్రం కాదు. ఇదంతా ప్రపంచబ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్. విధానాల ఫలితమే అని నిర్ధారించారు.

**ప్రపంచ సరళీకరణ నేపథ్యంలో భారతదేశం**

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ సంక్షోభానికి మూల కారణాలుగా రెండిటిని పేర్కోవచ్చు. మొదటిది 1991లో ప్రపంచబ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్‌ల నుంచి షరతులతో తీసుకున్న అప్పయితే, రెండవది డి.ఎఫ్.ఐ.డి.తో కలిసి రూపొందించిన విధానాలు.

దేశస్థాయిలో స్థూలంగా పేర్కొనదగిన కారణం కూడా ఐ.ఎమ్.ఎఫ్. ప్రపంచబ్యాంకులే.

1981 తరువాత తీవ్ర ఆర్థిక మాంద్యం, విదేశీ మారక విలువ పడిపోవడంతో పెట్టుబడులు కూడా నిలిచిపోయాయి. రాజీవ్‌గాంధీ హత్య తదనంతర పరిణామాల నేపథ్యంలో ఏర్పడిన రాజకీయ సంక్షోభ పరిస్థితులలో ఆర్థిక స్థిరీకరణ సాధిస్తామని చెప్పి ఐ.ఎమ్.ఎఫ్, ప్రపంచబ్యాంకులు మనదేశంలోకి వచ్చాయి.

**రూపాయి విలువ తగ్గింపు:**

రూపాయివిలువ 25% తగ్గించడం వలన ఇక్కడి ఉత్పత్తులు చౌకయి ఎగుమతులు పెరగడానికి దోహదపడింది. ఇదికాస్త మిశ్రమ, బహుళ పంటలవిధానం పోయి ఏకపంట విధానంగా వ్యవసాయం మారిపోయింది.

పర్యావరణవేత్త డా॥వందన శివ ప్రకారం 1990ల తర్వాత ఆహారపంటల విస్తీర్ణం 18% తగ్గిపోయింది. వాణిజ్యపంటలైన పత్తి, చెరకు క్రింద 25% విస్తీర్ణం పెరిగింది. 12.8 మిలియన్ టన్నుల ఆహారధాన్యాల ఉత్పత్తి తగ్గిపోయింది. పురుగుమందులు, ఎరువు, నీళ్ళు వాడడం అవసరం పెరిగి ఖర్చు విపరీతంగా పెరిగిపోయింది.

వాణిజ్య సరళీకరణ: వ్యవస్థాగత సర్దుబాట్లతో, అంతర్జాతీయ మార్కెట్‌లో వాటా పద్ధతి రద్దయి దిగుమతి సుంకాలు, పన్నులు తగ్గిపోయి, 1,500 సరుకులపై (ఆహారధాన్యాలతో కలిపి) పరిమాణాత్మక ఆంక్షలు రద్దయి, విదేశీ సరుకుతో ఆంధ్రప్రదేశ్ మొత్తంగా, భారతదేశ మార్కెట్లూ నిండి పోయాయి. ఇక్కడ ఉత్పత్తయిన సరుకు మార్కెట్ పోటీని తట్టుకుని నిలబడలేకపోయింది.

బ్యాంకింగ్‌విధానంలో వచ్చిన మార్పులవల్ల వ్యవసాయానికి బ్యాంకులిచ్చే మొత్తం 1998 నాటికి మొత్తం అప్పుల్లో 43% ఉండగా 2003 నాటికి 26.7%కి పడిపోయిందనే సత్యం ఈ రిపోర్టు ద్వారా తెలుస్తోంది.

**విద్యుత్ సంస్కరణలు:**

పెరిగిన విద్యుత్ చార్జీలకు వ్యతిరేకంగా ఆగస్టు 2000లో పెద్ద ఉద్యమం జరిగితే, ఆ ఉద్యమాన్ని అణిచేయడానికి జరిగిన కాల్పుల్లో ముగ్గురు చనిపోయారు. దాంతో సంస్కరణల వేగం నిలిచిపోయింది. ప్రపంచబ్యాంకు సంస్కరణల వత్తిడి ఒకవైపు ఉంటే, గత ఎన్నికల్లో "ఉచిత విద్యుత్తు" హామీ ఒకానొక కీలక అంశంగా పనిచేసి కాంగ్రెస్ కూటమి గెలవడానికి కారణమయ్యింది. విద్యుత్ ప్రైవేటీకరణ, సబ్సిడీలకోత, చార్జీల పెంపు, ప్రపంచబ్యాంకు అజెండాగా ఉంది.

**ఆంధ్రప్రదేశ్-ప్రపంచబ్యాంకు:**

అంతర్జాతీయ వాణిజ్య సలహానిపుణులైన మెకన్సీ జనవరి 1999లో విజన్ 2020 వ్యూహ పత్రం రూపొందించారు. వ్యవసాయాన్ని యంత్రీకరించి, వ్యవసాయ జనాన్ని పరిశ్రమల్లోకి తరలించాలని సూచించింది. వ్యవసాయాన్ని కూడా వాణిజ్యంగా పరిగణించాలనేది ఉద్దేశ్యం.

కేంద్రస్థాయిలో సాధ్యంకాని విద్యుత్ ఒప్పందాల్ని కూడా రాష్ట్రస్థాయిలో చంద్రబాబు ఆమోదించి, ఆచరణలో పెట్టడం జరిగింది.

**ప్రైవేటీకరణ-డి.ఎఫ్.ఐ.డి:**

బ్రిటిష్ ప్రభుత్వంలోని ఒక విభాగమైనటువంటి అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ (డి.ఎఫ్.ఐ.డి)అభివృద్ధిని పెంచడం, పేదరికాన్ని తగ్గించడం తన లక్ష్యంగా ప్రకటించుకుంది. అది సాధించడానికి సరళీకరణ, ప్రైవేటీకరణ తన లక్ష్యాలుగా ఎన్నుకుంది. జయతీ ఘోష్ డి.ఐఫ్.ఐ.డి పేర్కొన్న అభివృద్ధిని తీవ్రంగానే విమర్శించారని ఈ రిపోర్టులో మనకు తెలుస్తుంది.

**ప్రైవేటీకరణ:**

సెంటర్ ఫర్ గుడ్ గవర్నన్స్‌ను పేదరికం నిర్మూలనకు, ప్రభుత్వ ఆస్తులను లెక్కపెట్టి అమ్మడానికి, మూసేయడానికి, లేక ఉంచడానికి ఇంప్లిమెంటేషన్ సెక్రటేరియట్‌ను డి.ఎఫ్.ఐ.డి ఏర్పాటు చేసింది. వీటి ఆధ్వర్యంలో అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఏవిధంగా ప్రభుత్వరంగసంస్థలను

మూసేయడం, ప్రైవేటు శక్తులకు అమ్మేయడం జరిగిందో ఈ రిపోర్టు ద్వారా మనకు అర్థమవుతుంది. బ్రిటీష్‌వారి ఆడమ్‌స్మిత్ సంస్థ నిపుణులు, ఈ ఇంప్లిమెంటేషన్ సెక్రటేరియట్‌లో సలహాదారులుగా ఉండి ప్రైవేటీకరణ తతంగాన్ని నడపడంలో, వేగవంతం చేయడంలో ప్రముఖపాత్ర వహించారు. డజన్ల కొద్ది ఇటువంటి నిపుణులను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది. వీరిపని ప్రభుత్వ ఆస్తుల అంచనావేయడం, అమ్మేయడం లేదా పునర్వ్యవస్థీకరించడం. ఇటువంటి నిపుణులపేర్ల జాబితా 80 మంది వరకు తన వద్ద ఉన్నట్లు క్రిస్టియన్ ఎయిడ్ తెలియజేస్తోంది. వీరిలో ఎక్కువమంది స్థానికులు కావడం గమనార్హం. ప్రభుత్వ సంస్థల మూసివేత వీరి మార్గదర్శకత్వంలో ఎంత వేగంగా జరిగిందంటే 19 సంస్థలు వెంటనే మూతపడ్డాయి. చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి సంస్థను మూసివేశారు. రాష్ట్ర నీటిపారుదల అభివృద్ధి సంస్థను పునర్వ్యవస్థీకరించారు. ఇలాంటి 43 రాష్ట్ర ప్రభుత్వంచే నడిచే సంస్థలను మూసివేసారు. వాటిలో కొన్నింటిని పునర్వ్యవస్థీకరించడమో, అమ్మేయడమో చేసారు. ఈ రకంగా 45,000 మంది కార్మికులు ఉపాధి కోల్పోయినట్లు ఈ రిపోర్టుద్వారా మనకు తెలుస్తోంది.

"ఇది మొత్తంగా ప్రభుత్వ నిర్ణయాల ప్రవేటీకరణ"గా ప్రొ॥ఘోష్ తన పేపర్‌లో రాసిన మాటల ప్రస్తావన కూడా ఉంది.

**వ్యవసాయంపై సంస్కరణల ప్రభావం:**

ఈ డి.ఎఫ్.ఐ.డికి సంబంధించిన ఇంప్లిమెంటేషన్ సెక్రటేరియట్ ఒక క్రమంలో మొత్తంగా ప్రభుత్వ సంస్థల మూసివేతకు చేసిన ప్రయత్నంలో భాగంగానే, ఎటువంటి సహాయం అందక రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం జరుగుతోందని ఈ రిపోర్టు మనకు స్పష్టం చేస్తోంది.

రైతుల ఇష్టాలు, అవసరాలతో నిమిత్తం లేకుండా మార్కెట్ ఏది అవసరం అనుకుంటే అది పండించే పరిస్థితికి రైతునెట్టివేయబడ్డాడు. దీనికి ఉదాహరణగా రాష్ట్ర విత్తనాభివృద్ధి సంస్థ పనిచేయకుండా పునర్వ్యవస్థీకరించడం వల్ల రైతులు ఏవిధంగా నష్టపోతున్నది మనకు తెలుస్తుంది. అసమవృద్ధి, ప్రాంతీయ అసమానతల గురించి ప్రస్తావన ఉంది.

ప్రత్యామ్నాయాలు చూపించే క్రమంలో డక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ అనుభవాల్ని ఈ రిపోర్టులో పేర్కొన్నారు. మెదక్ జిల్లాలోని 5,000 మంది మహిళారైతులు, వారిలో ఎక్కువ మంది దళితులు సాంప్రదాయక పంటలు, పద్ధతులలో ఎలా తమ జీవన విధానాన్ని నిలుపుకున్నారో మనకు తెలియజేసారు. ఇప్పటివరకు అంటే 2005 వరకు వారు పనిచేస్తూ, ఆచరిస్తున్న విధానంలో రైతులు ఎటువంటి ఆత్మహత్యలకు పాల్పడలేదని డిడిఎస్ పి.వి.సతీష్‌గారి అనుభవాల్ని పొందు పరిచారు.

పొ॥ ఘోష్ మాటల్లో చెప్పాలంటే ఎ.పి.ఆగ్రో, ఎ.పి.విత్తన సంస్థలు నాణ్యమైన విత్తనాలను, కనీస (అందుబాటు)ధరలతో అందించడం వల్ల మార్కెట్‌లో ఆరోగ్యకరమైన పోటీ ఉండేది.

**ముగింపు:**

ఒక ప్రాంతం, ఒకపంట అని కాకుండా దేశవ్యాప్తంగాను, మన రాష్ట్రంలో మరీ ముఖ్యంగా ఇంత పెద్ద ఎత్తున రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం అనేది ఈ ఆధునిక కాలంలో పాలక విధానాల ఫలితమేనని ఈ రిపోర్టు తేల్చి చెప్పింది. అటు కేంద్రప్రభుత్వం, ఇటు రాష్ట్రంలో అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, ఐమ్.ఎఫ్.ఐ. ప్రపంచబ్యాంకు, డి.ఎఫ్.ఐ.డి ద్వారా తన లాభాలకోసం ఏ రకంగా వాడుకుంటోందో స్పష్టం చేసింది.

ఇంకా ఎన్ని ఇటువంటి అధ్యయనాలు, ఇంకా ఎన్ని సంవత్సరాలు, ఇంక ఎందరి చావులు ఈ ప్రపంచం కనువిప్పుకు అవసరమవుతాయోననే వేదన ఈ రిపోర్టు మన ముందుంచింది. ప్రపంచ వ్యాప్తంగా విస్తృత స్థాయిల్లో తమ లాభంకోసం జరుగుతున్న నరళీకరణ విధానాలు, ప్రైవేటీకరణ విధానాలు రైతుల ఆత్మహత్యల కొనసాగింపుకు మూలమని తేల్చి చెప్పింది.

మొత్తంగా రిపోర్టు రైతుల ఆత్మహత్యలకు కారణాలను సూటిగా మనకు మరోమారు తెలియజేసింది.

అంతేకాక క్రిస్టియన్ ఎయిడ్‌వారు బ్రిటిష్ ప్రభుత్వానికి, యూరోపియన్ యూనియన్‌కు, ప్రపంచబ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్.లకు వేరు వేరుగా కొన్ని సూచనలు చేసారు. వాటిపై దృష్టి సారించాలని పిలుపునిచ్చారు.

**బ్రిటిష్ ప్రభుత్వానికి:**

- అంతర్జాతీయ అభివృద్ధి యాక్టు - 2002ను సవరించాలని, వెంటనే సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాలను నిలిపేయాలి.
- ఒప్పంద నియమాలను, విధానాలను మార్చాలని
- చేసిన నిర్ణయాలు పారదర్శకంగా ప్రకటించాలి.
- అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ ప్రయోజనాలను కాపాడుకునే స్వేచ్ఛ కలిగివుండాలి.

**యూరోపియన్ యూనియన్:**

- వాణిజ్య ఒప్పందాలను రద్దు చేసుకునేటప్పుడు అభివృద్ధి చెందుతున్న దేశాలకు నష్టం కలగకుండా చూడాలి.
- పంచదార ఉత్పత్తి చేస్తున్న దేశాలకు నష్టపరిహారంగా 500 మి.యూరోలు చెల్లించాలి.

**ప్రపంచబ్యాంకు-ఐ.ఎమ్.ఎఫ్.లకు:**

- నిర్ణయాలు ప్రజాస్వామ్యయుతంగా ఉండాలి. ఆయా దేశాల ప్రజాస్వామిక ఆకాంక్షలతో ఏర్పడిన విధానాలను బలపరిచేవిగా ఉండాలి.
- ఒప్పందాలు పారదర్శకంగా ఉండాలి.
- ఈ రెండు సంస్థల్లో అభివృద్ధి చెందుతున్న దేశాల భాగస్వామ్యం ఎక్కువగా ఉండేట్లు చూడాలి. ❑

# వ్యవసాయ సంస్కరణల గురించి.....

- వెన్నెలకంటి రామారావు

*(గత సంచిక తరువాయి)*

మొదటగా ఐరోపా తన రేవు పట్టణాల ద్వారా ఉప్పు, వస్త్రాలు, పేలుడు మందు, మద్యం తదితర ఉత్పత్తులను ఆఫ్రికాలో అమ్మి బదులుగా బానిసలను కొనుగోలు చేసి ఐరోపా, అమెరికా దేశాలకు తరలించి అమ్మగా వచ్చిన డబ్బుతో చక్కెర, వెండి, మొలాసిస్, పొగాకు కొనుగోలు చేసి తిరిగి ఐరోపాకి తరలించేవారు. దీన్ని ముక్కోణపు వ్యాపారం అనేవారు. దాంతో యూరప్ వాణిజ్య వర్గం నూతన ఆస్తిపర వర్గంగా ముందుకు రాసాగింది. ఫ్యూడల్ సమాజ సామాజిక సంక్షోభానికి పరిష్కారంగా సాధారణంగా ఆ వ్యవస్థలో చోటుచేసుకునే వికేంద్రీకరణ ప్రక్రియను అమెరికాలోని సారవంతమైన భూములు మందగింపచేశాయి. ఫ్యూడల్ కేంద్రీకరణ ప్రక్రియను బూర్జువా వర్గం నాయకత్వాన గల నూతన సామాజిక వర్గాలు ఢీ కొన్నాయి. ఫ్రెంచ్ బూర్జువా విప్లవ ఫలితంగా నెపోలియన్ బోనపార్టీ నాయకత్వాన ''దున్నేవానికే భూమి'' నినాదంతో భూ వికేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలను అమలు చేశాడు. అదే సమయంలో ఫ్రెంచ్ జాకోబియన్ క్లబ్బు సభ్యుడైన టిప్పుసుల్తాన్ భారతదేశంలో కూడా వికేంద్రీకరణ రూపంలోనే భూ సంస్కరణలు అమలు చేశాడు. అయితే యూరప్‌లోని అన్ని దేశాలలో ఈ వికేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలు ఉనికిలోకి రాలేదు. యూరప్ ఫ్యూడల్ సమాజ సంక్షోభం వికేంద్రీకరణ ప్రక్రియకు పెద్ద ఎత్తున లోను కాకుండానే అమెరికా ఖండపు సంపద కోసం తరలి వెళ్ళడం వలన, విదేశీ వాణిజ్యంతో ప్రపంచ మార్కెట్ రూపొందడం వలన, నూతన సామాజిక శక్తులైన పెట్టుబడిదారీ కేంద్రీకరణకు అవకాశం కలిగింది. ప్రపంచ మార్కెట్ యూరప్‌కు బూర్జువా వర్గపు పునాదిగా నూతన కేంద్రీకరణ ప్రక్రియకు ఆలంబనగా నిలిచింది. వ్యవసాయ పారిశ్రామిక రంగాలలోని ఆస్తి సంబంధాలు, శ్రమ సంబంధాలు, పంపిణీ సంబంధాల కేంద్రీకరణ పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలో ఆర్థికేతక అణచివేత పునాదిగా సాగితే, పెట్టుబడిదారీ విధానంలో ఆర్థిక అణచివేత పునాదిగా, ప్రపంచ మార్కెట్ నియమాల పునాదిగా సాగుతుంది. భారీ పరిశ్రమలు, భారీ వ్యవసాయం ఉనికిలోకి వచ్చి చేతిపని వారిని యంత్ర సాధనాల నుండి, రైతాంగాన్ని భూమి నుండి దూరం చేశాయి. మళ్ళీ నగరాలలో జనాభా కేంద్రీకరణ విచక్షణారహితంగా పెరిగింది. ఆర్థిక, పర్యావరణ విపత్తులు తిరిగి సామాజిక సంక్షోభాన్ని ఉనికిలోకి తెచ్చాయి.

విడి విడి ద్వీపాలుగా ముకుళిత ఆర్థిక వ్యవస్థలుగా వున్న ఫ్యూడల్ సమాజం స్థానంలో ఒకే ఒక ప్రపంచ ఆర్థిక వ్యవస్థగా రూపొందిన పెట్టుబడిదారీ సామాజిక వ్యవస్థ ఆవిర్భవించింది. యూరప్‌లో పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ప్రపంచం నలుమూలల్లోని పెట్టుబడిదారీ పూర్వ సామాజిక వ్యవస్థలతో సంశ్లేషించబడి ఒకే ఒక ప్రపంచ ఆర్థిక వ్యవస్థగా అవతరించింది. ఈ సంశ్లేషణ పెట్టుబడిదారీ సంబంధాల పునాదిగా సాగడం వలన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ యొక్క కేంద్ర ప్రాంతంగా పెట్టుబడిదారీ సమాజాలు;

ప్రపంచ ఆర్థిక వ్యవస్థ పొలిమేర ప్రాంతాలుగా పెట్టుబడిదారీ పూర్వ సామాజిక సంబంధాలు గల ప్రాంతాలు నిలిచాయి. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కేంద్రానికి, పొలిమేరకు మధ్యగల గతి తర్కంను పరిశీలిద్దాం. ఇవి రెండూ పరస్పర పూరకాలు, పరస్పరాధారితాలు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కేంద్రంలోని పెట్టుబడిదారీ సంబంధాలు స్వేచ్ఛాయుత పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదంగా పరిణామం చెందితే దానికి అనుమేయంగా వున్న పొలిమేర ప్రాంతాలు కూడా వలస, అర్థ వలస, నయావలస ఆర్థిక వ్యవస్థలుగా పరిణామం చెందాయి. కేంద్రంలో గుత్త పెట్టుబడిదారీ విధానం కొనసాగితే, పొలిమేర ప్రాంతాలలో బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారీ విధానం కొనసాగుతుంది. ప్రపంచ మార్కెట్ రూపొందిన నాటినుండి సంపద కేంద్రీకరణ వివిధ చారిత్రక సందర్భాలలో కేంద్రంలోనూ, కేంద్రానికి అనుమేయంగా వున్న పొలిమేరలలోను నూతనంగా తలెత్తే సామాజిక శక్తుల పునాదిగా జరుగుతోంది. అధికోత్పత్తి సంక్షోభాలు, పర్యావరణ సంక్షోభాలు వెరసి సార్వత్రిక సామాజిక సంక్షోభాలుగా బ్రద్దలవుతాయి. ప్రపంచ యుద్ధాలు, విప్లవాలు సార్వత్రిక సంక్షోభ ప్రతిఫలంగా వచ్చాయి, వస్తున్నాయి, వస్తాయి. పెట్టుబడిదారీ వ్యవస్థలు పారిశ్రామికంగా ఎంత అభివృద్ధి చెందినప్పటికి ప్రాథమికంగా వ్యవసాయక ఉత్పత్తి సంబంధాల ప్రాతిపదికపైన వాటి సామాజిక సంక్షోభాలు పరిష్కరింపబడతాయి.

ఈ నేపథ్యం నుండి పరిశీలిస్తే ఒక వ్యవస్థ వికాసం చెందేందుకు కేంద్రీకరణ రూపంలో భూ సంస్కరణలు, వికేంద్రీకరణ రూపంలో భూ సంస్కరణలు రెండు భిన్న చారిత్రక సందర్భాలలో భిన్న పాత్రల్ని పోషిస్తాయి. భూ వికేంద్రీకరణ లేక భూ పంపిణీ రూపంలోని భూ సంస్కరణలు మాత్రమే సమాజ అభివృద్ధికి తోడ్పడతాయని, భూకేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలు సొంత ఆస్తి

పెంపుదలకు మాత్రమే తోడ్పడతాయని సూత్రీకరించడం తప్పు.

ఫ్యూడల్ భూ కేంద్రీకరణను బ్రద్దలు చేసి, ప్రజల చేతిలోకి భూమి వస్తే మార్కెట్ కార్యకలాపాల్లో భాగంగా వ్యవసాయపు ఖర్చులు పెరగడంతో అనివార్యంగా పెట్టుబడిదారుల చేతుల్లోకి భూ కేంద్రీకరణ జరుగుతుంది. ఇక్కడ భూ వికేంద్రీకరణ పెట్టుబడిదారీ కేంద్రీకరణ లక్ష్యంతోనే సాగుతుంది. అదే విధంగా రెండవ ప్రపంచ యుద్ధానంతరం జపాన్‌లోను, తైవాన్, కొరియాలలో 'దున్నేవానికి భూమి' నినాదంతో అమెరికా భూ సంస్కరణలు చేపట్టింది. ఇది కూడా పెట్టుబడిదారీ భూ కేంద్రీకరణ లక్ష్యంగా ఉంది. అదే విధంగా కమ్యూనిస్టు పార్టీలు దున్నే వానికి భూమి నినాదంతో జరిపే పోరాటం, సంస్కరణ లక్ష్యం సామూహిక భూ కేంద్రీకరణ కొరకే. వ్యక్తిగత ఆస్తి పునాదిగా గల భూ కేంద్రీకరణకు సామూహిక ఉమ్మడి ఆస్తి పునాదిగా గల భూ కేంద్రీకరణకు చాలా తేడా వుంది. వ్యక్తిగత ఆస్తి పునాదిగాగల భూ కేంద్రీకరణ రైతాంగాన్ని భూమినుండి దూరం చేయడం ద్వారా పట్టణీకరణను పెంచి వేసి, ప్రకృతి-సమాజాల మధ్యగల ఆదాన ప్రదాన ప్రక్రియకు గండి కొట్టడం ద్వారా సామాజిక సంక్షోభాలకు కారణమవుతుంది. సామూహిక, ఉమ్మడి ప్రాతిపదికన గల భూ కేంద్రీకరణ సామాజిక సంక్షోభాన్ని నివారించి, వికాసం వైపుకు నడిపిస్తుంది.

ప్రకృతి సంపదల వైవిధ్యత, ఆవశ్యకత, అవసరాల పర్యవసానంగా ఉత్తరార్ధగోళంలో 15 శతాబ్దం చివరి దశాబ్దం, 16వ శతాబ్దం మొదటి దశాబ్దంలో ప్రప్రథమంగా పెట్టుబడిదారీ విధానం విశ్వ వ్యాపిత వ్యవస్థ గానే ఆవిర్భవించింది. దక్షిణార్ధగోళ ప్రాంతంలోని అపారమైన జీవ వైవిధ్యత అక్కడ వ్యవసాయ సమాజాల ఆవిర్భావానికి, వికాసానికి అదే సమయంలో అనేక పెట్టుబడిదారీ పూర్వ సంబంధాల సమాజాలు కదం తొక్కుతూ కొనసాగడానికి ప్రబల, ప్రధాన కారణంగా ఉంది. దక్షిణార్ధగోళ పెట్టుబడిదారీ పూర్వ సమాజాలపై ఆధారపడే ఉత్తరార్ధగోళ పారిశ్రామిక సమాజాలు విశ్వవ్యాపిత స్వభావంతో, సంబంధాలతో వెలుగులోనికి వచ్చాయి. ఈ వ్యవసాయక దేశాల సహజ వనరులు, పర్యావరణ వ్యవస్థలు పెట్టుబడిదారీ దేశాల అభివృద్ధికి తోడ్పడేవిగానూ, కేవలం అనుబంధాలుగానూ మిగిలిపోయాయి. వాటి పెట్టుబడిదారీ పూర్వ సంబంధాల స్వభావం ప్రపంచ ఆర్థిక వ్యవస్థ చట్రానికి అనుగుణంగా పరిణామం చెందింది. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిలోని అన్ని దశలు - వాణిజ్య విధానం, ప్రాథమిక రూపంలో ఉన్న పారిశ్రామిక విధానాలు, గుత్తపెట్టుబడిదారీ విధానం అన్నీ కూడా ఈ భూగోళం పై విస్తృతమైన ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అంతర్భాగాలుగా - వలస, అర్థ వలస, నయావలసలుగా ఉన్నాయి. ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలలోని సామాజిక సంక్షోభంతో జరగాల్సిన వికేంద్రీకరణ ప్రక్రియ క్రమం, పొలిమేర ప్రాంతాలైన దక్షిణార్ధగోళ దేశాల ఉత్పత్తి సంబంధాల సంశ్లేషణతో ఉపశమించింది. ఆస్తి సంబంధాలు, శ్రమ సంబంధాల వికేంద్రీకరణ తాత్కాలికంగా నిలువరించబడింది. ముకుళిత ఫ్యూడల్ ఆర్థిక వ్యవస్థలోని దేశవాళీ అదనపు విలువ సమీకరణ స్థానంలో, ప్రపంచ స్థాయి అదనపు విలువ సమీకరణ క్రమం ఆవిర్భవించింది. ఈ నేపథ్యం నుండి పరిశీలిస్తే ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కేంద్ర ప్రాంతమైన పారిశ్రామిక దేశాలలో కేంద్రీకరణ ప్రక్రియ క్రమం కొనసాగుతూ ఉంటే, పొలిమేర ప్రాంతమైన దక్షిణార్ధగోళ వ్యవసాయక దేశాలలో వికేంద్రీకరణ ప్రక్రియ క్రమం కొనసాగుతూ ఉంది. దక్షిణార్ధగోళ దేశాలలో స్థానిక పెట్టుబడిదారీ పూర్వ అదనపు విలువ సమీకరణ క్రమం స్థానంలో బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారీ అదనపు విలువ సమీకరణ క్రమం ఆవిర్భవించింది. సామ్రాజ్యవాద పెట్టుబడి, దళారీ బూర్జువా వర్గ పెట్టుబడి, భూస్వామ్య పెట్టుబడి, ప్రభుత్వ పెట్టుబడులు సంశ్లేషించబడిన రూపంలోని బ్యూరాక్రటిక్ పెట్టుబడి ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలలోని ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానం యొక్క గుత్త పెట్టుబడికి కొనసాగింపుగా ఉంటుంది.

పెట్టుబడిదారీ విధానం విశ్వవ్యాపితంగా విస్తరించే కొద్దీ అనివార్యంగా శ్రమ విభజన అంతర్జాతీయ స్వభావం సంతరించుకోసాగింది. ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలలో మితిమీరిన పారిశ్రామికీకరణ, మితిమీరిన సంపద, కేంద్రీకరణ జరుగగా, పొలిమేర ప్రాంతాలైన దక్షిణార్ధగోళ వ్యవసాయక దేశాలు పారిశ్రామిక దేశాలకు చౌకగా అవసరమైన ముడిసరుకులు, శ్రమ శక్తిని సరఫరా చేసేవిగానూ, మితిమీరిన పారిశ్రామిక వస్తువులకు మార్కెట్లగానూ, ప్రపంచ పారిశ్రామిక విషపూరిత వ్యర్థాలను పారివేస్తే చెత్తకుండీలుగానూ, మితిమీరిన నిరుద్యోగం, కరువుకాటకాలకు నిలయాలుగానూ, మితిమీరిన వ్యాపార, సెక్స్ సంస్కృతి, వ్యాపారాలకు ఆలవాలంగా మిగిలిపోయాయి. ఫలితంగా దక్షిణార్ధగోళ వ్యవసాయక సమాజాల భాష, సంస్కృతి, ఆర్థిక, పర్యావరణ వ్యవస్థలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. "ప్రపంచ సంపదలో అధిక భాగం భూమధ్య రేఖకు ఉత్తరం వైపు కేంద్రీకృతం కాగా, జనాభా దక్షిణ భాగంలో కేంద్రీకృతమైంది" అని కామనర్ అనే అమెరికన్ పర్యావరణ వాది అంటారు. ఈ సంపద కేంద్రీకరణకు అనుగుణంగా దక్షిణార్ధగోళ పారిశ్రామిక, వ్యవసాయక సంబంధాలు, అర్థవలస, అర్థ భూస్వామ్య రూపాన్ని సంతరించుకున్నాయి. పారిశ్రామికంగా జాతీయ బూర్జువా వర్గం ధ్వంసం అవుతుంది. వ్యవసాయ రంగంలో భూస్వామ్య వర్గం వద్ద సంపద కేంద్రీకరణ జరగకుండా బ్యూరాక్రటిక్ పెట్టుబడిలో అంతర్భాగమైన హైబ్రిడ్ భూస్వాముల వద్ద (వ్యవసాయ ఉత్పత్తి

కారకాల, ఉత్పత్తుల వ్యాపారాలు, వడ్డీ వ్యాపారాలతో ఎదిగిన నయా భూస్వామ్య వర్గం) అదనపు విలువ సమీకరణ సాగుతుంది. ఈ హైబ్రిడ్ భూసామ్య వర్గం అంతర్జాతీయ గుత్త పెట్టుబడికి స్థానిక ప్రాతినిధ్యం వహిస్తుంది. దాంతో గ్రామాలలో సాంప్రదాయక అర్థంలో భూస్వాములు కనపడరు. ప్రత్యక్ష భూస్వాములు అంతరించి, ఆ స్థానంలో పరోక్ష భూస్వాముల మరియు ముఖ్యంగా భూస్వామ్యశ్రమ సంబంధాలు - అంటే ఉత్పత్తి వైయక్తికంగా జరగడం (రైతాంగం విడివిడిగా చిన్న కమతాలలో వ్యవసాయం చేయడం) రూపంలో ఉండే హైబ్రిడ్ భూస్వామ్య విధానం దక్షిణార్ధగోళ దేశాలలో రూపుదిద్దుకుంది. అందుకే మనదేశ వ్యవసాయరంగంలో చిన్న కమతాలు 80 శాతం ఉన్నాయి. అంతర్జాతీయ పెట్టుబడి చొచ్చుకుని పోయిన ప్రతిచోట స్థానిక పూర్వ పెట్టుబడిదారీ సంబంధాలన్ని అంతర్జాతీయ అదనపు విలువ సమీకరణ యంత్రాంగంలో భాగంగా పరిణామం చెందాయి. వ్యవసాయక ఆస్తి సంబంధాల రీత్యా వేలాది ఎకరాలు సొంతంగా కలిగి, కౌల్దారీ వ్యవసాయ ఉత్పత్తి చేస్తూ అంతర్జాతీయ పెట్టుబడి చలనంలో అంతర్భాగమైన భూస్వామ్యం; అదే సమయంలో వ్యవసాయక శ్రమ సంబంధాల రీత్యా చిన్న చిన్న కమతాల్ని సొంతంగా కలిగి సన్నకారు వ్యవసాయదారులుగా ఉంటూ అంతర్జాతీయ పెట్టుబడి చలనంలో అదనపు విలువను కోల్పోతూ, ఉత్పత్తి వైయక్తికంగా ఉండే శ్రమ సంబంధాల రూపంలో ఉండే రెండు రకాల భూస్వామ్యం దక్షిణార్ధగోళ వ్యవసాయ దేశాలలో రూపొందింది.

ఈ నేపథ్యం నుండి చరిత్రలో భూకేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలు గానీ, భూ వికేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలు గాని, బానిస, ఫ్యూడల్, పెట్టుబడిదారీ సామాజిక వ్యవస్థలలోనూ, అదేవిధంగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థ యొక్క కేంద్ర ప్రాంతాలైన ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలలోనూ, పొలిమేర ప్రాంతాలైన దక్షిణార్ధగోళ వ్యవసాయక దేశాలలోనూ సొంత ఆస్తి ప్రాతిపదికన జరిగినవే. రెండు సంస్కరణల రూపాలు వివిధ చారిత్రక సందర్భాలలో అభివృద్ధికర, అభివృద్ధి నిరోధక పాత్రలు పోషించాయి. అయితే పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలో ఈ సంస్కరణలు బలవంతపు సమీకరణగా అంటే ఆర్థికేతర అణచివేతగా సాగితే పెట్టుబడిదారీ విధానంలో ఆర్థిక అణచివేత రూపంలో సాగాయి.

ప్రపంచ బ్యాంకు తన రుణ సహాయంతో రుద్దే సంస్కరణల లక్ష్యం దక్షిణార్ధగోళ వ్యవసాయక దేశాల ఆహార స్వయం పోషకత్వాన్ని దెబ్బతీసి, వ్యవసాయం బహుళజాతి సంస్థలపై ఆధారపడేలా స్థానిక, సాంప్రదాయక వ్యవసాయోత్పత్తుల ఉత్పత్తిని దెబ్బతీసి, ఎగుమతి ఆధారిత ఒకే వ్యాపార పంటపై ఆధారపడేటట్లు మార్చివేస్తుంది. ప్రపంచ పొలిమేర వ్యవసాయక దేశాల వ్యవసాయక రంగం కేంద్రప్రాంత పారిశ్రామిక దేశాల బహుళజాతి సంస్థలకు అనుబంధంగా మారిపోయింది. దీనికోసం పొలిమేర దేశాలలో కాంట్రాక్టు వ్యవసాయం, కార్పొరేట్ వ్యవసాయం అనే భూకేంద్రీకరణ పద్ధతులని స్థానిక పాలకుల ద్వారా అమలు చేస్తుంది. అందుకోసం సబ్సిడీలను ఎత్తి వేసింది. వ్యవసాయక ఉత్పత్తి కారకాల ఖర్చు పెరిగిపోవడం, మార్కెట్ సన్నకారు రైతాంగం దివాలా తీయడంతో పెద్ద కమతాలలో వ్యవసాయం లాభసాటిగా మారిపోయి, హైబ్రిడ్ భూస్వాములు తలెత్తారు. లేకపోతే బహుళజాతి కంపెనీల చేతిలో వేలాది, లక్షలాది ఎకరాలు పోగవుతాయి. చారిత్రక పరిమాణాన్ని పరిశీలిస్తే రెండవ ప్రపంచ యుద్ధానంతర దశలో ముఖ్యంగా అమెరికాలో అభివృద్ధి చెందిన వ్యవసాయ శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం హరిత విప్లవ అవతార మెత్తడంతో విశాలమైన భూకమతాలలోని కార్పొరేట్ సేద్యం, కృత్రిమ రసాయనిక ఎరువులు, పురుగు మందుల వాడకంతో ఆహార ధాన్యాల దిగుబడి విపరీతంగా పెరిగి కోట్లాది టన్నులు అధికోత్పత్తి జరిగింది. ఇది వ్యవసాయోత్పత్తుల మార్కెట్‌ని సంక్షోభంలోనికి నెట్టింది. దీనికి పరిష్కారంగా మార్కెట్ రేట్లకోసం లక్షలాది టన్నులను సముద్రంలో పారవేయడమో లేక ప్రపంచ యుద్ధ దేశాలకు, వెనుకబడిన దేశాలకు ఎగుమతి చేయడమో జరిగింది. ఈ నేపథ్యంలో, వ్యవసాయోత్పత్తులకు, వ్యవసాయోపకరణాలకు, ఎరువులు, పురుగుమందులు, మార్కెట్ సజావుగా సాగేందుకు దక్షిణార్ధగోళ వ్యవసాయక దేశాలలో భూ వికేంద్రీకరణ రూపంలో భూ సంస్కరణలు జరగకుండా, మార్కెట్‌కు అనుగుణంగా హైబ్రిడ్ భూస్వామ్యాన్ని సృష్టించింది. కొన్ని దేశాల ఆహార స్వయం సంమృద్ధిని దెబ్బతీసి ఏకపంట దేశాలుగా వాటిని మార్చివేసి తన కబంధహస్తాలలోనికి ఇరికించుకుంది.

1990 నాటికి అమెరికాలాంటి పారిశ్రామిక దేశాలలో వ్యవసాయ ఉత్పాదకత పడిపోయి, భూసారం దెబ్బతిని తెగుళ్ళను నియంత్రించలేక పోవడం లాంటి పర్యావరణ సమస్యలు పెరిగిపోయాయి. ఇంకొకవైపు ప్రపంచ వ్యవసాయోత్పత్తుల, వ్యవసాయోపకరణాల, విత్తనాల వాణిజ్యాన్ని నియంత్రించే అతి పెద్ద కార్పొరేట్ సంస్థలు ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలలో వెలిశాయి. దాంతో అవి తమ కార్యకలాపాలను వ్యవసాయ ఉపకరణాల రంగంలోనే కాకుండా వ్యవసాయోత్పత్తి రంగంలోకి మళ్ళించాయి. దాంతో దక్షిణార్ధగోళ దేశాల వ్యవసాయ రంగంలోకి కాంట్రాక్టు వ్యవసాయం, కార్పొరేట్ వ్యవసాయం రూపంలో బూరాక్రటిక్ క్యాపిటలిజం దూసుకొచ్చేస్తుంది. బ్యూరాక్రటిక్ పెట్టుబడి పునాదిగా పెద్ద కమతాల రూపంలో భూమి కేంద్రీకరణ జరుగుతుంది. పాత భూ సమీకరణాల రూపంలో కొత్త భూ సమీకరణలు చోటు చేసుకుంటాయి. ఈ మార్పుకు భూ

వికేంద్రీకరణ రూపంలో భూ సంస్కరణలు పాలక వర్గాలకు చక్కగా ఉపయోగపడతాయి. ఆర్థికేతర అణచివేత రూపంలో భూకేంద్రీకరణ స్థానంలో కాంట్రాక్టు వ్యవసాయం ద్వారా కార్పొరేట్ వ్యవసాయ రూపంలోను ఆర్థిక అణచివేత మార్గంలో భూకేంద్రీకరణ సాగుతుంది. అంటే వ్యవసాయంలో నష్టాలు పెరిగేకొద్దీ చిన్న కమతాలు రైతాంగం యొక్క భుజాన శిలువలలాగ మారి భరించలేనివిగా తయారై పొలాల్ని తెగనమ్ముకోవలసిన పరిస్థితి వస్తుంది. వ్యవసాయోత్పత్తి ఖర్చు పెరిగే కొద్దీ పెద్ద కమతాలలో అధిక దిగుబడులనిచ్చే శాస్త్ర సాంకేతిక, ఆధునిక ఉపకరణాలతో చేస్తేగాని మిగులు వుండని పరిస్థితి ఏర్పడుతుంది. అంతర్జాతీయ మార్కెట్ అవసరాలకు గాను ముఖ్యంగా సముద్ర, నదీతీర, నీటి ప్రాజెక్టుల ప్రాంతాలలో కార్పొరేట్ వ్యవసాయం అవతరించి భూకేంద్రీకరణ సాగుతుంది. బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారీ భూకేంద్రీకరణ రూపం అది. భూ సంస్కరణలు (వికేంద్రీకరణ రూపం, కేంద్రీకరణ రూపం) ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అవసరాలకనుగుణంగా వాటి ప్రతిఫలంగా ఉనికిలోకి వస్తాయి. అంతేగాని పాలకుల ఇష్టానుసారంగా మార్చగలిగేవి కావు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కేంద్రాలైన ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలకు అనుబంధంగా మాత్రమే పొలిమేర ప్రాంతాలైన దక్షిణార్ధగోళ వ్యవసాయక దేశాలలో భూసంస్కరణలు చోటుచేసుకుంటాయి. అంతేగాని ఏ దేశానికాదేశం యొక్క రాజకీయార్థిక కార్యకలాపంగా ఉండదు. ఒకవేళ ఆ దేశ పాలకులు రాజకీయ సమీకరణల నేపథ్యంలో ఆయా దేశాలలో భూసంస్కరణల చట్టాలు చేసినా అవి అమలుకు నోచుకోక ప్రపంచార్థిక అవసరాల రీత్యానే భూ సంబంధాలు కొనసాగుతాయి.

మన దేశంలోని భూసంస్కరణల చట్టం భోగట్టాను ఈ నేపథ్యం నుండి బాగా అర్థం చేసుకోవచ్చు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కేంద్రంలో కొనసాగుతున్న గుత్త పెట్టుబడిదారీ విధానం భూ కేంద్రీకరణ సంస్కరణలతో ప్రపంచ వ్యవసాయోత్పత్తిలో అధికోత్పత్తిని సాధించింది. ఈ అధికోత్పత్తికి తగిన మార్కెట్ లేక పంటలకు సెలవు ప్రకటించడాలు; ఆహార ధాన్యాలను సముద్రంలో పారబోయడంలాంటి చర్యలను ఆయాపాలక వర్గాలు చేపట్టాయి. ప్రపంచ ఆహార ధాన్యాల అధికోత్పత్తి సంక్షోభం పొలిమేర ప్రాంత దేశాలలో భూ కేంద్రీకరణ రూపంలోనూ, ప్రపంచ మార్కెట్ అవసరాలకు ఉపయోగపడే ఎగుమతి ఆధార వాణిజ్య పంటల విషయంలో భూ కేంద్రీకరణ రూపంలోను సంస్కరణలను అమలు చేసింది.

ప్రపంచ బ్యాంకు తను అడుగుపెట్టిన చోటల్లా వ్యవసాయంపై ఆధారపడే గ్రామీణ జనాభాను తగ్గించి పరిశ్రమలకు చౌక శ్రమశక్తి దొరికే విధంగా వ్యవసాయ రంగంలో కార్పొరేటీకరించడానికి అనువుగా భూకేంద్రీకరణ సంస్కరణలను అమలు చేయిస్తోంది. పట్టణ జనాభా పెరిగేకొద్దీ వాళ్ళకు ఉపాధి కల్పించలేని దౌర్భాగ్యస్థితిలో వున్న బ్యూరాక్రటిక్ పారిశ్రామిక రంగం కోట్లాది మంది సాపేక్ష అదనపు జనాభాను సృష్టిస్తుంది. ఒకవైపు సమాజపు చారిత్రక చోదక శక్తిని కేంద్రీకృతం చేస్తూనే, మరోవైపు మనిషికి, నేలకు గల పదార్థ ఆదాన - ప్రదాన క్రమాన్ని చెదరగొడుతోంది. అంటే మనిషి తిండి, బట్ట రూపంలో వాడే నేలలోని మూలకాలను మళ్ళీ నేలకు తిరిగి చేరకుండా నివారిస్తుంది. కాబట్టి సుస్థిర భూసారానికి కావలసిన పరిస్థితుల్ని అతిక్రమిస్తుంది. పదార్థ ఆదాన ప్రధాన క్రమానికై సహజసిద్ధంగా వృద్ధి చెందిన పరిస్థితులను తారుమారు చేస్తూనే ఒక వ్యవస్థగా, సామాజిక ఉత్పత్తిని క్రమబద్ధం చేసే నియమంగా, మానవ జాతి సంపూర్ణ వికాసానికి తగిన రూపంలో ఆదాన ప్రదాన క్రమాన్ని పునరుద్ధరించవలసిన మేర దాని ఆవశ్యకతని కల్పిస్తుంది. బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారీ విధానం జాతీయ పరిశ్రమల్ని ధ్వంసం చేయడంతో పట్టణంలో పెరిగిపోతున్న జనాభా రోమన్ బానిస యాజమాన్య వ్యవస్థ దివాళా తీసిన రైతాంగం నగరాలకుచేరి వర్గ భ్రష్ట బికారి గాలిమూకలాగ, వ్యవస్థ మెడలో గుదిబండలాగ తయారైనట్టి పరిస్థితులు అలుము కుంటున్నాయి. ఉచ్ఛరార్థ పారిశ్రామిక దేశాలలో పెట్టుబడిదారీ విధానం ప్రారంభంలో జరిగినట్లుగా భూకేంద్రీకరణ, పట్టణ జనాభా కేంద్రీకరణ చారిత్రక చోదక శక్తిగా ఈ పొలిమేర ప్రాంత వ్యవసాయక దేశాలలో జరగదు.

అమెరికా, జపాన్ తదితర దేశాలలో వ్యవసాయాభివృద్ధి క్షీణించింది. భారీ కమతాలలో ఉత్పత్తి తగ్గడమేకాక ఒకే పంట సాగు వల్ల క్రిమి, కీటకాల బెడదను నిరోధించలేని స్థితి; కోట్లాది టన్నుల భూసారం ఆ నేలకు తిరిగి చేరకుండా పరాయీకరింపబడడం, దాన్ని సవరించుకునేందుకు కృత్రిమ ఎరువుల వాడకం పెరగడంతో, ఉత్పాదకత గణనీయమైన స్థాయిలో పడిపోయింది. దానితో ఆ ప్రాంతాలలో చిన్న కమతాల సేద్యానికి రైతుల్ని ప్రోత్సహిస్తున్నారు. అదే సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ప్రపంచ వాణిజ్య సంస్థ ద్వారా మనలాంటి దేశాలలో కార్పొరేట్ వ్యవసాయాన్ని (హరిత విప్లవం, జన్యు విప్లవం పేరు మీద) క్రూరంగా ప్రవేశపెడుతున్నారు. సామాజిక, ఆర్థిక, పర్యావరణ సంక్షోభాలలోకి దక్షిణార్ధ గోళ దేశాలను తోయడం ద్వారా, తాము సంక్షోభంలోంచి బయటపడేందుకు కుటిల ప్రయత్నాలు చేస్తున్నారు. 138 సంవత్సరాల క్రితం మార్క్స్ పెట్టుబడిదారీ వ్యవసాయంపై చేసిన విశ్లేషణ నేటికీ అత్యంత సమంజసంగా వుంది.

**(తరువాయి వచ్చే సంచికలో)**

# ఆఫ్రికా దేశాల దుస్థితి-సంపన్న దేశాల సహాయ పథకం

- ఆర్.వి.ఆర్. చంద్రశేఖర రావు

**ప్రపంచంలో అన్ని సంపన్న దేశాలైన జి-8 దేశాలు (అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మని, జపాన్, రష్యా, కెనడా, ఇటలీ, ఆఫ్రికా ఖండంలోని దేశాలకు ఒక బృహత్తర ఆర్థిక పథకాన్ని ఆమోదించబోతున్నాయి. వచ్చేనెల బ్రిటన్ (స్కాట్‌లాండ్‌లోని గ్లెన్ ఈగల్స్) లో సమావేశం కానున్న జి-8 దేశాల శిఖరాగ్ర సమావేశంలో ఇది ఖరారు కానున్నది. ఐతే ఈ సమావేశంలో రష్యాపాల్గొనడం లేదు.**

ఈ బృహత్తర పథకం ద్వారా ఆఫ్రికాకు చెందిన అతివెనుకబడిన దేశాలకు రుణ విముక్తి లభించబోతున్నది. ఈ పథకం ప్రకారం, 40 బిలియన్ డాలర్లమేరకు 18 దేశాల రుణాలను మాఫీ చేయడం, ఇదికాక రాబోయే 10 ఏళ్ళలో 25 బిలియన్ డాలర్ల ఆర్థిక సహాయాన్ని ఈ దేశాలకు అందజేయడం జరుగుతుంది. ఈ 18 దేశాలలో 14 ఆఫ్రికాకు చెందినవే. ఈ ఆఫ్రికా దేశాలు ప్రస్తుతం ఆర్థికంగా అట్టడుగున ఉన్న దేశాలు.

ఈ దేశాలను ఇప్పటివరకు కుంగదీసిన, ఆర్థిక సంక్షోభాలకే గాక, జాతీయ సమగ్రతకు సామాన్య ప్రజలు కనీస మానవహక్కులను అనుభవించడానికి, సవాళ్ళు తయారయ్యాయి. ఒకప్రక్క నిరంతర కరువుకాటకాలు, మరోపక్క తీవ్రమైన అంతర్యుద్ధాలు, వేరోపక్క శతాబ్దాలుగా ఉన్న అత్యంత బీదరికం కారణాలుగా ఆఫ్రికాలోని పలుదేశాల దైన్యస్థితి మానవత్వ విలువలకే సిగ్గు చేటుగా ఉంది.

ఈ పరిస్థితికి ముఖ్యమైన కారణం గత 150 ఏళ్ళు పైగా స్వైర విహారం చేసిన సామ్రాజ్యవాద వ్యవస్థ ఇంచుమించుగా ఆఫ్రికా ఖండాన్నంతటిని తమ పెరడుగా మార్చింది. యూరోపుదేశాల పెట్టుబడి దారి విధానాన్ని పురస్కరించుకొని ఆ ఖండాన్ని చిన్నాభిన్నం చేశారు. ఈ దారుణ ఉదంతం ఆఫ్రికా విభజన అనే పేరుతో జరిగింది. చరిత్రాత్మకంగా ఆఫ్రికా ఖండానికి జరిగిన అన్యాయం ఇంకే ఖండానికి దాపురించలేదు. ఆధునికతకు ఆదినుంచి దూరమైన ఈ ఖండం మధ్యయుగాలలో అరబ్బుల బానిస వ్యాపారానికి ఆలవాలమైంది. యూరపుదేశాలు ఆసియాపై దృష్టి సారించినప్పటి నుండి వారి రాకపోకలకు ఆఫ్రికా కోస్తా ప్రాంతాలు యూరోపియన్ల స్వాధీనంలోనికి వచ్చాయి.

ఆసియా, ఆఫ్రికా ఖండాల, పాశ్చాత్య వలస, సామ్రాజ్యవాద విస్తరణలోని తారతమ్యాలను గుర్తించడం అవసరం

1. యూరపియను సామ్రాజ్య విస్తరణ ఆసియా అంతటిలో జరగలేదు. చైనా, జపాన్, మధ్య ఆసియా ప్రదేశాలలో రాజకీయాధి పత్యం కుదరలేదు.
2. వాతావరణం, ఇతర కారణాల వల్ల యూరపియన్లు ఆసియాకు వలసరాలేదు.
3. కాని యూరపియను సామ్రాజ్య విధానం ఆసియాలోనె ముందుగా ప్రవేశించింది. 18వ శతాబ్ది తుది నుండి 19 వ శతాబ్ది కొసవరకు. ఈ ప్రాంతాలు(కొన్నింటిలో) యూరపియన్ల రాజకీయ ఆధీనంలోనికి వచ్చాయి. .
4. ఆఫ్రికాలో ఈ దశ సుమారు ఒక శతాబ్ది ఆలస్యంగా వచ్చింది. అయితే ఆఫ్రికా, యూరపియన్ల వలసకు సామ్రాజ్య విధానానికి కూడ లొంగవలసి వచ్చింది.

దక్షిణాఫ్రికా కొసప్రాంతానికి ముందుగా హాలెండ్‌లోని ఒక క్రైస్తవ మత తెగ వలస వచ్చింది. వీరిని బోయర్లంటారు. తదుపరి బ్రిటిషు వారు ఇదే ప్రాంతాలకు వలస వచ్చారు. ఈ నేపథ్య కారణంగానే బోయర్ల రాజకీయ ఆధిక్యతను కూలదోసి 19వ శతాబ్ది చివరలో బ్రిటన్, దక్షిణాఫ్రికాను చేజిక్కించుకుంది. ఈ వలస విధానం వల్లనే దక్షిణాఫ్రికాలో ప్రముఖంగా బోయర్ల, శ్వేత జాత్యహంకార వలస వ్యవస్థ వంద సంవత్సరాలకు పైగా చెలరేగింది.

ఉత్తరాఫ్రికాలోని మధ్యధరా తీర దేశాలైన అల్జీరియా, మొరాకో, ట్యునిసియా, ఇతర సహారా, ఎడారి ప్రాంతాలను, ఫ్రాన్సు, తన సామ్రాజ్యంలో చేర్చుకుంది. అల్జీరియా ప్రాంతాల వాతావరణం ఫ్రెంచివాసులకు అనుకూలించిన కారణంగా ఫ్రెంచివారు కొందరు అల్జీరియాకు వలస వెళ్ళి క్రమంగా ఆదేశంలో, ఆర్థికంగా వ్యవసాయ, వ్యాపారాలలో సంపన్నులు కావడమేకాక పరిపాలనా, సైన్యరంగాలలో, ఆధిక్యత పొందగలిగారు. దీనివల్ల దక్షిణాఫ్రికాలోలాగే శ్వేతజాతి ఫ్రెంచివారికి అల్జీరియాలోని ఆఫ్రికా, ఇంక అక్కడి అరబ్బు సంతతి వారికి జాతిపరమైన వైషమ్యాలు ఉధృతమవుతూ వచ్చాయి. గత శతాబ్ది మధ్యలో అల్జీరియాకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి ఈ వలసపోయిన శ్వేత జాతి సంతతి

ఒక పెద్ద ప్రతికూల కారణమైంది. ఆదేశంలోని ప్రజలు ఫ్రెంచివారి మీద సాయుధపోరాటం చేయడం, ఫ్రెంచి ప్రభుత్వం వారి శ్వేత జాతీయుల తరపున ఆపోరాటాన్ని అణచడానికి దారుణమైన విధానాలకు ఒడి కట్టారు. తుదకు అల్జీరియా నుండి వెనుతిరుగక తప్పలేదు. మొరాకో, ట్యూనిసియా, ఇతర ఫ్రెంచి, ఆఫ్రికా దేశాల స్వాతంత్ర్య విషయాలలో ఈ ప్రతిఘటన లేకపోవడంవలన, ఫ్రెంచి నిష్క్రమణ కొంత సజావుగా జరిగింది.

ఆఫ్రికాలో బ్రిటిషు సామ్రాజ్యం విస్తీర్ణం తూర్పుకోస్తా, దక్షిణాఫ్రికా నుండి, టాంజానియా, కెన్యా, ఇంకాలోపల నున్న యుగాండా, జింబాబ్వే(ఆనాటి మధ్య ఆఫ్రికా దేశం), మలవి, జాంబియా, ఇక పశ్చిమ కోస్తాలో ఈనాటి ఘనా, నైజీరియా, సియారా లియోన్ తదితర ప్రాంతాలు బ్రిటిష్ వారు పాలించినవే. యూరోపులో అతి చిన్న దేశమైన బెల్జియం కూడ 19వ శతాబ్ది మధ్యలో ఆఫ్రికాలోని పెద్ద దేశాల్లో పెద్దదైన కాంగోని స్వంతం చేసుకుంది. ఇకపోర్చుగలు ఆధీనంలో ఆఫ్రికా పశ్చిమ, తూర్పుకోస్తాలలో కొన్ని దేశాలుండేవి.

ఆఫ్రికాలో వారు చేసిన అమానుషమైన దౌర్జన్యం ఇంకొకటి ఉంది. అమెరికా ఖండాలకు సముద్రమార్గాన్ని కనిపెట్టిన యూర పియన్లు 16,17,18 శతాబ్దాలలో భారీ ఎత్తున వలసలు వెళ్ళడం తెలిసిన సంగతే. ఈ సందర్భంలోనే ఆఫ్రికా పశ్చిమ కోస్తాతో రాకపోకలు స్థిరపడడం, ఆ ప్రాంతం నుండి పశ్చిమ కోస్తా, దేశాలైన ఐవరి కోస్టు, గోల్డుకోస్టు, కాంగో, సెనిగాల్, సిరియాలియోన్ తదితర ప్రాంతాల నుండి బానిస వ్యాపారము కొనసాగింది. ప్రపంచ చరిత్రలోనే ఇది అతి హేయకరమైన ఘట్టం.

ఈ ఆఫ్రికా ఖండవాసులను అమెరికా ప్రాంతాలకు బానిసలుగా తరలించడంవల్ల గత 300 ఏళ్ళకి పైగా అమెరికా ఖండమంతటా ఆఫ్రికా జాతి సంతతి పెరగడం, అమెరికాలో వారు బానిసత్వంలో దుర్భర మనుగడ సాగించడం జరిగింది. ఆఫ్రికాలో సామ్రాజ్యదోపిడి అంతా ఒక ఎత్తు. అక్కడి నుండి శతాబ్దాల తరబడి బానిస వ్యాపారం నడిపించడం మరో ఎత్తు. గత శతాబ్ద మధ్యలో ఆసియాలో జాతీయతా భావం ప్రాబల్యం వలన యూరోపియన్ సామ్రాజ్యవిధానం అంతమయింది. జాతీయోద్యమాలు ఆఫ్రికాలో అప్పటికే చోటు చేసుకోవడం, సామ్రాజ్యశక్తులు పలాయనం తప్పదని నిర్ణయించుకోవడం కూడ జరిగాయి. ఈ సామ్రాజ్య విధానానికి లోనైన దేశాలకు విముక్తి క్రమంగా 1960-80 దశాబ్దాలలో వచ్చింది. కొన్ని చోట్ల జాతీయోద్యమాలు, శాంతియుత పోరాటం ద్వారా, స్వాతంత్ర్యం సాధించుకోగలిగాయి. కొన్ని ప్రాంతాలలో సాయుధ పోరాటాలు తప్పలేదు. వీటిలో కొన్ని దేశాలలో వెనుదిరిగిన యురోపియన్ దేశాల కుట్ర విధానాల వల్ల అంతర్యుద్ధాలు రావడం, దేశాలు విచ్ఛిన్నం కావడం కూడ జరిగింది.

దక్షిణాఫ్రికా మాత్రం, యూరోపియన్ రాజ్యాల ఆధిక్యం లేకపోయినా, అక్కడి శ్వేతజాతి అమానుషమైన జాత్యహంకార కారణం వల్ల, అత్యధికమైన ఆఫ్రికా ప్రజలకు విముక్తి క్రిందటి శతాబ్ది చివరివరకు లభించలేదు. తుదకు 1993 లో లభించింది.

ఈ క్లుప్త చారిత్రక వివరణ ఆఫ్రికా వాసుల దురదృష్టకరమైన మనుగడను వ్యక్తపరుస్తుంది. వలస సామ్రాజ్యవాదాలు ముడిపడి వుండడం వల్ల స్వాతంత్ర్య సాధనలో ఉన్న ప్రతికూలత, ఇతర అడ్డంకుల పాత్ర విశదమౌతుంది కూడ.

ఆఫ్రికా దేశాలు మొదటినుంచి సంక్షోభంలోనే చిక్కుకున్నాయి. అంతరంగిక వైషమ్యాలు, సరిహద్దుకు సంబంధించిన వివాదాలు, వీటిలో వెనుకటి సామ్రాజ్య దేశాలపాత్ర, శతాబ్దాలుగా కరడుగట్టిన పేదరికం సంక్షోభానికి కారణాలు. జాతీయోద్యమాలను సాధించిన మొదటి తరం నాయకత్వం అంతరించిన తరువాత నాయకత్వం పటిమలో తీవ్రమైన లోపాలు పరిపాలన సరళిలో వికృత పోకడలు తీవ్రమయ్యాయి. మూడవ ప్రపంచ దేశాలలోలాగే రాజకీయ భ్రష్టత్వం వేళ్ళు నాటుకుంది. సహజ సంపదలెన్నున్నా ఆధునిక, ఆర్థిక, పారిశ్రామిక, విద్యారంగాలలో ఆఫ్రికా దేశాలు అభివృద్ధిని సాధించ లేకపోయాయి. ఉత్తరానికున్న ఈజిప్టు, మధ్యధరాతీర దేశాల వంటివి కొద్ది దేశాలు మినహాయించి ఆఫ్రికా దైన్యదశలోనే ఉండిపోయింది.

ఆధునికాభివృద్ధిని పురస్కరించుకొని చేస్తున్న కృషిపై చెప్పిన కారణాలవల్ల సత్ఫలితాలనివ్వలేదు. దేశాలకు అందిన ఆర్థికసహాయం రాజకీయ, పారిశ్రామిక వర్గాల స్వంత ఖజానాలలోనికి చేరుకుంది. ప్రపంచబ్యాంకు అంతర్జాతీయ ద్రవ్యనిధి ఇచ్చిన రుణాలు దారుణంగా దుర్వినియోగం కాబడ్డాయి. ఆఫ్రికా దేశాలు కొన్ని ఖనిజ సంపదల మీద, పెట్రోలియం, సంపదల మీద తేలుతున్నప్పటికీ, రుణాల ఊబిలో, మునిగిపోవడం విషాదకరమైన వాస్తవం. వీటన్నింటికి నిదర్శనం మానవాభివృద్ధి సూచికలే. ఐక్యరాజ్యసమితి అభివృద్ధి పథకం యొక్క మానవాభివృద్ధి సూచికలు ఆఫ్రికా దుర్భర పరిస్థితిని ఈ విధంగా విశదం చేస్తున్నాయి.

1. 2004 లెక్కల ప్రకారం 177 దేశాలలో 30 ఆఫ్రికా దేశాలు కనీస మానవాభివృద్ధి జాబితాలో ఉన్నాయి. అంటే సుమారు 90% ఆఫ్రికా దేశాలలో మానవాభివృద్ధి నిమ్న దశలో ఉంది. పైగా ఈ జాబితాలో మొత్తం 35 దేశాలుంటే దానిలో 30 స్థానాలు ఆఫ్రికా దేశాలవే.

2. మానవాభివృద్ధి అంచనాలో పరిగణనలోనికి తీసుకొన్న అన్ని అంశాలలోను, ఇంచుమించుగా ఇవే ఆఫ్రికా దేశాలు కనీస స్థాయిలోనే ఉన్నాయి. ఈ అంశాలు ఉదాహరణకు ఆరోగ్యం,

విద్యాభివృద్ధి, పేదరికపు పరిస్థితి, వాణిజ్యం, విదేశమారకార్జనం ఈ అంశాలన్నింటిలోను అత్యధికంగా ఆఫ్రికా దేశాలే అట్టడుగు స్థాయిలో ఉన్నాయి.

3. పేద దేశాలుగాను ఎంతో కొంత విద్యావాణిజ్యరంగాలలో ఇదివరలో కనిష్టజాబితామీదనున్న, కెన్యా వంటి దేశాలు 2004 సరికి కనిష్ట జాబితాకు దిగజారాయి.

ఈ పరిస్థితికి కారణాలనేకం. సాంఘిక సంక్షోభాలు, రాజకీయ పరిపాలనా పాటవలోపాలు ప్రముఖమైనవే. కాని వీటికి ఆజ్యం పోస్తున్న కారణం ఆర్థిక పరిస్థితులు. లోతుగా చూస్తే దీనికి మూల కారణం రుణాల ఊబి. అభివృద్ధి కార్యక్రమాల పేరిట ఆఫ్రికా దేశాలు రుణాలకు చెల్లిస్తున్న వడ్డీలు వాటివిదేశీ ఎగుమతుల ఆర్జనకన్న హెచ్చుగా ఉండడమే. ఆర్థిక సంక్షోభాలు, దుర్భేద్యం అయినపుడల్ల, తిరిగి ప్రపంచబ్యాంకు ప్రమేయంతో తిరిగి షరతులలో రుణాలు తీసుకోవడం, ఆ డబ్బునాయకుల స్వంతం కావడం రివాజయ్యింది.

ఈ నేపథ్యంలోనే జి-8 దేశాల ప్రతిపాదనప్రాముఖ్యం. అయితే ఆఫ్రికా విషయంలో అంతర్జాతీయ సానుభూతి స్పందన కొత్త విషయంకాదు. మూడవ ప్రపంచదేశాల ఆర్థిక విషవలయాన్ని అంతమొందించేందుకు గత దశాబ్దాలలో అనేక ప్రణాళికలు పథకాలు వెలువడ్డాయి. క్రొత్త ఆర్థిక వ్యవస్థ ఉద్యమం, సుమారు 40 ఏళ్ళ పూర్వం రూపొందింది. సామ్రాజ్యవిధాన శృంఖలాల నుండి విముక్తి పొందిన దేశాలకు, ప్రపంచ వాణిజ్య విధానంలో వారి ముడి పదార్థాలకు గిట్టుబాటు ధరలు, హెచ్చుగా ఎగుమతులకు అవకాశం సాంకేతిక విషయాలలో పాశ్చాత్యదేశాల సహాయాన్ని అడగడం జరిగింది. అంతర్జాతీయ సహాయం కేవలం దానం క్రింద పరిగణించక, అభివృద్ధి చెందుతున్న దేశాలకు చెందవలసిన ధర్మం ప్రాతిపదిక ఇవ్వాలనే ఈ వెనుకగల భావన.

దీన్ని పురస్కరించుకొని ఇతర ప్రపంచ సంస్థల నుండి కూడ నిర్దిష్టమైన పథకాలు వచ్చాయి. 1983లో జర్మని మాజీ ప్రధాని ప్రఖ్యాత అంతర్జాతీయ వేత్త అయిన విల్లి బ్రాంట్ నాయకత్వాన ఒక బృందం ప్రచురించిన పథకంలో ఈ అంశాలను పునశ్చరణం చేసి ముఖ్యంగా అతిగా వెనుకబడ్డ ఆఫ్రికా దేశాలకు ఆర్థిక స్వయం ప్రతి పత్తిని కల్పించాలని ఎన్నో పరిష్కారాలను సూచించడమైంది.

తరువాత 1985లో విల్లీ బ్రాంట్ అధ్యక్షతన సోషలిస్ట్ ఇంటర్ నేషనల్ ఆధ్వర్యాన వెస్ట్ఇండీస్ నాయకుడైన మైకల్‌మాన్లీ నేతృత్వంలో ఇంకొక రిపోర్టు జారీ అయింది. పై చెప్పిన అంశాలనే మూడవ ప్రపంచ దృక్పథంలో వక్కాణించడం జరిగింది.

తరువాత 1990 టాంజానియా మాజీ అధ్యక్షులు ఆఫ్రికా నాయకులలో అగ్రగామియైన జూలియస్ నైరెరె అధ్యక్షతన అభివృద్ధి చెందుతున్న దేశాలు వారి పురోగమనానికి ఎటువంటి పరస్పర సహకారాలను ఏర్పాటు చేసుకోవాలన్న విషయాలను కూలంకషంగా చర్చించి అనేక సిఫారసులు అందించింది. బహుశా వలస రాజ్యవ్యవస్థ అంతరించిన తరువాత జరిగిన ప్రపంచ సహకార చర్చలో ఇది ఆఖరుదేమో. ప్రచ్ఛన్నయుద్ధం ముగియడంతో వీటిని పట్టించుకున్ననాథులే కరువయ్యారు.

అయితే గత శతాబ్ది అంతానికి ప్రచ్ఛన్న యుద్ధం ముగియడం, అలీనోద్యమం ప్రభావం సన్నగిల్లడం వల్ల మూడవ ప్రపంచ ఆర్థిక, సామాజిక, వెనుకబాటును పట్టించుకోవడంలో తీవ్ర అలక్ష్యం ఏర్పడింది. కొత్త ఆర్థిక వ్యవస్థ అనే వాదనే అడుగున పడింది. ఇక ప్రపంచీకరణ రావడంతో దాన్ని ఆర్థిక వ్యవస్థని సమాధి చేశారు. విజృంభించిన అంతర్జాతీయ పెట్టుబడివాదనే ఒక క్రొత్త ఆర్థిక వ్యవస్థగా అవతరించినదని చెప్పవచ్చును.

ప్రపంచ వాణిజ్యవ్యాపార సంబంధాల విషయంలో బాహాటంగా చలామణి అవుతున్న గాట్ పద్ధతులు కొద్ది మేరకు ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన వెనుక బడిన దేశాల ప్రయోజనాలకు అనుకూలించినట్లు అంక్టాడ్ గత 40 ఏళ్ళుగా ప్రయత్నించింది కానీ ఫలితాలు అంతంతమాత్రమే మిగిలాయి. పులిమీద పుట్రలాగా అంక్టాడ్ వ్యవస్థపోయి ప్రపంచీకరణకు దోహదం చేస్తున్న ప్రపంచ ఆర్థిక, వాణిజ్య, అభివృద్ధికి పునాదులనే మంత్రం మీదనే ఆధారపడిన ఈ వ్యవస్థ వెనుకబడిన దేశాలలో సంక్షోభం సృష్టిస్తున్నది. కొన్ని వర్గాలకే లాభదాయకమై ఎవ్వడో "నందోరాజాభవిష్యతి" అన్నట్లు, భవిష్యత్తులో ఇది ఎంత మంచిని తెస్తుందో తెలియదు కాని ప్రస్తుతానికి ఇది వెనుక బడిన దేశాలకు అనర్థమే తెచ్చి పెడుతుంది.

అయినప్పటికి ప్రపంచీకరణ వికృతరూప పోకడలు బహిర్గతం అయినప్పుడు తిరిగి అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రయోజనాల విషయంలో కొన్ని చొరవలు, జోక్యాలు వస్తూనే ఉన్నాయి. ఐక్యరాజ్యసమితి ఉన్నత కార్యదర్శి కోఫిఅన్నన్, ఆఫ్రికా రక్షణ ఆర్థిక, భద్రత, విషయంలో గత దశాబ్దిలో చాలా ప్రతిపాదనలు చేశారు. ఆఫ్రికాలో అంతఃకలహాలు చెలరేగడం, రువాండా, కాంగో, లైబీరియా, సూడాన్‌లలో ప్రజల పరిస్థితి మరింత దుర్భరం కావడమే ఈ చొరవకు కారణం.

పైన ఉదహరించినవి ప్రతిపాదనలుగానే మిగిలాయి. వెనుకబడిన దేశాల విషయంలో అసలు చొరవ తీసుకోవలసినది అభివృద్ధి చెందిన దేశాలు. ఈ దేశాలు వారి విధానాలను మార్చుకొని అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రయోజనాలకు దోహదం చేస్తేతప్ప వేరుమార్గంలేదు. ముఖ్యంగా ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి విధానాలలో సడలింపు తేవాలి. రుణాల మాఫీ, రుణాలు,

ప్రపంచ ఆర్థిక సహాయనిధిని వినియోగించుకొనే తీరులో, నియంత్రణను సడలించడం అత్యవసరం.

ప్రపంచంలోకెల్లా అభివృద్ధి చెందిన జి-8 దేశాల ప్రస్తుత ప్రతిపాదన యొక్క ప్రాముఖ్యతకు ఇదే కారణం. ఈ దేశాలే, అటు ప్రపంచబ్యాంకును అంతర్జాతీయ ద్రవ్యనిధిని శాసించ వలసినవి, ఇటువారి వారి వ్యక్తిగత, సామూహిక ఆర్థిక, వాణిజ్య విధానాలలో సడలింపులు తీసుకొని రాగలిగినది. ఈ శ్లాఘనీయమైన ఉదారతకు, బ్రిటన్ ప్రధాని టోనిబ్లెయిర్, విత్తమంత్రి గోర్డెన్ బ్రానులు నుడికారం చుట్టారు. ఆఫ్రికాదేశాలను శాశ్వత దైన్యస్థితినుండి మార్చడానికి ఏడాది క్రితమే, టోనిబ్లెయిర్ నాయకత్వం క్రింద ఒక కమీషన్, ప్రణాళికను రూపొందించింది. దానిలోని ముఖ్యాంశమే ఈ జి-8 దేశాల చొరవకుమూలం.

ఈ ఉదారతకు కారణాలేమిటి, ఈ ఉదారత అమలులో ఉన్న మెలికలు ఏమిటి అనే విషయాలను ప్రస్తావించడం అవసరం.

టోనీబ్లెయిర్, ఇరాక్ విషయంలో, అమెరికా అధ్యక్షుడు బుష్‌తో లాలూచిపడి తన పేరు ప్రతిష్ఠలను పోగొట్టుకొన్నారు. అతికష్టం మీద ఎన్నికలలో విజయం సాధించారు. తాను పోగొట్టుకున్న పేరు ప్రతిష్ఠలను తిరిగి సంపాందించడంలో ఆయన ఆఫ్రికా కమీషన్‌ను నిర్వహించి దానికి వేదికను రూపుదిద్దారు. బ్రిటన్ లేబర్ పార్టీ పూర్వపు సామ్రాజ్యదేశాలపై చిత్తశుద్ధితో కూడిన గౌరవాభిమానాలు గలది. సామ్రాజ్యవాదాన్ని అంతం చేయడంలోను లేబర్ పార్టీ పాత్రను అందరు గుర్తించినదే అయితే ప్రపంచీకరణ ధోరణిలో బ్లెయిర్ నాయకత్వం క్రింద ఈ పార్టీ తన వెనుకటి భావాలను మరిచింది. ఇప్పుడు మరల వీటికి కొంత ప్రాధాన్యత ఇవ్వడం కనబడుతున్నది.

ఈ జి-8 ప్రతిపాదనలను రెండవ ప్రపంచయుద్ధం అనంతరం అమెరికా ప్రతిపాదించి అమలు పరచిన మార్షల్ ప్లాన్‌తో పోల్చవచ్చు. మార్చి 1947లో ఒక బృహత్తరమైన విధాన ప్రకటనలో, యుద్ధంలో ధ్వంసమైన యూరోపును ఆదుకొని దాని పునర్‌నిర్మాణానికి సహాయపడే మార్షల్‌ప్లాన్ ప్రకటించారు. దీని మూలంగా యూరోపు దేశాలు అమెరికాకు బాకీ పడిన రుణాలను కొంతమేరకు మాఫీచేయడమేకాక, యూరోపు ఆర్థిక, పునరావిర్భావానికి అమెరికా ఆర్థిక సహాయాన్ని కూడ భారీఎత్తున అందచేసింది. ఈ పథకం క్రింద యూరోపు దేశాలు సంఘటితంగా వాటి పునర్‌నిర్మాణానికి 4 మిలియన్ల సహాయాన్ని అందజేశాయి. ఈ సహాయాన్ని యూరోపులో అన్ని దేశాలకు అందచేస్తామని, అమెరికా ప్రకటించినా అప్పటికప్పుడే ప్రచ్ఛన్నయుద్ధం ఆసన్నమవడం చేత, సోవియట్ రష్యా, దాని అనుచరులైన, తూర్పు యూరోపు దేశాలు ఈ సహాయాన్ని నిరాకరించాయి. అందుకే మార్షల్ ప్లాన్, ప్రచ్ఛన్న పోరాటంలో, ఒక పావుగా పరిగణిస్తారు. అయినప్పటికి అమెరికా అందించిన సహాయం వల్లనే, జర్మనీ, ఫ్రాన్స్, బ్రిటన్, ఇతర పశ్చిమ యూరోపు దేశాలు, తిరిగి తమ పారిశ్రామిక, ఆర్థిక స్థోమతను పొందగలిగాయి. దీనిలో అమెరికా స్వలాభంలేక పోలేదు. యూరోపు తిరిగి పుంజుకుంటే తప్ప అమెరికా, పారిశ్రామిక, ఆర్థిక, వాణిజ్య రంగాలకు లాభావకాశాలు ఉండవుకదా. ఇదికాక సోవియట్ కూటమి వొత్తిడులను తట్టుకోవాలంటే పశ్చిమ యూరోపు, రాజకీయ, ఆర్థిక పటిష్టత అత్యవసరం.

ఇప్పుడు జి-8 దేశాల పథకం కొంతమేరకు మార్షల్ ప్లాన్‌వంటిదే అని చెప్పవచ్చును. మొత్తం 40 బిలియన్ డాలర్లను, మార్షల్ పథకం యొక్క కేవలం 4 మిలియన్ల డాలర్లతో పోలిస్తే, అన్ని విధాలా జి -8 జోక్యం అతి పెద్దఎత్తున ఉందని చెప్పాలి. ద్రవ్యోల్బణ ప్రభావాన్ని దాఖలు లోనికి తీసుకున్నా 40 బిలియన్ డాలర్లు పెద్దమొత్తమే. ఐతే ఇది షరతులతో కూడిన సహాయమే. సహాయాన్ని పొందే దేశాలు (1) అంతరంగిక భ్రష్టత్వాన్ని నిర్మూలించుకోవాలి (2) ప్రైవేట్ రంగం అభివృద్ధిని పెంచాలి (3) అంతరంగిక విదేశీ పెట్టబడులకు ఎట్టి ఆటంకాలను రానివ్వ కూడదు. ఈ షరతులన్ని, ప్రపంచబ్యాంకు, తదితర అంతర్జాతీయ ఆర్థిక సంస్థల షరతులే.

భ్రష్టాచారం అతి విస్తృతంగా వుండడం నిజమే. ఒక అంచనా ప్రకారం ఆఫ్రికా దేశాలు అందుకున్న 1000 డాలర్ల ఆర్థిక సహాయానికి 1450 డాలర్లు నాయకుల స్వంత ఖాతాలలోనికి విదేశీ బ్యాంకులలో జమయ్యాయి. ఇక సంపన్న దేశాల న్యాయవిధానాల ప్రకారం వాటి కంపెనీలు ఆఫ్రికన్ నాయకులకు లంచాలివ్వ వచ్చును కూడా.

ఇంకొక గట్టి విమర్శ ఏమంటే ఆఫ్రికా దేశాల దుస్థితి ఆర్థిక సహాయలోటు కారణంగానే సంక్రమించిందా? అయితే ఇప్పటికీ ఆఫ్రికా దేశాలలోని ప్రతి వ్యక్తి సగటున సుమారు 5000. డాలర్లు ఆర్థిక సహాయం పొందినట్లు అంచనాలున్నాయి. కేవలం ఆర్థిక లోట్లను భర్తీ చేస్తే ఆఫ్రికా ప్రజలు తేరుకుంటారన్నది సంపన్న దేశాల నైతిక అపోహ మాత్రమే. ఆరోగ్య, విద్యా, సామాజిక రంగాలలో, తగిన చిత్తశుద్ధితో ఆఫ్రికా పురోభివృద్ధికి తోడ్పడకపోతే, ఆర్థిక సహాయం బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది.

ఎయిడ్స్ మహమ్మారి తాండవం, వ్యక్తిగత మానవాభివృద్ధిలో వూహించలేనంత దైన్యం, అంతరంగికంగాను, బాహ్యము నుంచి ఉదాసీనత తొలగించగలిగితే గాని ఆఫ్రికా ప్రజానీకానికి అసలైన విముక్తి కలుగదు. జి-8 చొరవను ఒక నూతనారంభంగా భావించి ఆఫ్రికా దేశనాయకులు తామంతట తాము కొత్త పంథాలో నడిస్తే తప్ప ఈ ఆర్థికసహాయం కూడా వ్యర్థమవుతుంది. ఆఫ్రికాలోని

ప్రజాప్రేరిత సంఘాలు ఈ జి-8 ప్రతిపాదనలు ఆహ్వానిస్తూ ఇంకా సంపూర్ణమైన వివిధాంశాలను పొందుపరిచి ఆఫ్రికా దుస్థితిని పరిష్కారం చెయ్యవలసి ఉందని ప్రకటించాయి. దక్షిణాఫ్రికా అధ్యక్షులు, తాబోఎమౌచికి, ఈ ప్రతిపాదనలు ఆఫ్రికా పేదరికాన్ని మాపి, అభివృద్ధికి దోహదం చేస్తాయనే ఆశాభావం వెలిబుచ్చారు.

ఈ ప్రతిపాదనలను కొన్ని యూరోపియను వర్గాలు పేదరికపు చరిత్రను మార్చేవాటిగా ప్రశంసిస్తున్నారు. శ్రీశ్రీ చెప్పినట్లు అసలు చరిత్రే పేదరికపునకలు అయితే, పేదరికాన్ని గతించిన చరిత్రగా మార్చడం సాధ్యమా? అయితే గురజాడ చెప్పినట్లు, స్వార్థంతో పాటు కొంతమంచిని కూడ పంచవచ్చునుకదా, అధమం ఆ మట్టుకైనా ఆఫ్రికా చరిత్రలో కొంత మార్పు వస్తుందా? వస్తుందనే ఆశిద్దాం. ❑

---

*(30వ పేజీ తరువాయి)*

43 శాతంనుంచి 03-04లో 82 శాతానికి పెరిగింది. 03-04 లో బడ్జెట్ అంచనాలో వసూలు కాని పన్ను రు. 737 కోట్లు. వసూలు కాని కస్టమ్స్ సుంకం (2004 నాటికి) రు. 1168 కోట్లు. మూడేళ్లలో రద్దుచేసిన కస్టమ్స్‌సుంకం నూరుకోట్లు. ఆడిట్‌లో అభ్యంతరం లేవదీసిన కేసుల్లో వసూలు కావాల్సిన మొత్తం రు. 7160 కోట్లు.

ఇన్నివేల కోట్లు వసూలు కావాల్సి వుండగా, లేదా సబ్సిడీల పేరుతో ఆదాయాన్ని పోగొట్టుకోగా, వీటి వసూళ్ల మీద కేంద్రీకరించటం పోయి, విదేశీ పెట్టుబడులకోసం ఎగబడడం సిగ్గుచేటు.

కార్పోరేటురంగం వ్యవసాయంలో కాలుపెట్టడం అటు పరిశ్రమలు, వ్యవసాయం, ఇటు సేవారంగాలను ప్రభావితం చేసి, అటు బహుళజాతి సంస్థలతో చేతులు కలిపి, రాజకీయ నాయకులను ధన, కనక వస్తు వాహనాలతో లోబరచుకొని దేశాన్ని ప్రపంచీకరణ శక్తులకు అమ్మివేయటమే అవుతుంది. అది సంస్కరణలు ప్రవేశపెట్టిన నాటినుంచి కొనసాగుతూనే వుంది. సంస్కరణలకు ముందు కాలంలో అంటే 80వ దశకంతో పోల్చుకొంటే సంస్కరణలు అమలు జరిపిన 90వ దశకంలో, ఆ తర్వాత కూడా అన్ని సూచికల్లో దిగజారుడు ధోరణి స్పష్టంగా వ్యక్తమైనా పాలకులు ఆ సంస్కరణలే పేదరికాన్ని పారద్రోలగలవని అనటం చరిత్రనుంచి, అనుభవాలనుంచి పాఠాలు నేర్చుకో నిరాకరించడమే అవుతుంది. 10వ ప్రణాళిక లక్ష్యాలను మధ్యంతర సమీక్ష అనంతరం కుదించటం చూస్తే, పేదల గతుకుల బతుకులు ఇక ఇంతేనని అనిపిస్తుంది. వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో ఉత్పత్తి పెంచటం ద్వారానే పేదరికం తొలగించవచ్చునంటున్న ప్రధాని, ఆరుకోట్ల టన్నులు పేరుకొన్ననాడు, అలాగే ప్రస్తుతం పారిశ్రామికోత్పత్తి పెరిగినా, పేదల బతుకులు ఎంత బాగుపడ్డాయో చెబితే బావుంటుంది.

వారి బాగోగులను కనీస ఉమ్మడి కార్యక్రమం పట్టించుకొంటుందన్న ఆశ నిరాశగానే మిగులుతుందని గత సంవత్సరం అనుభవం తెలియ చేస్తుంది. ఆ కార్యక్రమం అమలైతే పేదరికం అంతర్ధానమై పోతుందని కాదు కాని ఆ దిశగా ఒక అడుగు పడుతుందనే ఆశ మాత్రమే. ప్రజలు తమ ఐక్యబలంతో, ప్రభుత్వాన్ని ఆ వైపు నెట్టాల్సివుంది. ❑

## ఆంధ్రప్రదేశ్ అక్షరాస్యత: కొన్ని గణాంకాలు

| | 1961 లక్షలు | 1971 లక్షలు | 1981 లక్షలు | 1991 లక్షలు | 2001 లక్షలు |
|---|---|---|---|---|---|
| అక్షరాస్యులు - పురుషులు | 54.82 | 73.03 | 106.42 | 155.33 | 234.45 |
| అక్షరాస్యులు - స్త్రీలు | 21.44 | 33.87 | 53.93 | 89.55 | 164.89 |
| అక్షరాస్యులు - మొత్తం | 76.26 | 106.90 | 160.35 | 244.88 | 399.34 |
| అక్షరాస్యులు శాతం - పురుషులు | 30.2 | 33.2 | 39.3 | 55.1 | 70.32 |
| అక్షరాస్యులు శాతం - స్త్రీలు | 12.0 | 15.8 | 20.4 | 32.7 | 50.43 |
| అక్షరాస్యులు శాతం - మొత్తం | 21.2 | 24.6 | 29.9 | 44.1 | 60.47 |

# మానవ సంబంధాలే మదుపు
# లాభార్జనే పరమార్థం

- కొణతం దిలీప్

**ఇది మానవసంబంధాలను 'మార్కెట్' చేస్తున్న ఒక కొత్త బంగారులోకం కథ. స్నేహబంధాలనూ, బంధుత్వాలనీ 'క్యాష్' చేసుకోవడానికి అర్రులు చాస్తున్న ఒక నవీన ప్రపంచపు విషాద గాథ. ఆమ్వే, క్వాంటమ్, ఏఎంసీ, టప్పర్ వేర్, మోడీకేర్.... పేరు ఏదైతేనేం - మల్టీనేషనల్ కంపెనీల వలకు తాము చిక్కి, కాసిని కాసులకోసం అయిన వారినీ,తమ వాళ్ళనీ బలిపెట్టి నాలుగు రూకలు వెనకేసుకోవడానికి వ్యర్థ ప్రయాసపడుతున్న మధ్యతరగతి మందమతుల దీనగాథ....**

చాలా కాలంగా కాంటాక్ట్‌లో లేని చిన్ననాటి స్నేహితుడెవరయినా హఠాత్తుగా ఫోన్ చేసి 'నీతో కొంచెం పర్సనల్‌గా మాట్లాడాల, 'ఏంటీ ఆమ్వే గురించేనా?' అని అడగాల్సిన దౌర్భాగ్యపు పరిస్థితి దాపురించింది ఆంధ్రప్రదేశ్‌లో! బంధువుల ఇంట్లో జరిగే చిన్న శుభకార్యానికి వెళ్ళి అక్కడ కలిసిన చుట్టాలతో కుశల ప్రశ్నలయినా అడగనీయకుండా 'మా ఏ.ఎం.సీ కుక్‌వేర్ డెమాన్‌స్ట్రేషన్ అంటూ మార్కెటింగ్ మొదలెట్టే పిదపకాలమిది!

ఇప్పుడు రాష్ట్రమంతటా డైరెక్ట్ సెల్లింగ్ కంపెనీల జ్వరం ఆవహించింది. త్వరగా డబ్బు సంపాదించాలన్న మధ్యతరగతి కోర్కెలు నెరవేర్చుకోవడానికి తేలికైన ఉపాయం అని ఊదరగొడుతున్న ఈ డైరెక్ట్ మార్కెటింగ్ కంపెనీల పుణ్యమా అని ఇవ్వాళ రాష్ట్రంలో మానవసంబంధాల వ్యాపారీకరణ జరిగిపోతోంది. 'ఈ స్కీమ్‌లో చేరు' 'ఆ వస్తువు కొను' అని మొహమాట పెట్టే బంధువులూ, స్నేహితులూ, పరిచయస్తులూ రోజురోజుకీ ఎక్కువై పోతున్నారు.

టైమ్ ఈజ్ మనీ అని నూరి పోసే ఈ కంపెనీల ట్రైనింగ్ పుణ్యమా అని 'నీతో కాసేపు గడిపితే నాకు, నా వ్యాపారానికి ఏం లాభం వస్తుంది' అని లెక్కలు వేసుకునే వాళ్ళు ఎక్కువ అవుతున్నారు.

డైరెక్ట్ మార్కెటింగ్ వ్యాపారంలో ఆమ్వే, క్వాంటమ్, టప్పర్ వేర్, హెర్బాలైఫ్ వంటి అంతర్జాతీయ కంపెనీలే కాక ఎం.ఎల్.ఎమ్, నెట్‌వర్క్ మార్కెటింగ్, పిరమిడ్ మార్కెటింగ్, చైన్ మార్కెటింగ్ ఇలా రకరకాల పేర్లతో పిలవబడుతున్న దేశీయ, ప్రాంతీయ చిన్నా చితకా కంపెనీలు అనేకం వున్నాయి. అయితే పేరేదయినా, ఉత్పత్తి ఏదైనా చివరికి అన్ని చోట్లా జరిగేది డబ్బు పంపకమే. చైన్‌లో పై లెవల్‌లో వున్న కొద్ది మంది తెలివైన వారి జేబుల్లోకి కింద వున్న అమాయకుల డబ్బు చేరుతుంది. పైకి మాత్రం కవర్ అప్‌లా సబ్బులు, షాంపూలు, డిష్ వాషింగ్ లిక్విడ్లూ అని ఉత్పత్తులు చూపిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లోని మారుమూల టౌన్లలో, పల్లెల్లో ఆమ్వే, క్వాంటమ్ కంపెనీలలో చేరిన వారున్నారంటే ఇవ్వాళ ఈ కంపెనీల మత్తులో ఎంతమంది పడిపోయారో అర్థమవుతుంది.

అసలు ఈ కంపెనీలు చెప్పేదాంట్లో వాస్తవమెంత, డబ్బు సంపాదించాలనే ఆశతో ఇందులో చేరే వాళ్ళలో ఎంతమంది నిజంగా సంపాదిస్తున్నారు, అసలీ కంపెనీల వాస్తవ స్వరూపమేమిటి వంటి విషయాలు వివరించడానికి డైరెక్ట్ మార్కెటింగ్ కంపెనీల్లో నెంబర్ వన్ అయిన ఆమ్వే గురించి కాస్త తెలుసుకుందాం!

**ఆంధ్రప్రదేశ్‌లో అమెరికన్ వే ఆఫ్ లైఫ్!**

1959లో రిక్‌డెవాస్, జేవాన్ ఆండెల్ అనే ఇద్దరు ఔత్సాహిక పారిశ్రామికవేత్తలు మొదలుపెట్టిన 'ఆమ్‌వే' - నెట్‌వర్క్ మార్కెటింగ్‌ను ప్రపంచానికి పరిచయం చేసింది. ఇంతింతయి వటుడింతయి అన్నట్లు క్రమ క్రమంగా ఎదిగి నేడు ఎనభై దేశాలలో ముప్పై లక్షలమంది ఇండిపెండెంట్ డిస్ట్రిబ్యూటర్స్‌తో దాదాపు పది బిలియన్ డాలర్ల టర్నోవర్ సాధించింది ఆమ్‌వే.1998లో భారత్‌లో కార్యకలాపాలు ప్రారంభించిన ఆమ్‌వే 2001 నాటికే అయిదు లక్షలమంది డిస్ట్రిబ్యూటర్ల స్థాయికి చేరింది.




అయితే ఎంతో నైతికమైన కంపెనీగా చెప్పుకుంటూ, తన ఉత్పత్తుల నాణ్యత గురించి ఊదరగొడుతూ, అరచేతిలో వైకుంఠం చూపిస్తూ అమాయకులను బుట్టలో వేసుకుంటున్న ఆమ్వే గత చరిత్ర ఒకసారి పరిశీలిస్తే దాని పునాదులు అవినీతి, అనైతిక కార్యకలాపాలు, అబద్ధాలు, మోసాలపై నిర్మించబడ్డాయని అర్థం అవుతుంది.

## వేలల్లో కోర్టు కేసులు

సచ్ఛీలతకు మారుపేరు అని మన దగ్గరకు వచ్చి మోత పెడుతున్న ఆమ్వేకు ప్రపంచవ్యాప్తంగా ఉన్న కోర్టు కేసులు కోకొల్లలు. 1985లో ఆమ్వేలో డైమండ్ డిస్ట్రిబ్యూటర్‌గా ఉన్న రికోసెట్జర్, ఆమ్వేపై వేసిన కేసు విచారణలో భాగంగా 'ఆమ్వే'పై ఉన్న కేసుల వివరాలు కాస్త చెప్పమని, కోరితే స్వయంగా ఆమ్వే లాయర్లు 'గత పదేళ్ళలో మాపై ఉన్న కేసుల వివరాలు ఇవ్వడం సాధ్యంకాదు. అవి వేలల్లో ఉంటాయి' అని బదులిచ్చారు.

ఒక కంపెనీపై వేలల్లో కేసులు ఎందుకు ఉంటాయి? ఆమ్వే అంత పెద్ద కంపెనీపై కేసులుండటంలో ఆశ్చర్యమేముందని ఎవరైనా అడగవచ్చు. అయితే ఆ కేసుల్లో చాలా వరకూ ఆమ్వేలో డిస్ట్రిబ్యూటర్లుగా పనిచేసి, కంపెనీ తమని మోసం చేస్తుందని తెలుసుకున్న వారు దాఖలు చేసినవనే వాస్తవం ఆమ్వే నిజస్వరూపాన్ని బయటపెడుతుంది.

## ఉత్పత్తులు కాదు అమ్మేది ట్రైనింగ్ మెటీరియల్‌ని

ఆమ్వే మొత్తం అమ్మకాలలో సింహభాగం ట్రైనింగ్ మెటీరియల్ (పుస్తకాలు, క్యాసెట్లు, శిక్షణా తరగతులు) అమ్మకం ద్వారానే వస్తోందని చాలాసార్లు నిరూపణ అయింది. పై స్థాయికి చేరుకున్న డిస్ట్రిబ్యూటర్లు అనేక మంది తమ మొత్తం ఆదాయంలో మూడింట రెండు వంతులు ఈ శిక్షణా సామగ్రి అమ్మడం వల్లనే వచ్చింది అని ఒప్పుకున్నారు. డెక్స్టర్ యాగర్, బిల్‌బ్రిట్ అనే ఇద్దరూ పై స్థాయి ఆమ్వే డిస్ట్రిబ్యూటర్లు ఈ ప్రచార సామగ్రి తయారు చేస్తారు. (డెక్స్టర్ యాగర్ ఫోర్బ్స్ పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఈ విషయం ఒప్పుకున్నాడు)

1982 లో ఫేక్ ఇట్ టిల్‌యూ మేక్ ఇట్ అనే పుస్తకంలో ఫిల్ కెర్న్ అనే రచయిత ఇలా అన్నాడు! 'ఆమ్వేలో నిజమైన డబ్బు చాలా వరకూ ప్రచారసామగ్రి అమ్మడం ద్వారానే వస్తుంది'.

డెట్రాయిట్ ఫ్రీ ప్రెస్ 1982లోనే ఈ ప్రచార సామాగ్రి కుంభకోణాలపై వివరంగా వ్యాసాలు ప్రచురించింది.

ఆమ్వేలో చేరేప్పుడు 'సేల్స్‌కిట్' కోసం కట్టించుకునే డబ్బు కాక ఆ తరువాత రెగ్యులర్‌గా ఈ ప్రచారసామాగ్రి కొనుక్కోమని కొత్తవారిని ప్రోత్సహిస్తారు పై స్థాయి డిస్ట్రిబ్యూటర్స్. ఇందులో ఉన్న మోసం గ్రహించని కొత్త డిస్ట్రిబ్యూటర్స్ తమపై నున్న డిస్ట్రిబ్యూటర్స్ మాటలునమ్మి వేలరూపాయలు వీటిపై ఖర్చు చేసారు.

'ఎవ్వరినీ వదలొద్దు' కాదేదీ మార్కెటింగ్‌కు అనర్హం, అని కొత్త డిస్ట్రిబ్యూటర్స్‌కు నూరి పోస్తారు ఆమ్వే సీనియర్లు. 'ఒక్కసారి ఆలోచించుకో నువ్వు రోజు ఎంతమందిని కలుస్తావో. అందరూ నీకు కష్టమర్లే. అందరికీ ఆమ్వే గురించి చెప్పు ఎవరినీ వదలకు. పెళ్ళికెళ్ళినా, ఇంకో కార్యానికి వెళ్ళినా కలిసిన వాళ్ళందరికీ ఆమ్వే గురించి చెప్పు.'ఇలా ఉంటుందా ట్రైనింగ్.

1977లో రికార్డ్ చేయబడి అనేక కాపీలు అమ్ముడుబోయిన స్కిప్‌రాస్ అనే ఆమ్వే డిస్ట్రిబ్యూటర్ చెప్పే మాటలు వినండి: 'నేను నా చుట్టూ ఉన్న వాతావరణాన్ని నియంత్రించాను, టీవీ ప్రోగ్రామ్‌లు చూడలేదు, రేడియో వినలేదు, వార్తాపత్రికలు చదవలేదు. పత్రికలూ చూడలేదు. దాదాపు 18 నెలలపాటు నేను నెగెటివ్ మాటలే వినలేదు. రోజు గంటన్నర సేపు ఆ పుస్తకాలు చదవడం, ఆ టేప్‌లు వినడం ఇదీ నా దినచర్య.'

## అబద్ధాలే అబద్ధాలు

డిస్ట్రిబ్యూటర్లను ఎల్లప్పుడూ ఉత్తేజపరచేందుకు అనేక అబద్ధాలు చెప్తుంటారు వారి లీడర్లు. తమ వాస్తవ సంపాదనలకన్నా అనేక రెట్లు ఎక్కువ చేసి చూపుతుంటారు.

ఆమ్వేలో డబ్బుకట్టి సేల్స్‌కిట్ కొనే వాళ్ళలో అతి కొద్దిమంది మాత్రమే మొదటి మెట్టు ఎక్క గలుగుతారనే వాస్తవం కొత్త వాళ్ళ కెవరూ చెప్పరు.

ఆమ్వేలో చేరిన వాళ్ళలో ప్రపంచవ్యాప్తంగా కేవలం 46% మాత్రమే ఇంకా ఆ వ్యాపారంలో ఉన్నారనీ వాళ్ళు కూడా సగటున నెలకు సంపాదించేది తాము కొన్న సేల్స్‌కిట్ పాటి కూడా చేయదనీ వాళ్ళకు ఎవరూ చెప్పరు.

ఆమ్వే ఉత్పత్తుల్లో అధికశాతం డిస్ట్రిబ్యూటర్లు తమ స్వంత అవసరానికే వాడుకుంటారనీ, బైటివారికి అమ్మేది కొంతేననీ వాళ్ళకు ఎవరూ చెప్పరు. ఆమ్వేలో పై స్థాయి డిస్ట్రిబ్యూటర్లు అనేకమంది ఆమ్వే డిస్ట్రిబ్యూటర్ నెట్‌వర్క్‌ను తమ స్వంత వ్యాపారాలు అభివృద్ధి చేసుకునేందుకు ఉపయోగించుకుంటారు.

## సూపర్ కాన్సంట్రేటెడ్‌ఉత్పత్తులు

ఆమ్వే ఉత్పత్తులు 'అంతర్జాతీయ శ్రేణివనీ, సహజసిద్ధమైనవనీ, ఇంకా అవి అధిక గాఢత కలిగినవనీ, ఆరోగ్యానికి క్షేమకరమైనవనీ ఆమ్వే ఉత్పత్తులు స్వంతంగా తయారు చేయబడినవనీ, మధ్యవర్తులు లేరు గనుక ధర తక్కువ'నీ ఇలా చాలా చెబుతారు కంపెనీ వారు. అయితే ఈ మాటల్లో వాస్తవమెంత?

- చివర నుండి మొదలుపెడదాం. మధ్యవర్తులు లేరు కాబట్టి ఆమ్వే ఉత్పత్తుల ధర తక్కువ అనేది హాస్యాస్పదమైన విషయం. మార్కెట్లో ఇప్పుడు దొరికే ఏ మంచి బ్రాండ్ సబ్బు, షాంపూ, డిష్‌వాషింగ్ లిక్విడ్‌ల కన్నా కూడా ఆమ్వే ఉత్పత్తులు అనేక రెట్లు ఖరీదైనవి.




అత్యధికంగా అమ్ముడయ్యే న్యూట్రిలైట్ అనే ఆహార సప్లిమెంట్ పొడిని ఒకసారి పరిశీలిద్దాం.

500 గ్రాముల న్యూట్రిలైట్ ప్రోటీన్ పొడర్ ధర 1,547 రూపాయలు మాత్రమే!

ఇంతా చేసి ఇందులో ఉన్నదేమిటని పరికిస్తే సోయా ప్రోటీను. మార్కెట్‌లో ముప్పైరూపాయలకు కిలో దొరికే సోయాబీన్ ఛంక్స్(మీల్ మేకర్)లో ఉన్నదీ ఇదే సోయాప్రోటీన్. మరి ఆమ్వే ఇంత ఎక్కువ ధరకు ఎందుకు అమ్ముతున్నట్టు? (లోగుట్టు పెరుమాళ్ళకెరుక అన్నట్టు ఆమ్వే ఉత్పత్తులు కేవలం కవరప్ మాత్రమే అనీ నిజానికి చేతులు మారేది డబ్బులేననీ అర్థం అవట్లేదూ?) ఇంకాస్త పరిశీలిద్దాం. ఒక్కపూట న్యూట్రిలైట్ పొడర్(10గ్రా) సేవిస్తే 8 గ్రాముల ప్రోటీన్ వస్తుందట. రోజుకు 25 గ్రాములు సేవిస్తే గుండెజబ్బులు దరిచేరవట.ఈ లెఖ్ఖన రోజుకు 30 గ్రాముల న్యూట్రిలైట్ పొడర్ సేవించాలి. అంటే రోజుకు 90 రూపాయలు మాత్రమే ఖర్చు చేయాలి.

ఆమ్వే మాటలు వింటే మధ్య తరగతి ఇల్లు గుల్లే !

- ఆమ్వే తన ఉత్పత్తులు స్వంతంగా తయారు చేస్తామని చెప్పుకుంటోంది కానీ అదికూడా చిన్న కంపెనీలకు ఉత్పత్తిని కాంట్రాక్టుకు ఇస్తుంది (చాలా ఆమ్వే ఉత్పత్తులు హైద్రాబాద్‌లోని సర్వోత్తమ్‌కేర్‌లోనే తయారు చేయబడతాయి).
- ఆమ్వే తన ఉత్పత్తులు ఎక్కువ గాఢత కలిగినవి కాబట్టి వాటిని అతికొద్ది మోతాదుల్లో వాడవచ్చని చెబుతుంది. అయితే ఇక్కడో సందేహం, అంత ఎక్కువ గాఢంగా ఒక ఉత్పత్తిని తయారు చేసి మళ్ళీ దాని అతికొద్దిగా (ఒక అగ్గిపుల్లను డిష్‌వాషింగ్ లిక్విడ్‌లో ముంచి, ఆ కొద్ది మొత్తం ఒక రోజు గిన్నెలు తోముకోవడానికి సరిపోతుందని చెబుతారు) వాడుకోమనడం ఎందుకు? అయినా ఇంత గాఢంగా తయారుచేసి అది మన శరీరానికి ఏ హానీ కలిగించదంటే నమ్మేదెట్లా?

### ఇతర దేశాల్లో ఆమ్వే లీలలు

- కెనడా ప్రభుత్వానికి కస్టమ్స్ సుంకాలు ఎగవేయడంతో అక్కడి రెవెన్యూ కెనడా అనే ప్రభుత్వ సంస్థ 1970ల్లోనే ఆమ్వేపై ఇరవై అయిదు మిలియన్ డాలర్ల ఫైన్ వేసింది.
- చైనాలో 1995లో ఆమ్వే తన కార్యకలాపాలు ప్రారంభించింది. 1998 నాటికి చైనా ప్రభుత్వానికి ఈ డైరెక్ట్ మార్కెటింగ్ కంపెనీల మోసం అర్థం అయ్యింది. వెంటనే ఆమ్వేను తన ఉత్పత్తులను తప్పనిసరిగా షాపుల్లో అమ్మాలని ఆదేశించింది. అంతే కాదు కంపెనీ నిర్వహించే మీటింగ్‌లు, సెమినార్లకు ప్రభుత్వ అనుమతి కూడా తప్పనిసరి చేసింది.

## ప్రముఖ డైరెక్ట్ మార్కెటింగ్ కంపెనీలు

| | |
|---|---|
|  | కంపెనీ- ఏఎంసీ కుక్‌వేర్, దేశం- స్విట్జర్లాండ్, ఉత్పత్తి - ఒక ప్రత్యేక లోహంతో తయారైన పాత్రల సెట్టు. వెల కేవలం ఇరవై వేలు మాత్రమే |
|  HERBALIFE. | కంపెనీ - హెర్బాలైఫ్, దేశం - అమెరికా, ఉత్పత్తి - బరువు తగ్గించుకోవడానికి వాడే ఉత్పత్తులు, సౌందర్య సాధనాలు |
| oriflame | కంపెనీ -ఆరిఫ్లేమ్, దేశం - బెల్జియం, ఉత్పత్తి - కాస్మెటిక్స్ సౌందర్య పోషకాలు |
| Tupperware | కంపెనీ-టప్పర్ వేర్, దేశం-అమెరికా, ఉత్పత్తి - ప్లాస్టిక్ డబ్బాలు, గిన్నెలు, గ్లాసులు |
|  QUANTUM CREATING OPPORTUNITIES | కంపెనీ - క్వాంటమ్, దేశం-ఇండియా, ఉత్పత్తి - సౌందర్య పోషకాలు, |

# ఎడిటర్ అక్రమ అరెస్ట్

## వెల్లువెత్తిన నిరసనలు

**మే 30 రాత్రి 8 గంటలకు ఔరంగాబాద్‌లోని మహారాష్ట్ర టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ గెస్ట్‌హౌస్‌లో ఒక సమావేశంలో ఉన్న వీక్షణం వర్కింగ్ ఎడిటర్ ఎన్. వేణుగోపాల్, అరుణతార సాహిత్య పత్రిక ఎడిటర్ పినాక పాణి, ఆ పత్రిక మాజీ ఎడిటర్ వి. చెంచయ్య, మేనేజర్ రవికుమార్, సిపిఐ మావోయిస్ట్ మీడియా ప్రతినిధి గంటి ప్రసాదం, అతని సహాయకుడు యమసాని సురేందర్‌లను పోలీసులు ఒక్కుమ్మడిగా విరుచుకుపడి అరెస్ట్ చేశారు.**

ఈ ఆరుగురికి కళ్ళకు గంతలు కట్టి, చేతులు వెనక్కి విరిచి తాళ్ళతో కట్టి పడవేసారు. ఈ దారుణ స్థితిలో వారిని మూడు రోజులపాటు వివిధప్రదేశాలలో తిప్పి జూన్ 2న మీడియా ముందర ప్రవేశపెట్టారు. ప్రభుత్వాన్ని కూలదోయడానికి, హింసాత్మక చర్యలకు పాల్పడడానికి కుట్ర పన్నారని అందుకోసమే ఔరంగాబాద్‌లో సమావేశమై నల్లమల అడవులకు తిరిగి వెళ్తుండగా నిజామాబాద్ శివారు అర్సపల్లి వద్ద అరెస్ట్ చేశామని ఒక అబద్ధపు కథ అల్లి దాని ఆధారంగా అక్రమ కేసులు నమోదు చేశారు.

రాష్ట్ర పోలీసు శాఖ ఎంత అరాచకంగా, అన్యాయంగా ప్రవర్తిస్తున్నదో, మానవహక్కులను ఎంత నిర్లజ్జగా కాలరాస్తున్నదో ఎన్నో ఏళ్లుగా ప్రజాస్వామ్యవాదులు గొంతెత్తి చెబుతూనే ఉన్నారు. అయితే ఈ తాజా ఉదంతం రోజు రోజుకు మితిమీరుతున్న పోలీసు దౌర్జన్యానికి మచ్చుతునక. ఏ సాక్ష్యమూ అక్కరలేదు, ఏ నేరమూ చేయనక్కరలేదు 'మేం అరెస్ట్ చేయాలనుకున్నవారిని అరెస్ట్ చేస్తాం, చిత్రహింసలూ పెడతాం, అవసరమైతే ప్రాణాలూ తీస్తాం' అని విర్రవీగుతున్న పోలీసు శాఖ ఎంతకు తెగించగలదో మనకు 'ఔరంగాబాద్ కుట్రకేసు' తెలియజేస్తుంది.

### ఔరంగాబాద్ సమావేశం ఎందుకు జరిగింది?

సిపిఐ మావోయిస్ట్ రాష్ట్ర కమిటీ సభ్యుడైన గంటి ప్రసాదం ఆ పార్టీకి మీడియా ప్రతినిధిగా వ్యవహరిస్తున్నారు. ఆయన ఇటీవల ప్రభుత్వానికీ మావోయిస్ట్ పార్టీకి జరిగిన చర్చల సమయంలోను, తదనంతరం 'బలరాం' అనే పేరుతో అనేక పత్రికా ప్రకటనలు జారీ చేశారు. పార్టీ గురించి, విప్లవోద్యమం గురించి బైట ప్రజల అభిప్రాయాలు ఎలా ఉన్నాయో తెలుసుకోగోరిన ఆయన ప్రజాబాహుళ్యంలో ఉంటూ జర్నలిస్టుగా, రచయితగా ప్రజలతో



విడుదల అనంతరం విలేఖరులతో మాట్లాడుతున్న వేణుగోపాల్

నిత్యం సంభాషించే ఈ నలుగురినీ (వేణుగోపాల్, పినాకపాణి, చెంచయ్య, రవికుమార్) కలవాలని అభిలషించారు. అయితే రాష్ట్రంలో తీవ్ర ఉద్రిక్త పరిస్థితులు ఉన్నందున ఇక్కడ కలవడం క్షేమకరం కాదని అందుకే ఔరంగాబాద్‌లో కలుద్దామని ఆయన కబురంపారు.

ఈ నలుగురు తమ పేర్లతోనే టిక్కెట్ బుక్ చేసుకుని ఔరంగాబాద్‌లో తమ పేరు మీదనే టూరిజం గెస్ట్‌హౌస్‌లో రూమ్‌లు బుక్ చేసుకున్నారు. అభిప్రాయాలు, భావాలు, పంచుకున్నారు. సమావేశం రెండో రోజు సాయంత్రం పోలీసులు దాడి చేసి నిర్బంధంలోకి తీసుకున్నారు.

మూడు రోజుల పాటు కళ్ళకు గంతలు కట్టి, చేతులు తాళ్ళతో కట్టి ఉంచారు. పెద్దగా ఇంటరాగేషనూ లేదు. పోలీసు పెద్దలు అనేక సమాలోచనల తరువాత మాత్రమే ఈ ఆరుగురినీ కోర్టులో హాజరు పరిచారు. ఏమాత్రం తేడా వచ్చినా వేణుగోపాల్ విడుదల అనంతరం పత్రికా సమావేశంలో చెప్పినట్టు గుర్తుతెలియని మావోయిస్టుల ఎన్‌కౌంటర్ అని మనం పత్రికలలో చదువుకోవలసిన దౌర్భాగ్యం కలిగేదే.

### మావోయిస్ట్ పార్టీ నాయకులను కలవడం నేరమా?

సిపిఐ మావోయిస్ట్ నిషేధిత పార్టీ కాదు. ఆ పార్టీ ప్రతినిధులను మామూలు రాజకీయ పార్టీల నాయకులను కలిసినట్టే కలువవచ్చు. నిషేధం ఉన్న రోజులలో అనేక మంది జర్నలిస్టులు నక్సలైట్ నేతలను కలిసి అనేక కథనాలు రాసారు. చర్చలకు ముందు నిషేధం ఉన్నప్పుడే పౌరస్పందన వేదిక

తరఫున శంకరన్, హరగోపాల్, పొత్తూరి వెంకటేశ్వర రావు తదితరులు నక్సలైట్ నాయకులను కలిసారు. చర్చల సందర్భంలో సాక్షాత్తూ రాష్ట్ర హోం మంత్రి, ఇతర మంత్రులు, అధికారులు మంజీర అతిథి గృహంలో, మర్రి చెన్నారెడ్డి ఇన్‌స్టిట్యూట్‌లో మావోయిస్ట్ పార్టీ రాష్ట్ర అగ్రనాయకులతో సమావేశమయ్యారు. మరి వారిని ఇప్పుడు కలిస్తే నేరమెలా అవుతుంది? కలిసిన నలుగురూ విప్లవ రచయితల సంఘంలో సభ్యులు. అయితే విరసం కూడా నిషేధిత సంస్థకాదు.

## కుట్రదారులెవరు?

అరెస్ట్ కాబడిన ఇద్దరు మావోయిస్ట్ పార్టీ నేతలు, నలుగురు రచయితలు ప్రభుత్వాన్ని కూలదోయడానికి కుట్రపన్నారని, హింసాత్మక చర్యలకు పాల్పడడానికి కుట్రచేశారని ఆరోపిస్తూ, అ అబద్ధపు ఆరోపణలతో ఐపిసి 120బి, 121ఎ, 122 క్రింద కేసులు బనాయించారు.

తాము చెప్పే "కుట్ర"ను రుజువుచేసే అక్షరమొక్కటైనా ఉందా వాళ్ళు స్వాధీనంచేసుకున్న పుస్తకాలలో, కాగితాలలో?

ఇదీ మన పోలీసుల వ్యవహారశైలి. వారు ఎవరినైనా అణచివేయదల్చుకుంటే, నోరు నొక్కదల్చుకుంటే ఏ సాక్షమూ అక్కరలేదు. మార్కెట్లో దొరికే పుస్తకాలు చూపించి కుట్ర కేసులు నమోదు చేయవచ్చు. రోజుల తరబడి కళ్ళకు గంతలు కట్టి, పెడరెక్కలు విరిచి కట్టి చీకటి కొట్లలో మగ్గేలా చేయవచ్చు, ఇంకొంచెం అధికారం తలకెక్కితే పిట్టల్లా కాల్చేసి ఎదురుకాల్పుల కథనల్లవచ్చు. కుట్రలు చేస్తున్నదీ, అబద్ధాలు ఆడుతున్నదీ ఎవరో అర్థమవుతుందా?

## రాష్ట్రాన్ని ఏలుతున్నది ఎవరు?

వీక్షణం ఎడిటర్ వేణుగోపాల్‌ను అక్రమంగా నిర్బంధించడంపై జర్నలిస్టు సంఘాలు తీవ్రంగా స్పందించాయి. రాష్ట్ర ముఖ్యమంత్రి వై ఎస్ రాజశేఖర రెడ్డిని కలిసి వేణుగోపాల్‌ని వెంటనే విడుదల చెయ్యాలని కోరాయి. ఆయన వారితో 'వేణు నాకు బాగా తెలిసిన వ్యక్తి, అతని బెయిల్ పిటిషన్‌ను వ్యతిరేకించవద్దని పోలీసు అధికారులను ఆదేశిస్తాను' అని మాట ఇచ్చారు. తదనుగుణంగా వెంటనే సంబంధిత అధికార్లను ఆదేశించినట్టు మరునాటి వార్తాపత్రికలలో ప్రముఖంగా వచ్చింది.అయినా పోలీసు శాఖ వైఖరిలో మార్పులేదు. మొదటి సారి బెయిల్ పిటీషన్ వేసినప్పుడు సిఎం ఆదేశాలు బేఖాతరు చేస్తూ బెయిల్ ఇవ్వరాదని పోలీసులు కోరారు. మరునాడు జర్నలిస్టులు మళ్ళీ ముఖ్యమంత్రిని కలిసి జరిగింది వివరిస్తే ఆయన ఇదేదో కమ్యూనికేషన్ గ్యాప్ వల్ల జరిగి ఉంటుంది అన్నారట. ఆ కమ్యూనికేషన్ గ్యాప్ ఎంత లోతైన అగాధమంటే ఇది జరిగిన వారం రోజులకు వేణుగోపాల్, మరో ముగ్గురు రచయితలకు రెండోసారి బెయిల్ పిటిషన్ వేసినప్పటికీ కూడా ముఖ్యమంత్రి గారి ఆదేశాలు పోలీసులకు అందలేదు. రెండోసారీ బెయిల్ పిటిషన్‌ను పోలీసు శాఖ వ్యతిరేకించింది. అయితే కేసు పూర్వాపరాలు పరిశీలించిన న్యాయమూర్తి బెయిల్ ఇవ్వవచ్చని తీర్పుచెప్పారు.

మూడు రోజుల అక్రమ నిర్బంధం, 14 రోజుల జైలు నిర్బంధం అనంతరం జూన్ 17వ తేదీ సాయంత్రం 7 గంటలకు మీడియాప్రతినిధులు, శ్రేయోభిలాషులు, కుటుంబసభ్యుల సమక్షంలో వేణుగోపాల్, పినాక పాణి, చెంచయ్య, రవికుమార్‌లు నిజామాబాద్ జిల్లా జైలునుంచి బైటకు అడుగుపెట్టారు.

## వెల్లువెత్తిన నిరసనలు

వీక్షణం ఎడిటర్ వేణుగోపాల్ తదితరుల అరెస్టుకు పెద్దఎత్తున నిరసన వ్యక్తమయింది. ఆంధ్రప్రదేశ్ నుంచే కాక ఇతర రాష్ట్రాలూ, ఇతర దేశాల్లో నుంచి కూడా ఈ అన్యాయపు అరెస్టులను ఖండిస్తూ ప్రజాస్వామిక వాదులు, పౌరహక్కుల వేదికలు, జర్నలిస్టుల సంఘాలు, ప్రవాసాంధ్రులు గళం విప్పారు.

- వేణుగోపాల్ అరెస్టును ఇండియన్ జర్నలిస్ట్ యూనియన్ ప్రధాన కార్యదర్శి కె. శ్రీనివాస రెడ్డి ఒక ప్రకటనలో ఖండించారు.
- ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ అధ్యక్షుడు కె. అమర్‌నాథ్, కార్యదర్శి జి. ఆంజనేయులు వేణుగోపాల్ అక్రమ అరెస్టును ఖండించారు. కేసులు ఎత్తివేసి బేషరతుగా వేణుగోపాల్‌ను విడుదల చేయాలని వారు డిమాండ్ చేశారు.
- అరెస్ట్ వార్త తెలిసిన వెంటనే వీక్షణం ప్రధాన సంపాదకులు వి.హనుమంతరావు ఈ అరెస్టును ఖండిస్తూ ఇది పత్రికా స్వేచ్ఛను హరించడమని, ఒక జర్నలిస్టును ఇటువంటి అక్రమ కేసులో నిర్బంధించడం అన్యాయమని పేర్కొంటూ ఒక పత్రికా ప్రకటన విడుదల చేశారు.
- కొంతమంది జర్నలిస్టులు దిల్‌షుక్‌నగర్, నల్గొండ క్రాస్‌రోడ్స్ చౌరస్తాలలో ఈ అరెస్టుకు నిరసనగా ముఖ్యమంత్రి, డిజిపి దిష్టిబొమ్మలు దగ్ధం చేశారు.
- అన్ని జిల్లాల జర్నలిస్ట్ యూనియన్లు ఈ అరెస్టును ఖండిస్తూ, కేసులు ఎత్తివేయాలని కోరుతూ ముఖ్యమంత్రి ఆఫీసుకు ఫ్యాక్స్‌లు పంపాయి.
- హైదరాబాద్ సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో విరసం ఆధ్వర్యంలో జరిగిన ఒక సభలో ప్రముఖ రచయితలు, కవులు, మేధావులు పలువురు ఈ అక్రమ అరెస్టులను ఖండించారు.

- దాదాపు 150 మంది కవులు, కళాకారులు, రచయితలు, మేధావులు, వేణుగోపాల్ మరి ముగ్గురు రచయితల అరెస్ట్ అక్రమమని ఈ కేసులు ఎత్తివేయాలని కోరుతూ ఒక పిటిషన్‌పై సంతకం చేసి రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తికి అందజేశారు.



విరసం సభలో పాల్గొన్న వక్తలు - వి.హనుమంతరావు, జి.కల్యాణరావు, హరగోపాల్, జ్వాలాముఖి, కానూరి వెంకటేశ్వరరావు, ఎం.టి.ఖాన్, సి.ఎస్.ఆర్.ప్రసాద్, శివారెడ్డి, గీతాంజలి, వనజ



అరెస్ట్ నిరసన సభలో ప్రసంగిస్తున్న వి.హనుమంతరావు



సభకు హాజరైన కవులు, కళాకారులు, మేధావులు

- అక్రమంగా అరెస్ట్ చేసిన ఎన్.వేణుగోపాల్‌ను వెంటనే విడుదల చేయాలని కోరుతూ ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్ట్ యూనియన్ ఆధ్వర్యంలో బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్ ఎదురుగా ధర్నా నిర్వహించారు. యూనియన్ కోశాధికారి రాచమల్ల వెంకటేశ్వర్లు, హెచ్.యు.జె. అధ్యక్షుడు హాష్మి హోం మంత్రి జానారెడ్డికి ఒక వినతి పత్రం సమర్పించారు.

## అంతర్జాతీయ నిరసనలు

- వేణుగోపాల్ తదితరుల అరెస్టును ఖండిస్తూ ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ జర్నలిస్ట్స్ ఒక ప్రకటన జారీ చేసింది. ఐ.ఎఫ్.జె.లో 100 దేశాలకు చెందిన 5 లక్షల మంది జర్నలిస్టులు సభ్యులుగా ఉన్నారు.
- జర్నలిస్టుల హక్కుల కోసం, పత్రికా స్వేచ్ఛ కోసం కృషి చేస్తున్న 'రిపోర్టర్స్ విత్‌ఔట్ బార్డర్స్' అన్న అంతర్జాతీయ సంస్థ అరెస్ట్‌లను తీవ్రంగా ఖండించింది.
- వేణుగోపాల్ మిత్రులు ఈ అక్రమ అరెస్ట్ పూర్వాపరాలు వివరిస్తూ ఒక వెబ్‌సైట్‌ను (www.venu-solidarity.info)ను ప్రారంభించారు. ఈ సైట్‌ను చూసిన అనేకమంది ముఖ్యమంత్రికి, హోంమంత్రికి ఈ అరెస్ట్‌ను ఖండిస్తూ ఇ మెయిల్స్ పంపారు.
- ప్రవాసాంధ్రులు చుక్కా శ్రీనివాస్, ఆరి సీతారామయ్యలు వేణుగోపాల్‌ను, ఇతర రచయితలను విడుదల చేయాలని కోరుతూ www.petition online.comలో ఒక పిటిషన్ పెట్టారు. దీనిపైన ప్రముఖ ప్రవాసాంధ్రులు, జంపాల చౌదరి, పరుచూరి శ్రీనివాస్, అఫ్సర్, వేలూరి వెంకటేశ్వరరావు, వేల్చేరు నారాయణరావు, ఇంకా అనేకులు సంతకాలు చేశారు.
- వేణుగోపాల్, పినాకపాణి, చెంచయ్య, రవికుమార్‌ల అరెస్ట్ అక్రమమని వారిని వెంటనే విడుదల చేయాలని ప్రవాసాంధ్రులు సాజీ గోపాల్, నారాయణస్వామి, గాంధీలు ఒక ప్రకటనలో కోరారు.
- వేణుగోపాల్, ఇతర రచయితల అరెస్ట్‌ను ఖండిస్తూ అనేక వెబ్‌సైట్‌లలో, వెబ్ లాగ్‌లలో, వెబ్ గ్రూపులలో రాశారు.

# వెల్లువెత్తిన నిరసనలు

## వేణును విడుదల చేయాలి

హైదరాబాద్, జూన్ 3, ప్రభాతవార్త

ప్రముఖ పాత్రికేయుడు వేణుగోపాల్‌ను పోలీసులు అక్రమంగా అరెస్టు చేయడాన్ని ఇండియన్ జర్నలిస్ట్ యూనియన్ ప్రధాన కార్యదర్శి కె.శ్రీనివాసరెడ్డి, ఆంధ్రప్రదేశ్ [illegible] జర్నలిస్ట్ యూని[illegible] అధ్యక్షుడు కె.అమర్‌నాథ్, కార్యదర్శి జి.ఆంజ[illegible] ప్రకటన[illegible] దారు. పోలీసుల నిర్బంధంలో [illegible] తుగా విడుదల చేయాలని వా[illegible] విజ్ఞప్తి చేశారు. బాధ్యతాయుతమైన వృత్తిలో ఉద్యోగబా[illegible] నిర్వహిస్తున్న ఒక పాత్రికేయుడిని పోలీసులు నిర్బంధించడం దుర్మార్గమని పేర్కొన్నారు. రాష్ట్రంలో పత్రికల గొంతునొక్కేందుకు చేసేను కార్యక్రమాలకు అనుగుణంగానే [illegible]

## 'వీక్షణం' వర్కింగ్ ఎడిటర్ వేణుగోపాల్‌ను విడుదల చేయాలి

హైదరాబాద్, జూన్ 3 (ఆన్‌లైన్): సామాజిక ఆర్థిక పత్రిక 'వీక్షణం' వర్కింగ్ ఎడిటర్‌గా పనిచేస్తున్న వేణుగోపాల్‌ను వెంటనే విడుదల చేయాలని.. ఆయనపై మోపిన అక్రమ కేసును ఉపసంహరించుకోవాలని వీక్షణం ఛీఫ్ ఎడిటర్ వి.హనుమంతరావు డిమాండ్ చేశారు. శుక్రవారం ఆయన ఈ మేరకు ఒక ప్రకటన విడుదల చేశారు. వేణుగోపాల్ ఒక పత్రికా ఎడిటర్‌గా తన విధి నిర్వహణలో [illegible] స్వాతంత్ర్యాన్ని హరించడమే అవుతుం[illegible] ణలో భాగంగా జర్నలిస్టులు [illegible] డు మామూలు విషయమేనని.. అలాంటప్పుడు ఆ సమావేశానికి హాజరు కావడమే నేరంగా పోలీసు శాఖ భావించి కేసు నమోదు చేయడం న్యాయం కాదని ఆయన తెలిపారు. ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి, హోంమంత్రి జానారెడ్డి ఈ విషయంలో చొరవ చూపి వేణుగోపాల్‌ను విడుదల చేసేలా పోలీస్ శాఖను ఆదేశించాలని హనుమంతరావు కోరారు.

## 'జర్నలిస్టును విడుదల చేయండి'

సైఫాబాద్, జూన్ 4 (ప్రభాతవార్త)

అక్రమంగా పోలీసులు అరెస్టు చేసిన జర్నలిస్టు వేణుగోపాల్‌ను తక్షణమే బేషరతుగా విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ అనేక మంది జర్నలిస్టులు శనివారం ప్రెస్‌క్లబ్ ఎదుట నిరసన ప్రదర్శన నిర్వహించారు. హెచ్‌యుజె నేతృత్వంలో జరిగిన ఈ ప్రదర్శనలో పాల్గొన్న పాత్రికేయులు జర్నలిస్టులపై దాడులు అరికట్టాలని, వేణుగోపాల్‌ను తక్షణమే విడుదల చేయాలని, పత్రికా స్వేచ్ఛను కాపాడాలని డిమాండ్ చేస్తూ నినాదాలు చేశారు. ఈకార్యక్రమంలో హెచ్‌యుజె అధ్యక్షుడు హష్మి, ప్రధాన కార్యదర్శి మంజరి, ఎపియుడబ్ల్యుజె కోశాధికారి ఆర్.వెంకటేశ్వర్లు, నగర ఉపాధ్యక్షుడు జి.రామ్మోహన్‌రెడ్డి, కోశాధికారి ఆనందం తదితరులు పాల్గొన్నారు.

## వేణుగోపాల్ విడుదలకు జర్నలిస్టుల నిరసన ప్రదర్శన

పోలీసులు అక్రమంగా అరెస్టు చేసిన జర్నలిస్టు, విరసం నేత ఎన్.వేణుగోపాల్‌ను తక్షణమే బేషరతుగా విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ పలువురు జర్నలిస్టులు శనివారం ప్రెస్‌క్లబ్ ఎదుట నిరసన ప్రదర్శన నిర్వహించారు. హెచ్‌యుజె ఆధ్వర్యంలో జరిగిన ఈ ప్రదర్శనలో.. జర్నలిస్టులపై దాడులు అరికట్టాలని, వేణుగోపాల్‌ను తక్షణమే విడుదల చేయాలని, జర్నలిస్టులపై పోలీసుల వేధింపులు ఆపాలని, పత్రికాస్వేచ్ఛను కాపాడాలని డిమాండ్ చేస్తూ నినాదాలు చేశారు. ఈ నిరసన కార్యక్రమంలో ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ రాష్ట్ర కోశాధికారి రాచమళ్ళ వెంకటేశ్వర్లు, హెచ్‌యుజె అధ్యక్షుడు హష్మి తదితరులు పాల్గొన్నారు. అనంతరం హోం మంత్రి జానారెడ్డికి వినతిపత్రం సమర్పించారు.



## పాత్రికేయుడి అరెస్టుకు నిరసనగా దిల్‌సుఖ్ నగర్‌లో ధర్నా

పి అండ్ టి కాలనీ, మే 3 (ప్రభాతవార్త):

సీనియర్ జర్నలిస్టు, వీక్షణం పత్రిక ఎడిటర్ వేణుగోపాల్‌ను పోలీసులు అరెస్టు చేయడాన్ని నిరసిస్తూ శుక్రవారం దిల్‌సుఖ్‌నగర్ రాజీవ్‌చౌక్ వద్ద ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా జర్నలిస్టులు ధర్నా నిర్వహించారు. అనంతరం జర్నలిస్టుల పట్ల ప్రభుత్వం అవలంభిస్తున్న ఆటవిక ధోరణిని నిరసిస్తూ సిఎం వై.ఎస్.రాజశేఖర్‌రెడ్డి దిష్టిబొమ్మను దహనం చేశారు. ఈ సందర్భంగా వారు మాట్లాడుతూ పత్రికా స్వేచ్ఛను హరిస్తూ, ప్రభుత్వం, పోలీసులు ఎన్నో వ్యయ ప్రయాసాలకోర్చి నిజానిజాలను వెలికితీస్తున్న జర్నలిస్టులను అక్రమ అరెస్టులు చేయడం హేయమైన చర్య అని ఖండించారు. ఈ కార్యక్రమంలో జర్నలిస్టులు గోపి యాదవ్, సతీష్, 'పెడికిలి' రాజు, వాసు, శ్రీనివాస్‌గౌడ్, ఎం.రవీందర్‌రెడ్డి, నర్సింహారావు, సూర్యప్రసాద్, నందీశ్వర్, రవిగౌడ్, దుగ్గు రఘు, రవీందర్‌రెడ్డి, జి.బి.గౌడ్, వెంకటేష్, సాగర్‌లు పాల్గొన్నారు. జర్నలిస్టులకు మద్దతుగా బిజెపి కౌన్సిలర్లు కర్ల శ్రీనివాసరాజు, జయప్రకాష్‌లతో పాటు, పలువురు కార్యకర్తలు పాల్గొన్నారు.

జర్నలిస్టు అరెస్టుకు నిరసనగా సిఎం దిష్టిబొమ్మ దహనం చేస్తున్న దృశ్యం

# కొత్త పుస్తకాలు

'వీక్షణం' లో ఇకనుంచి ప్రతి సంచికలోనూ పుస్తక సమీక్ష, పుస్తక పరిచయం, పుస్తక స్వీకారం ఉంటాయి. అయితే సామాజిక, ఆర్థిక పత్రికగా 'వీక్షణం' ఈ శీర్షికల కింద సృజనాత్మక సాహిత్య ప్రక్రియల (కవిత్వం, కథ, నవల, నాటకం, సాహిత్య, విమర్శ, దృశ్య కళారూపాలు) పుస్తకాలను పరిచయం చేయాలనుకోవడం లేదు. ఇవాళ తెలుగులో సామాజిక, ఆర్థిక, రాజకీయ, తాత్విక, చారిత్రక అంశాలకు సంబంధించిన ఎన్నో విశ్లేషణాత్మక పుస్తకాలు వెలువడుతున్నాయి. వ్యాసం, వాదం, విశ్లేషణ, చర్చ రూపంలో ఉంటున్న ఈ పుస్తకాల సమీక్ష, పరిచయం, స్వీకారంలకు ఈ శీర్షిక పరిమితమవుతుంది. ప్రచురణకర్తలు తమ పుస్తకాలను రెండు కాపీల చొప్పున వీక్షణం కార్యాలయానికి పంపాలి.




**భూమిపై హక్కు కోసం** - కొత్తూర్ గైరాన్ భూముల పట్టాల కోసం పోరాటం-కుల నిర్మూలనా పోరాట సమితి, మహబూబ్‌నగర్ జిల్లా కమిటీ. వెల : రు. 5/- ప్రతులకు : కె. సత్యనారాయణ, కెఎన్‌పిఎస్ రాష్ట్ర కార్యదర్శి, సీఫెల్ క్వార్టర్స్, ఫ్లాట్ నం. 52, తార్నాక, హైదరాబాద్.




**మార్క్సిజం లెనినిజం మావో యిజం-స్టడీనోట్స్** న్యూవిస్టాస్ పబ్లికేషన్స్, వెల : రు. 50/- ప్రతులకు : మైత్రి బుక్‌హౌజ్, విజయవాడ, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్‌హౌజ్, సహచర బుక్ మార్క్, హైదరాబాద్.




**బర్బరత్వపు సామ్రాజ్యం**- జాన్ బెల్లామీ ఫాస్టర్, బ్రెట్ క్లార్క్, అను : ఎన్. వేణుగోపాల్, వెల రు. 5/-. ప్రచురణ : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, ప్రతులకు : డి. రాధాకృష్ణమూర్తి, 5-85-4/బి, వండరీపురం 1వ లైను, గుంటూరు - 522 002.




**మార్క్స్ కాపిటల్ అధ్యయనానికి ఒక పరిచయం** - జె. అల్వారి, అను : రావు కృష్ణారావు, వెల రు. 13. ప్రచురణ : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, ప్రతులకు : డి. రాధాకృష్ణ మూర్తి, 5-85-4/బి, వండరీ పురం 1వ లైను, గుంటూరు - 522 002.




**లియో హ్యూబర్‌మన్, స్వీజీ వారి మిత్రబృందపు కృషి**- మానేపల్లి, వెల రు. 8. ప్రచురణ : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, ప్రతులకు : డి. రాధాకృష్ణ మూర్తి, 5-85-4/బి, వండరీపురం 1వ లైను, గుం టూరు - 522 002.




**భావజాలం-మార్క్స్-డేవిడ్ మెకలలాన్**, అను : ఆర్వీయార్ మాస్టారు. వెల : రు. 8/-. ప్రచురణ : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, ప్రతులకు : డి. రాధాకృష్ణ మూర్తి, 5-85-4/బి, పండరీ పురం 1వ లైను, గుంటూరు - 522 002.

# విద్యారంగంలో పెనుమార్పులు, ముప్పలు

- బి.వి. రాఘవులు

రాష్ట్రంలో సంస్కరణలు ప్రారంభమైన తర్వాత విద్యారంగంలో పెనుమార్పులు సంభవించాయి. విద్యావ్యవస్థ రూపురేఖలు వేగంగా మారిపోయాయి. విద్యా ప్రైవేటీకరణ, వ్యాపారీకరణ ఉచ్ఛస్థాయికి చేరింది. విద్యానంస్థలు నిరంకుశత్వ కేంద్రాలుగా మార్చి వేయబడుతున్నాయి. విద్యార్థులు భావి భారత పౌరులుగా కాకుండా, ఆలోచనా శక్తి లేని రాబోట్‌లుగా మార్చివేయబడుతున్నారు. పక్కవారిని పట్టించుకోని స్వార్థపూరిత వ్యక్తివాదులుగా దిగజార్చబడుతున్నారు.

1996లో ప్రపంచబ్యాంకు రూపొందించిన "ఆంధ్రప్రదేశ్‌లో ఆర్థిక సంస్కరణల ఎజెండా" నివేదికలో విద్యారంగంలో అనుసరించాల్సిన ప్రభుత్వ విధానం గురించి నిర్దేశించారు. ఉన్నత విద్య నుండి ప్రభుత్వం తప్పుకొని, ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహించాలని చెప్పింది. ప్రభుత్వం ప్రాథమిక విద్యమీదనే కేంద్రీకరించాలని చెప్తూనే, అది సహాయక పాత్రగానే వుండాలని సూచించింది. అంటే ప్రాథమిక విద్యను కూడా ప్రైవేటు రంగానికి లేక ప్రజలకు వదిలేయాలి. 1997 నుండి విద్యారంగంలో జరుగుతున్న పరిణామాలు ప్రపంచబ్యాంకు ఇచ్చిన పై అవగాహనకు అనుగుణంగానే జరుగుతున్నాయి. విచ్చలవిడిగా ప్రైవేటు ఇంజనీరింగ్, మెడికల్, డెంటల్, బిఇడి తదితర ప్రొఫెషనల్ కాలేజీలు ప్రభుత్వం మంజూరు చేసింది. విద్యాభివృద్ధి కన్నా ఈ ప్రైవేట్ కాలేజీల ద్వారా క్షణాల్లో కోట్లకు పడగలెత్తాలన్న ధ్యేయమే యాజమాన్యాలను నడుపుతున్నది. అంతకుముందే ఇంటర్మీడియెట్ విద్యలో ప్రారంభమైన ప్రైవేట్ రెసిడెన్షియల్ కోచింగ్ కళాశాలలు ఇంతింతై వటుడింతై అన్నట్టు కార్పొరేట్ సంస్థలుగా ఎదిగి, రాష్ట్ర వ్యాపితమై ప్రభుత్వాలనే శాసించే స్థితికి వచ్చాయి. విశ్వ విద్యాలయాల్లోను, ప్రభుత్వ కళాశాలల్లోను సెల్ఫ్ ఫైనాన్స్ కోర్సుల పేరిట చదువును వ్యాపారమయం చేశారు. వివిధ రకాల ఫీజులను అనేక రెట్లు పెంచారు. విశ్వవిద్యాలయాలు, ప్రభుత్వ, ఎయిడెడ్ విద్యాసంస్థలకు బడ్జెట్ కేటాయింపులు తీవ్రంగా కత్తిరించారు. దీనితో ఉన్నత విద్య అంతా ప్రైవేట్ విద్యా వ్యాపారుల చేతుల్లోకి పోయింది. ఈ మార్పు మూలంగా ప్రతి ఏటా వేల కోట్ల రూపాయాలను సామాన్య, మధ్యతరగతి తల్లిదండ్రుల కష్టార్జితం నుండి విద్యా వ్యాపారస్తులు కొట్టేస్తున్నారు. ఇది రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాల పుణ్యమే.

ప్రాథమిక, మాధ్యమిక విద్యలో కూడా ప్రభుత్వ పాఠశాలల బాధ్యతను విద్యా కమిటీల పేరుతో తల్లిదండ్రులపైకి నెడుతున్నాయి. పరోక్షంగా ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహిస్తున్నది. కాన్వెంట్లు, ప్రైవేట్ రెసిడెన్షియల్ పాఠశాలలు కుప్పలు తెప్పలుగా వస్తున్నాయి. ప్రభుత్వ పాఠశాలల్లో యూజర్ ఛార్జీల పేర తల్లిదండ్రుల నుంచి డబ్బులు వసూలు చేయడం, బడ్జెట్ కోత మూలంగా సౌకర్యాలు బలహీనం కావడం వలన తల్లిదండ్రులు ప్రభుత్వ పాఠశాలల పట్ల విముఖత, ప్రైవేట్ విద్యపట్ల సుముఖత పెంచుకుంటున్నారు. ప్రైవేట్ రంగాన్ని ప్రోత్సహించడానికి బుద్ధిపూర్వకంగానే ప్రభుత్వం ఈ పద్ధతిని అనుసరిస్తున్నది. పైకి ప్రాథమిక విద్య పట్ల ఎంతో శ్రద్ధ కనబరుస్తున్నట్లు మాటలు గుప్పించడం తప్ప, ఆచరణలో ప్రభుత్వ పాఠశాల విద్యను బలహీనం చేసున్నది.

ప్రైవేట్ విద్యాసంస్థలకు సంబంధించి ఈ మధ్య సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు కూడా విద్యా వ్యాపారీకరణకు మరింత ప్రోత్సాహం ఇచ్చింది. ఇప్పుడు కోర్టు ఆమోద ముద్ర పడడంతో విద్య వ్యాపారీకరణ, ప్రైవేటీకరణ ఇంకా విశృంఖలంగా పెరిగే అవకాశం ఏర్పడింది. ప్రభుత్వ విధానాల మూలంగా ఎటువంటి గత్యంతరం లేని పేదలు మాత్రమే ప్రభుత్వ విద్యాసంస్థలకు పిల్లలను పంపుతున్నారు. ఆ రకంగా విద్యారంగంలో కూడా ప్రభుత్వ విధానాలు సామాజిక అసమానతలు, తారతమ్యాలను ప్రభుత్వం పెంచి పోషిస్తున్నది. ఇప్పటివరకు చదువుకు దూరంగా ఉంచబడుతున్న గిరిజనులు, దళితులు, మహిళలు, వెనుకబడిన కులాల వారు, మైనారిటీలు విద్యకు మరింత దూరమౌతున్నారు.

విద్యావ్యాపారీకరణ, ప్రైవేటీకరణ మూలంగా మొత్తం విద్యారంగం కలుషితమై పోతున్నది. కొనుక్కోగలిగిన వాడికే విద్య, పేదవాడు విద్యకు దూరమే. ప్రైవేటు యాజమాన్యాలు సంపాదించిన నడమంత్రపు సొమ్ముతో విద్యాశాఖనంతటిని అవినీతిలో ముంచారు. పేపర్ల కొనుగోలు, రిజల్ట్ తారుమారు, సెంటర్ల గోల్‌మాల్ వంటి అక్రమాలెన్నో ఈ కాలంలో బట్టబయలయ్యాయి. ఈ ప్రైవేటు సంస్థల మధ్య ఏర్పడుతున్న అనారోగ్య పోటీ మూలంగా విద్యార్థుల్లో సృజనాత్మకతను, ఆలోచనా శక్తిని పెంచడం కాకుండా విద్యార్థులను రుబ్బుడు యంత్రాలుగా మార్చివేస్తున్నాయి. వత్తిడిని తట్టుకోలేక విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకునే పరిస్థితికి మూలం ఇదే. ఈ కాలంలో జరిగిన విద్యార్థి ఆత్మహత్యల పరిశీలనకై నియమించబడిన నీరదారెడ్డి కమిటి నివేదిక వెలుగు చూడలేదంటే ప్రభుత్వంలో ప్రైవేటు యాజమాన్యాల పలుకుబడి ఎంత బలంగా వుందో వేరే చెప్పనవసరం లేదు.

ప్రభుత్వం విద్యారంగానికి కేటాయింపుల కోత పెడుతున్నది. ద్రవ్య లోటును తగ్గించాలని ప్రపంచబ్యాంకు చేస్తున్న వత్తిడికి తలొగ్గి, ప్రధానంగా విద్య, వైద్య, సంక్షేమ రంగాలకు కోత పెడుతున్నది. దీనిమూలంగా విశ్వవిద్యాలయాల గ్రాంట్లు తగ్గించబడ్డాయి. ఉపకార వేతనాలకు, ఎయిడెడ్ సంస్థలకు నిధుల కోత పెట్టారు. అవసరమైనంత సంఖ్యలో ఉపాధ్యాయులను నియమించకుండా, విద్యా వాలంటీర్లు, స్పెషల్ విద్యా వాలంటీర్లు పేరుతో నామకా జీతాలిచ్చి, వెట్టి చాకిరి చేయించుకుంటున్నారు. కాంట్రాక్ట్ లెక్చరర్స్‌ను, పీస్ రేట్ లెక్చరర్స్‌ను

పెట్టి కళాశాల విద్యను బలహీనం చేశారు. ఉపకార వేతనాల మొత్తం సంఖ్య తగ్గిపోయి పేదల పిల్లలు క్రమేణా చదువుకు దూరమౌతున్నారు. స్కాలర్‌షిప్‌ల బడ్జెట్ పెంచకుండా, ప్రైవేట్ కళాశాలల్లో విద్యార్థులకు అధిక ఫీజులను రీయింబర్స్‌మెంట్ చేస్తుండడంతో ప్రభుత్వ విద్యాలయాల్లో కాలేజీల్లో ఉన్నవారికి గతంలో వలె ఉపకార వేతనాలు లభ్యం కావడం లేదు.

విద్యారంగంలో అమలుజరుగుతున్న ఈ వినాశకర సంస్కరణల మూలంగా విద్యార్థులు, ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు అన్ని విధాలా నష్టపోతున్నారు. ప్రారంభంలో అందరూ గమనించకపోయినా, ప్రత్యక్ష అనుభవంలో సంస్కరణల హానిని క్రమేణా గమనించగలుగుతున్నారు. ప్రశ్నిస్తున్నారు. ఇప్పుడిప్పుడే ప్రతిఘటించడానికి సిద్ధమౌతున్నారు. సంస్కరణలు ఎక్కడ అమలు జరిగినా, ప్రజలు ప్రతిఘటించే అవకాశం వుందనీ అటు ప్రపంచబ్యాంకుకు, ఇటు పాలకులకు కూడా తెలుసు. అందుకే ముందునుంచి ఒక పథకం ప్రకారం ప్రతిఘటనను నిరోధించేందుకు ద్విముఖ వ్యూహాన్ని అమలు చేస్తున్నారు. విద్యాసంస్థల్లో ప్రజాస్వామ్యాన్ని నాశనం చేయడం మొదటిది. ప్రభుత్వ విధానాల గురించి, రాజకీయాల గురించి ఆలోచించకుండా ఉపాధ్యాయులను, విద్యార్థులను రాజకీయ రహితులుగా చేయడం రెండవది.

మన రాష్ట్రంలో మొత్తం విద్యాసంస్థల్లో విద్యార్థి సంఘాల ఎన్నికలను రద్దు చేశారు. స్వచ్ఛందంగా నడిచే విద్యా సంఘాలను కూడా సహించనని పలుమార్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించారు. విద్యార్థి సంఘాలు హానికరమైనవిగా చిత్రీకరించేందుకు శత విధాల ప్రయత్నించారు. విద్యాసంస్థల్లో న్యాయమైన సమస్యలపై చిన్న చిన్న ఆందోళనలు చేసినప్పటికి నిరంకుశంగా అణచివేసేందుకు ప్రయత్నించారు. ఆంధ్రా యూనివర్సిటీలో చంద్రబాబు 'క్లోన్'ను అని అనుకుంటున్న విసిగారు క్యాంపస్‌లో ప్రదర్శనలను, సభలను, ధర్నాలను, కనీసం సమావేశాలను కూడా అనుమతించకుండా వీడియో కెమెరాలతో వెంటాడే క్రమశిక్షణా చర్యలు తీసుకోవడానికి పూనుకున్నారు. ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాలను కూడా భయభ్రాంతులను చేశారు. తప్పుడు విధానాలను ప్రశ్నించిన విద్యార్థులను, ఉపాధ్యాయులను సస్పెన్షన్‌లు చేశారు. ఈ నిరంకుశ పోకడలకు వ్యతిరేకంగా యూనివర్సిటీ క్యాంపస్‌లోనూ, పరిధిలోనూ 2002 సంవత్సరంలో పెద్ద ఉద్యమం జరిగింది. మిగిలిన విశ్వవిద్యాలయాల్లో కూడా కొద్దో గొప్పో ఇటువంటి అప్రజాస్వామిక పద్ధతులు అమలయ్యాయి. కొద్దొగొప్పో ఆలోచనా శక్తి గలిగి, బాధ్యత కలిగిన పౌరులుగా ఆలోచించగలిగే విశ్వవిద్యాలయ విద్యార్థుల పట్లే ఇలా వ్యవహరిస్తుంటే కింది స్థాయి విద్యా సంస్థలపై ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

నిరంకుశ పద్ధతుల ద్వారా విద్యార్థుల నుండి వచ్చే ప్రతిఘటనను అణచే ప్రయత్నంతో పాటు, మానసికంగా విద్యార్థులను రాజకీయ రహితంగా చేయాలనే ప్రయత్నం కూడా పెద్ద ఎత్తున ప్రభుత్వం సాగిస్తున్నది. ముఖ్యమంత్రి చరిత్ర, తదితర సామాజిక శాస్త్రాలపై దాడి చేయడం, అవి పాఠ్యాంశాలుగా అవసరం లేదని ప్రచారం చేయడం విద్యార్థులకు సామాజిక స్పృహ లేకుండా చేయడానికి చేసిన ప్రయత్నమే. రాజకీయాలకు, అభివృద్ధికి ఏ సంబంధం లేనట్లు చిత్రీకరించి, రాజకీయాలంటే ఏహ్యభావాన్ని కలిగించి, విద్యార్థులను రాజకీయంగా దూరముంచడంలో కుత్సితం దాగేదికాదు. ప్రపంచబ్యాంకు ప్రోత్సాహంతో తాను అనుసరిస్తున్న విధానాల ప్రమాదాన్ని అర్థం చేసుకొని, ప్రజలకు విప్పి చెప్పే శక్తి వారికి లేకుండా చేయడమే ఈ వాదనల ఉద్దేశ్యం అయితే సంస్కరణల పర్యవసానాలు కళ్ళెదుట కనపడుతుంటే, బ్యాంకు - బాబులు కళ్ళకు కట్టాలనుకుంటున్న గంతలు పటాపంచలవుతున్నాయి. క్రమేణా విద్యార్థులు ప్రతిఘటించడం ప్రారంభమౌతున్నది.

టిడిపి ద్విముఖ వ్యూహంతో పనిచేస్తుంటే కేంద్రంలో వున్న బిజెపి త్రిముఖ వ్యూహాన్ని ప్రయోగిస్తున్నది. పైన వివరించిన రెండు అంశాలతో పాటు, మతతత్వ సిద్ధాంతాలు, విచ్ఛిన్నకర సిద్ధాంతాల ద్వారా విద్యార్థుల్లో అనైక్యతను, విద్వేషాలను రెచ్చగొట్టి, సంస్కరణల నుండి దృష్టి మళ్ళించేందుకు పూనుకున్నారు. (రాష్ట్రంలో టిఆర్ఎస్ పేరుతో ముందుకు వచ్చిన విభజన వాదన కూడా వస్తుగతంగా నిర్వహిస్తున్న పాత్ర ఇదే.)

చంద్రబాబు చెబుతున్న సంస్కరణల వాదనలుగాని, సంస్కరణలు ప్రోత్సహిస్తున్న వినియోగవాదంగాని, బిజెపి ముందుకు తెస్తున్న మతోన్మాదం గాని, టిఆర్ఎస్ చెబుతున్న విభజన వాదం కాని ఈ రోజు సహాయ పడేది మనలాంటి వర్ధమాన దేశాల ప్రయోజనాలకు హాని కలిగించే సామ్రాజ్యవాద దేశాలకు, వాటిలోని బహుళజాతి కంపెనీలకు. ఈ పాత్రను కప్పిపెట్టుకునేందుకు, తమ దుష్ట పాత్రను ప్రజలు గమనించకుండా చేసేందుకు ప్రజల మనోభావాలను వక్రీకరించి పొరపాటు వాదనలను ముందుకు తీసుకు వస్తుంటారు. ఇప్పుడు మనం చూస్తున్నది అదే. ఈ శక్తులు ముందుకు తెస్తున్న నినాదాల స్వభావాన్ని, వాటి అసలు ప్రయోజనాన్ని విద్యార్థులు గమనించకపోతే తమకు వస్తున్న సమస్యలకు మూలమేమిటో తెలుసుకోలేరు. కీలెరిగి వాత పెట్టడం సాధ్యంకాదు. ఎండమావిని చూసి దాహం తీర్చుకోవచ్చని ఆశ పడ్డట్టుగా భ్రమ పడుతూనే వుంటారు.

విద్యారంగ శ్రేయోభిలాషులు, విద్యార్థి సంఘాలు, ఈ వాస్తవాలు గుర్తించాలి. విద్యారంగాన్ని విచ్ఛిన్నం చేస్తున్న, విద్యారంగాన్ని సామాన్య ప్రజలకు దూరం చేస్తున్న, విద్యారంగాన్ని కోట్లకు పడగలెత్తడానికి మంచి వనరుగా మారుస్తున్న, విద్యారంగాన్ని సామాన్య ప్రజల మధ్య వైషమ్యాలను రెచ్చ గొట్టడానికి సాధనంగా మలుస్తున్న శక్తులను పసిగట్టి, బట్టబయలు చేయాల్సిన కర్తవ్యాన్ని నిర్వహించాలి. విద్యారంగంలో ప్రజాస్వామ్యాన్ని, సామాజిక న్యాయాన్ని, సేవా లక్షణాన్ని కాపాడుకునేందుకు కృషి చేయాలి.

(ప్రజాశక్తి బుక్‌హౌస్ 2004 మార్చ్ ప్రచురణ 'ప్రపంచబ్యాంకు ఫర్మానాలు - ప్రజాకంటక విధానాలు' నుంచి) ❑

## మీలోని రచయితను వెలికి తీయండి!
## వీక్షణం మీ రచన కోసం వేచి చూస్తోంది!

మీ చుట్టూ, మీ గ్రామంలో, మీ బస్తీలో, మీ పని స్థలంలో, మీరు పనిచేసే సంఘంలో ఏదో ఒక ఘటన మిమ్మల్ని కదిలిస్తుంది. మీలో ఆలోచనలు రగిలిస్తుంది. ఆ ఘటన వెనుక ఉన్న సామాజిక, రాజకీయ, ఆర్థిక మూలాల గురించి మీరు అన్వేషిస్తుంటారు. మీ ఆలోచనలను రాయండి. సరిగ్గా 'వీక్షణం' ఎదురు చూస్తున్నది అటువంటి క్షేత్ర నివేదికల కోసమే. 'వీక్షణం' ఆర్థిక, సామాజిక పత్రిక తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే ఆలోచనలకు, అన్వేషణలకు ఒక వేదిక. మీరు అట్టడుగు నుంచి, మీ అనుభవాల నుంచి పంపే నివేదికలు ఆ ఆలోచనల్లో, అన్వేషణల్లో భాగమే.

'వీక్షణం' ను ఇటు క్షేత్ర నివేదికల, అటు నిపుణుల విశ్లేషణల మేలు కలయికగా తీర్చిదిద్దాలని సంపాదకవర్గం ప్రయత్నిస్తోంది. మన జీవితాల మీద ప్రగాఢ ప్రభావం వేయగల అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ పరిణామాల మీద నిపుణుల విశ్లేషణలు ఎంత అవసరమో, ఆ పరిణామాలు అట్టడుగు మనుషుల జీవన సరళిని ఎట్లా మారుస్తున్నాయో కింది నుంచి నివేదించడమూ అంతే అవసరం.

వీక్షణం మీ పత్రిక వీక్షణం మన పత్రిక

వీక్షణం తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే అన్వేషణ. ఆ అన్వేషణలో భాగం పంచుకోండి.

రచనలు పంపవలసిన చిరునామా:

సంపాదకుడు, వీక్షణం, సి.డి.ఆర్.సి, మైత్రి రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.

PRINTED BOOK

RNI Regn. No. APTEL/2003/11482

Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06



# ప్రతి అడుగు ప్రజలకోసం



## స్ఫూర్తివంతమైన నాయకత్వంలో అభివృద్ధి పథంలో ఆంధ్రప్రదేశ్

- ఊరూరా, వాడవాడల పర్యటిస్తూ, ప్రజలను పలకరిస్తూ సమస్యలను పరిష్కరించే ప్రయత్నమే 'రాజీవ్ పల్లెబాట'
- ప్రతి గ్రామాన్ని ఇంటర్‌నెట్ ద్వారా అనుసంధానం చేసి వారికి ఆన్‌లైన్ ద్వారా సమాచారం అందించడం కోసం 'రాజీవ్ ఇంటర్నెట్ విలేజ్'
- నిరుద్యోగ యువత కోసం ఉపాధి లక్ష్యంగా 'రాజీవ్ యువశక్తి'
- రూ. **500** కోట్లతో ఎస్.సి., ఎస్.టి, బలహీన వర్గాల సమగ్రభూమి అభివృద్ధి ప్రాజెక్టు 'ఇందిర ప్రభ'
- ప్రజలతో ప్రత్యక్ష సంబంధాలను కలిగి వుంటూ, వారి సమస్యలను తెలుసుకుని, వాటికి తక్షణమే తగిన పరిష్కారాన్ని చూపించే 'రాజీవ్ నగరబాట'
- పట్టణ పేదలకు అందుబాటు ధరలో గృహ వసతి కల్పించేందుకు 'రాజీవ్ గృహకల్ప'
- ఎస్.సి., ఎస్.టి., బి.సి. మరియు ఇతర భూమి లేని లక్ష మంది నిరుపేదలకు రిపబ్లిక్ డే ఒక్క రోజునే **1,50,000** ఎకరాల భూమి పంపిణీ చేయడం జరిగింది.
- వచ్చే ఐదేళ్ళలో రికార్డు స్థాయిలో **46** వేల కోట్ల రూపాయల ఖర్చుతో నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రణాళికలు

జారీ చేసినవారు : సమాచార, పౌరసంబంధాల శాఖ

R.O. NO. 144/Sou/Advt.I/2005

Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No.3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 55843495 DTP at Samata Graphics, Hyderabad. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. Editor : N. Venugopal

**VEEKSHANAM**
301, Mythri Residency,
3-6-394, Road No.3, Himayatnagar, Hyderabad - 500 029.